


# పదిలమైన ఇళ్లు!

'మేడంటే మేడా కాదు.. గూడంటే గూడూ కాదు.. పదిలంగా కట్టుకున్న ఇళ్లు మావి' అని పాడుకోవచ్చేమో ఇండోనేషియాలోని యోగ్యకర్త గ్రామస్థులు. కొంతకాలం క్రితం వచ్చిన భూకంపంవల్ల ఆ దేశంలో రెండులక్షల ఇళ్లు నేలమట్టమయ్యాయి. దాంతో అగ్ని ప్రమాదాలు, భూకంపాలు వంటి వైపరీత్యాల నుంచి రక్షణనిచ్చే భద్రమైన ఇళ్లను కట్టుకుంటున్నారట! అగ్ని పర్వతాల లావానుంచి ఏర్పడ్డ అత్యంత పటిష్ఠమైన బెసాల్ట్‌ను ఈ నిర్మాణాల్లో వాడుతున్నారట!

# మనసున ఉన్నదీ...

★ జులై సంచికలోని డా.జి. సురేశ్‌బాబు నవల 'ప్రియదర్శిని పార్క్' మనోవిశ్లేషణాత్మకంగా ఉంది. మనసు లోతుల్ని సుతారంగా స్పృశిస్తూ భిన్నమైన రీతిలో ప్రేమ కథని రాసిన తీరు నచ్చింది. కథనం పట్టుగా.. సంభాషణలు సూటిగా ఉన్నాయి. చతురసమ్'గతులు లోకంలోని వివిధ విషయాల కదంబంలా ఆసక్తిని కలిగించాయి. చమత్'కారం'లో ఒంటి కన్ను రాజుని మన్మథుడిగా వర్ణించడానికి కవి చేసిన గారడీ మురిపించింది. 'కొత్తగాలి' కవితలు వర్తమాన స్థితిగతులకి అద్దం పట్టాయి. పెద్దకథ 'యతి', చతురకత 'మా అత్త బంగారం' బాగున్నాయి. నవలావలోకనంలో అధరాపురపు తేజోవతి నవల 'పూర్వాసంధ్యా ప్రవర్తతే' సమీక్ష సముచితంగా ఉంది. ముఖచిత్రం ముచ్చటగా ఉంది.

– **డి. శ్రీనివాస దీక్షితులు,** నరసరావు పేట

★ రకరకాల మనుషుల మనోగతాలకు అక్షర రూపమిచ్చి 'ప్రియదర్శిని పార్క్'ను ఏకబిగిన చదివింపజేసిన డా. సురేశ్‌బాబు అభినందనీయులు. అమెరికా మూలకథ 'యతి'ని శారదాప్రసాద్ చక్కగా అనువదించారు. చతురకత 'మా అత్త బంగారం' హృద్యంగా ఉంది. 'కొత్తగాలి' కవితలన్నీ రసరమ్యంగా ఉన్నాయి. ముఖ్యంగా స్వచ్ఛతపై అల్లిన చిరుకవితలు మనోహరంగా ఉన్నాయి. చతురసమ్'గతులు సమాచారాత్మకంగానే కాక వినోదాత్మకంగానూ ఉన్నాయి. 'భామనే.. సత్యభామనే..!'లోని అన్ని శీర్షికలూ బాగున్నాయి.

– **డాక్టర్ శివభూషణం,** కర్నూలు

★ 'ప్రియదర్శిని పార్క్' సరికొత్త మలుపులతో ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. 'నా హార్ట్ నువ్వేనని వాళ్లకు తెలీదురా' అని కన్నీళ్లు పెట్టుకున్న తల్లి గురించి ఆలోచిస్తే మా కళ్లు చెమ్మగిల్లాయి. పెద్దకథ 'యతి', 'నవలావలోకనం' బాగున్నాయి. బెల్లమున్న చోట ఈగలు చేరతాయని 'మా అత్త బంగారం' నిరూపించింది. 'కొత్తగాలులు' హృదయ తంత్రుల్ని మీటుతున్నాయి.

– **భాగ్యశ్రీ రాజేష్,** పొన్నూల్

★ 'ప్రియదర్శిని పార్క్' ఆసాంతం చదివించింది. విజ్ఞానశాస్త్రానికి, వైద్యశాస్త్రాన్ని, హేతువాదాన్ని జోడించి రచయిత విశ్లేషించారు. ఆయన విశ్లేషణలు ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. పెద్దకథ 'యతి' బాగా ఆకట్టుకుంది. ఆసాంతం సస్పెన్స్ థ్రిల్లర్‌లా నడిచింది. చతురకత 'మా అత్త బంగారం' నిడివిలో చిన్నదే అయినా పెద్దకథ చదివిన తృప్తి మిగిల్చింది.

– **గానుగపెంట నరసింహులు,**
బద్వేలు, కడప జిల్లా

★ నవల 'ప్రియదర్శిని పార్క్'లో వెంకటేశ్వర్లు, అనసూయల పెళ్లి శ్రీసీతారామచంద్రుల కళ్యాణోత్సవంలా జరిగింది. సమాజంలో కనిపించే పాత్రల్ని కలిపి చక్కని నవలను మన ముందుంచారు. మొదటి నుండి చివరి వరకూ ఉత్కంఠగా చదివించింది.

– **ధవ్వూరి శ్రీధరాచార్యులు,**
సీతారాంబాగ్, హైదరాబాద్

★ 'ప్రియదర్శిని పార్క్' నవల కడదాకా విడవకుండా చదివించింది. ఒకొక్కరిదీ ఒక్కో కథగా ఉంది. రచయితకు అభినందనలు. చివరి అట్టలోని చిన్నారి చిత్రం బాగుంది.

– **కరణం శివానందరావు,** కర్నూలు

★ డా.జి. సురేశ్‌బాబు నవల 'ప్రియదర్శిని పార్క్' ఏకబిగిన చదివించింది. స్వప్న మోహన్‌లతో ప్రారంభమై ఊహించని అనేక మలుపులతో కథ సాగి చివరికి అనసూయ వెంకటేశ్వర్లులను కలిపి రచయిత చక్కటి ఔచిత్యంతో ముగింపునిచ్చారు. సుప్రసిద్ధ రచయిత్రి తేజోవతిగారి నవల 'పూర్వా సంధ్యా ప్రవర్తతే' ఆ కాలంలో ఎంతో ప్రాచుర్యం పొందిన సీరియల్. మధ్యతరగతి జీవితాలకు దర్పణం ఆ నవల. పెద్దకథ 'యతి' ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగింది. చతురకత 'మా అత్త బంగారం' చదివి ఔరా కోడళ్లు! అనుకున్నాం.

– **ఎన్. విజయలక్ష్మి,** ఒంగోలు

సంపుటి -38,
సంచిక - 7
451వ సంచిక,
పేజీలు : 132, ఆగస్టు 2015

# చతుర



'ఏం జరిగింది?

ఎందుకు పరుగెత్తుకుంటూ వచ్చావు? ఎలా రొప్పుతున్నావో చూడు' గాబరాగా అన్నాడు గుంజన్ కూతురితో.

'నేను కూడా నీతో పాటే అడవికి వద్దామని' చెప్పింది కూతురు శ్రద్ధ.

'అడవిలోకా ఎందుకు?' కంగారుగా అడిగాడు తండ్రి.

'పులిని చంపి తేవడానికి. తాత ఏ పని చేశాడో అదే పని నువ్వూ చేస్తున్నావు. నీ కూతురిగా నేనూ అదే పని చేసి పొట్టపోసుకోవాలిగా!' అంది శ్రద్ధ.

'అర్థం లేకుండా మాట్లాడకు. నీకేం ఖర్మ పట్టింది? హాయిగా చదువుకుంటున్నావు. నీ కోరిక ప్రకారం పెద్ద డాక్టర్ అవుతావు' కూతుర్ని కోప్పడ్డాడు గుంజన్.

ఆ తర్వాతేమైంది?

డాక్టర్ కావాలనుకున్న శ్రద్ధ పులిని వేటాడ్డానికి అడవికి వెళ్తాననడంలో ఆంతర్యమేంటి? ఆద్యంతం ఆసక్తిగా సాగే కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు గ్రహీత **సలీం** ప్రయోగాత్మక నవల **అరణ్యపర్వం** 6వ పేజీలో..

★ ముఖచిత్రం: బేబీ హేమ శ్రీకృతి
★ చివరి కవరు : బేబీ శాన్వి
★ పుస్తకాలంకరణ : రాజు యాట

'నా అడది కడుపుతో ఉంది దొరా! దానికి దానిమ్మ పండు తినాలని కోరికగా ఉందంట. దొరవారు ఓ పండుని ఇప్పిస్తే..' కాలే గేటుబయటే నిల్చుని వంగి వినయంగా అడిగాడు సర్వేశ్వరరావును .

'పండు కాదు కదా ఓ గింజ కూడా విదల్చను. పో ఇక్కడి నుంచి' కసిరాడు సర్వేశ్వరరావు.

'సగం పండిచ్చినా చాలయ్యా!' అర్థించాడు కాలే.

'పోనీలెండి.. అతని భార్యకు వేవిళ్లేమో.. ఒక్క పండేగా.. ఇవ్వండి' సర్వేశ్వరరావుకు నచ్చజెప్పబోయింది అతని భార్య.

'నువ్ నోర్ముయ్! మధ్యలో నీ బోడి సలహా ఏంటి? నువ్వు లోపలికి తగలడు' భార్యను కసిరి, 'ఇంకా ఇక్కడే ఉన్నావేం? పోతావా? పోలీసుల్ని పిలవమంటావా?' కాలే మీద కేకలేశాడు సర్వేశ్వరరావు.

పండు అడిగిగిన పాపానికి సర్వేశ్వరరావు పోలీసులను పిలుస్తాననడమేంటి? కాలే మీద ఎందుకు విరుచుకుపడుతున్నాడతను? అక్షరాక్షరంలో ఉత్కంఠ రేకిత్తించే కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత సలీం విలక్షణ నవల అరణ్యపర్వం చతుర ఆగస్టు కానుక!

# అరణ్యపర్వం

- సలీం

మహారాష్ట్రలో నాగపూర్ పట్టణానికి దగ్గరగా ఉన్న కల్మేశ్వర్ అడవి!

అప్పటివరకు ప్రశాంతంగా ఉన్న అడవిలో ఒక్కసారిగా అలజడి.. భయంతో చెట్లు బిగుసుకుపోయి వూపిరి బిగబట్టి నిలబడ్డాయి. ఆకుల గుండెల్లోంచి పుట్టుకొస్తున్న వణుకుని దాచుకునే ప్రయత్నంలో కొమ్మలు సతమతమవుతున్నాయి. ఈరోజు ఎవరి తలలు తెగి పడ్తాయోనన్న భయం.. అప్పటివరకు గర్వంగా తల ఎత్తుకుని ఆకాశాన్ని తాకడమే మా లక్ష్యం అనేలా ఠీవిగా నిలబడి, పచ్చగా కళకళలాడిన చెట్లలోంచి ఎన్నెన్ని నేలకూలుతాయోనన్న దిగులు..

అతను వేసే ఒక్కో అడుగు అడవి గుండెల్లో ప్రకంపనలు సృష్టిస్తోంది. అతని చేతిలో గొడ్డలి పదునుగా మెరుస్తోంది. బాగా పరిచయమైన అడవి కావడంవల్ల అతను నింపాదిగా నడుస్తున్నాడు. ఆ అడవిలోని అణువణువూ అతనికి తెలుసు.. పాతికేళ్ళకు పైగా పెనవేసుకుపోయిన అనుబంధం.. అతను పరిసరాల్ని డేగకళ్ళతో పరిశీలిస్తూ ముందుకు కదుల్తున్నాడు. అతని రాకని అడవి జంతువులు సైతం పసికట్టినట్టున్నాయి. అతని చూపుకందకుండా దాగే ప్రయత్నంలో పొదల్లోని చీకటి కుహరాల్లోకి చొచ్చుకుపోతున్నాయి. గంధపు చెట్లకూ టేకు చెట్లకే కాదు అడవి జంతువుల పాలిటా అతనెంత రాక్షసుడో పాతికేళ్లుగా ఆ అడవికి అనుభవమే.

అతని పేరు గుంజన్ సింగ్. మరాఠా ప్రాంతానికి పరిమితమైన పర్ది తెగకు చెందిన వ్యక్తి. ఆంగ్లేయుల పాలనలో పర్ది తెగను నేరగాళ్లుగా ముద్రవేసి, జంతువుల్ని వేటాడినట్టు వేటాడటం వల్ల రెండు లక్షలకుపైగా ఉండిన వాళ్ల జనాభా ప్రస్తుతం సగానికి పైగా తగ్గిపోయింది. భారతప్రభుత్వం ఈ తెగను సంచార తెగగా గుర్తిస్తూ చట్టం చేసినా ఈ తెగలో నేరప్రవృత్తి పూర్తిగా సమసిపోలేదు. వందేళ్ళ క్రితం దేశంలో యాభైవేలకు పైగా ఉన్న పులుల సంఖ్య నేడు రెండువేలకు మించకపోవడానికి ప్రధాన కారణాల్లో పర్ది తెగ ఒకటిగా చెబుతారు. ఎందుకంటే పులుల్ని చంపి వాటి చర్మాన్ని, ఎముకల్ని అమ్ముకోవడమే ఈ తెగకు జీవనోపాధి.

ఐదడుగుల మూడంగుళాల ఎత్తు.. సన్నటి రివటలాంటి శరీరం.. మొహంలో ప్రశాంతత.. ముప్పయి ఐదేళ్ళ గుంజన్‌ని చూసిన వాళ్లెవరైనా సంచారజాతికి చెందిన అమాయకుడిగా, సాధుస్వభావం గల యువకుడిగా పొరబడటం ఖాయం. కానీ పర్దితెగలోని అతని బంధువుల పాతిక కుటుంబాల్లో వేటకు వెళ్ళే నలభై మంది మగవాళ్ళకి తెలుసు, అతనెంత క్రూరంగా జంతువుల్ని చంపుతాడో! తరతరాలుగా పులుల్ని వేటాడటానికి అలవాటుపడిన అతని తెగవాళ్ళు కూడా గుంజన్ పులిని చంపటం చూసి గజగజా వణికిపోతారు. అంత నిర్దయగా చంపుతాడు.

ఇప్పటివరకూ నలభైరెండు పులుల్ని చంపిన గుంజన్ పదేళ్ళ వయసులోనే పెద్దపులిని చంపిన ఖ్యాతిని సొంతం చేసుకున్నాడు. ఆ రోజు జరిగిన సంఘటనలోని భయానక, బీభత్స దృశ్యాల్ని అతని తోపాటు వెళ్ళిన మిగతా వేటగాళ్ళెవ్వరూ ఈనాటికీ మర్చిపోలేదు. తమ పిల్లలకు, పిల్లల పిల్లలకు కూడా ఏడెనిమిది అడుగుల పొడవున్న బెంగాల్ పులిని పదేళ్ళ గుంజన్ చంపిన విధానాన్ని కథలు కథలుగా చెప్పుకుంటారన్న విషయం గుర్తుకు రాగానే గుంజన్ పెదవుల మీద గర్వంతో కూడిన దరహాసం మెరుస్తుంది.

గుంజన్‌కి ఆ రోజు జరిగిన ప్రతి చిన్న విషయం కూడా నిన్న జరిగినంత వివరంగా గుర్తుంది. అంతకు ముందు తండ్రి పోచగెతో కలిసి రెండు మూడు సార్లు వేటకు వెళ్ళినా పెద్దవాళ్ళు పులిని

చంపుతుంటే చూడటం తప్ప, నేరుగా కత్తి పట్టుకుని కలబడింది లేదు.

ఆ రోజు పోచగె - కొడుకు చేతికి కత్తి నిచ్చి "మంచి బేరం తగిలిందిరా అబ్బాయ్! బెంగాల్ పులిని చంపి చర్మం, ఎముకలు, గోళ్ళు అందజేస్తే ఐదు వేలిస్తానన్నారు. పులి తిరుగాడే జాడల్ని గుర్తించాం. ఈ రోజు దాన్ని వేటాడాలని నిర్ణయించుకున్నాం. నా తర్వాత మన తెగలో నీ అంత మొనగాడు లేడని మనవాళ్ళంతా అనుకోవాల. దానికీరోజే ముహూర్తం. ఆ పులిని నువ్వే చంపాలి. నీ చేతిలో ఉందే కత్తి.. దాంతో నేను ఇప్పటివరకు ఇరవైకి పైగా పులుల్ని చంపాను. ఈరోజు అదే కత్తితో నా కొడుకు పులివేట మొదలెట్టాలి" అన్నాడు.

'అమ్మో..! నేనా..? చిన్నపిల్లాడిని కదా! పులిని చంపగలనా?' అన్లేదు గుంజన్. అతని కళ్ళు సంతోషంతో విప్పారాయి. పెదవుల మీద క్రూరమైన నవ్వు మెరిసిందా క్షణం. తన చేతిలో ఉన్న కత్తిని నిశితంగా చూశాడు. అడుగు పొడవుండి రెండువైపులా పదును తేరి ఉంది. పులి గొంతులోకి గుచ్చితే చాలు గుండెని కూడా చీల్చేంత పదును.. దాన్ని తిరిగి పోచగె కిచ్చేశాడు.

పోచగె ఏదో అడిగేలోపల చూరులో దోపిన గొడ్డలిని బైటికి తీశాడు.. "నేను దీంతో చంపుతాను నాన్నా" అన్నాడు.

పోచగె కొడుకు వైపు ఆశ్చర్యంగా చూశాడు. ఇప్పటివరకు తన జాతి వాళ్ళు పులిని చంపడానికి కత్తుల్ని వాడారు. పొడవాటి పదునైన ఇనుప చువ్వల్ని వాడారు. వాటిని పులినోట్లో దింపేస్తే చాలు అదింక తన కోరల్తో గాయాలు చేయలేదు. బల్లాల్లాంటి ఆయుధాల్ని కూడా వాడారు. దూరంగా నిలబడి పులి కందకుండా దాని మీద దాడిచేయవచ్చు లేదా బలంగా దాని మీదకి విసరవచ్చు. కానీ గొడ్డలితో పులిని చంపడం సాధ్యమా?

పోచగె మౌనంగా ఉండిపోయాడు. తన కొడుకులో కన్పిస్తున్న ఉత్సాహాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పల్చన చేయడం ఇష్టంలేక తనకు తానే సమాధానం చెప్పుకున్నాడు. తనలాంటి మరో పదిమంది మగాళ్ళు వాడి చుట్టూ వలయంగా నిలబడి కాపాడతాం కాబట్టి వాడి ప్రాణానికొచ్చే ముప్పేమీ ఉండదని భావించాడు. "సరే! అలాగే కానీయ్! గొడ్డలికి బాగా పదును పెట్టు. మరో గంటలో మనం బయల్దేరుతున్నాం" అన్నాడు గుంజన్తో.

గొడ్డలి భుజానికి తగిలించుకుని వాళ్ళమ్మతోపాటు అడవిలోకెళ్ళి చెట్లని నరికి వంటచెరుకు తీసుకురావడం గుంజన్‌కి అలవాటే. పెద్దపెద్ద దుంగల్ని ఇంటికి తెచ్చాక గొడ్డలితో చీల్చి సన్నటి పేళ్ళుగా చేయడంలో అతడు నేర్పరి. ఒకే దెబ్బకు ఎంత లావు దుంగయినా రెండుగా చీలిపోవాల్సిందే.

బండరాతి మీద అరగంటసేపు గొడ్డలికి పదును పెట్టాడు. పోచగెతో పాటు మరో పదిమంది వెంటరాగా అడవికి బయల్దేరాడు. వాళ్ళలో ఒకడి చేతుల్లో ఉన్న మేకపిల్ల కిందికి దూకడానికి గింజుకుంటోంది. చిన్నమేకపిల్ల, దాన్ని కదలకుండా ఒడిసిపట్టుకుని నడుస్తున్నాడు. ఇంతకుముందు

## కొత్తగాలి...

**అప్పుడు చిత్తశుద్ధి**
**ఉంటేనే సాధ్యం!**
**ఇప్పుడు చెత్తశుద్ధి కూడా**
**ఉంటేనే వెలుగులు!!**

– జి.జి.కె. రావు,
శ్రీకాకుళం

నాన్నతో కలిసి వేటకెళ్ళి చాలాకాలం కావటంవల్ల అంతా కొత్తగా అన్పిస్తోంది. కట్టెలకోసం అడవిలోపలికి అరకిలో మీటరు దాటి వెళ్ళని గుంజన్‌కి మరింత లోపలికెళ్ళేకొద్దీ అడవితల్లి తన రెండు చేతులూ చాచి ఆహ్వానిస్తున్నట్టు అన్పించింది. ఓవైపు కొత్తగా ఉన్నా ఎన్నోరోజులుగా పరిచయమున్న ప్రాంతంలా.. తన కోసమే వేచి ఉన్నట్టు.. అడవి అతనికి ఆత్మీయ బంధువులా అన్పించింది.

"గుంజన్! మనం పులిని వేటాడాలంటే మొదట పులి తిరిగే పరిసరాల్ని రెండు మూడు రోజులు నిశితంగా గమనించాలి. దానికి చాలా ఓపిక, సహనం అవసరం. వేటగాడికుండాల్సిన ముఖ్యలక్షణం ఇదే. రోజుల తరబడి వేచి చూడాల్సి వచ్చినా విసిగిపోకూడదు. వెన్నెల రాత్రులు చెట్ల మీద కూచుని పులి సంచారాన్ని పరిశీలించాలి. ప్రతి పులి తనకంటూ ఓ సామ్రాజ్యాన్ని ఏర్పరచుకుంటుంది. చుట్టూ మూత్ర విసర్జన చేసి దానికి ఎల్లలు గీసుకుంటుంది. దాన్లోకి ఆడపులులు ప్రవేశించవచ్చు. మగ పులుల ప్రవేశం మాత్రం నిషిద్ధం. మొదట వేటగాడు పులి ఏ జాతికి చెందిందో, ఎంత వయసుందో, ఎంత బరువుందో గమనించాలి. ఆ పులి తిరుగాడే వైశాల్యాన్ని గుర్తించాలి. తర్వాత పులి తరచూ నడయాడే మార్గాన్ని గుర్తుంచుకోవాలి" తన కొడుక్కి వేటకు సంబంధించిన మెలకువలు చెప్తూ నడుస్తున్నాడు పోచగె.

"ఇవన్నీ చెట్లపైన కూచుని గమనించటం వల్లనే తెలుస్తాయా?" అని అడిగాడు గుంజన్.

"దానికి మరోమార్గం కూడా ఉంది. పులి వేటాడిన జంతు కళేబరాల్ని బట్టి అది నడయాడే మార్గాన్ని అంచనా వేయాలి. పగటిపూట వెళ్ళి ఆ దారి వెంబడి వందడుగుల మేర, అంగుళం లోతువరకు మట్టిని తవ్వి దానిమీద మెత్తటి మట్టిని పరవాలి. మరునాడు ఉదయం వెళ్ళి చూస్తే దానిమీద పాదముద్రలు కన్పిస్తాయి. వాటిని బట్టి ఆ పులి ఆడదో, మగదో, ఏ జాతిదో గుర్తుపట్టవచ్చు. అలా గుర్తుపట్టడంలో మన పర్ధితెగవాళ్ళను మించిన మొనగాడు ఈ భూమ్మీద లేడు" గర్వంగా మీసం మెలేస్తూ అన్నాడు పోచగె.

"ఆ దారెంట పులే నడవాలని ఏముంది నాన్నా? మిగతా జంతువులు కూడా తిరగొచ్చుగా! అపుడెలా గుర్తుపట్టడం?"

తన కొడుకు అడిగిన తెలివైన ప్రశ్నకు ముచ్చట పడ్డాడు పోచగె.

"నిజమే! అడవిలోని జంతువులు ఎక్కువగా రాత్రిపూటే ఆహారం కోసం బైటకొస్తాయి. పులి మాత్రం ఎక్కువగా ఉదయం, సాయంత్రం వేళల్లోనే వేటాడుతుంది. మనం కప్పిన మట్టిమీద మనకు రకరకాల పాదముద్రలు కన్పించచ్చు. ఏ పాదముద్ర ఏ జంతువుదో అనుభవంతో చెప్పొచ్చు. ఈసారి వేటకు వెళ్ళే ముందు నీకవన్నీ నేర్పుతాను" అన్నాడు పోచగె.

చాలా లోపలికెళ్ళాక ఓ చోట ఆగిపోయారు. అక్కడ చెట్లు బాగా గుబురుగా ఉన్నాయి.

పోచగె మోకాళ్ళ మీద కూచుని చుట్టుపక్కల నేలని నిశితంగా పరిశీలించాడు. "చూశారా! నిన్న రాత్రి కూడా పులి ఈ దారి వెంట తిరుగాడింది. ఇదిగో దాని పాద ముద్రలు గమనించారా? ఇవి మనం వే టాడాలనుకుంటున్న పులి పాదముద్రలే' అన్నాడు తనతో పాటు వచ్చినవాళ్ళతో. వాళ్ళు అంగీకార సూచకంగా తలూపారు.

మేకపిల్లని కిందికి దింపి దాని మెడకు నాలుగడుగుల పొడవున్న తాడు కట్టి, దాన్ని ఓ చెట్టు మొదలుకు కట్టేశారు. స్టీల్‌తో తయారుచేసిన గొలుసుని చెట్టుకి బిగించారు. దాని పొడవు ఐదడుగు

# అనుకోని ఆవిష్కరణలు

నిత్యజీవితంలో ఉపయోగించే అనేక వస్తువులలో చాలామట్టుకు శాస్త్రజ్ఞులు యాదృచ్ఛికంగా కనిపెట్టినవే. వాటి సంగతులు..

★ కార్న్ ఫ్లేక్స్: 1894లో జాన్ హార్వేకెల్లాగ్, విల్ కైత్ కెల్లాగ్ సోదరులు అనుకోకుండా గోధుమల్ని వేడినీళ్లలో ఉంచి మర్నాడు చూశారు. గట్టిపడ్డ గోధుమల్ని రేకులుగా కోసి తింటే రుచిగా ఉండడంతో కెల్లాగ్ సోదరులు 'టూ స్టైడ్ ఫ్లేక్' కంపెనీని స్థాపించి వాటిని అమ్మసాగారు.



★ టీ బేగ్: అమెరికన్ వ్యాపారి థామస్ సల్లివాన్ తేయాకుని సిల్క్‌బట్టలో ఉంచి పంపాడు. కస్టమర్స్ వాటిలోంచి ఆకులు తీయకుండానే వేడి నీళ్లలో వేసి టీ తయారుచేశారు. ఈ విషయం తెలిసిన థామస్ సిల్క్ స్థానంలో చవకైన ఫిల్టర్ పేపర్ని వాడి టీ బేగ్స్ తయారు చేశాడు.

★ శాకరిన్: జర్మన్-అమెరికన్ శాస్త్రజ్ఞుడు కాన్‌స్టాంటిన్ పాల్‌బెర్గ్ ఓ రోజు చేతులు కడుక్కోకుండా భోజనం చేస్తూ తను తినే బ్రెడ్ తీయగా ఉండడం గమనించాడు. లేబరేటరీలో తను పరిశోధించే రసాయనిక పదార్థాల వల్లనే ఆ తీపి అని గ్రహించాడు. ఫలితంగా శాకరిన్ పుట్టింది.

★ పొటాటో చిప్స్: అమెరికాలో సరతేగో స్ప్రింగ్స్‌లో వంటవాడిగా పనిచేసే జార్జి స్పెక్‌ని ఇంకాస్త పల్చటి బంగాళ దుంపల వేపుడు చేయమని ఓ కస్టమర్ వేధించడంతో, కోపంగా వాటిని సన్న చక్రాలుగా కోసి వేయించి పంపాడు. అవి చాలా బాగుండడంతో అందరూ వాటినే ఆర్డర్ చేయడంతో పొటాటో చిప్స్ పుట్టాయి.

★ పోస్ట్ ఇట్ నోట్స్: 1968లో కెయం కంపెనీలో పనిచేసే స్పెన్సర్ సిల్వర్ విమానాల తయారీలో వినియోగం కోసం బాగా అతుక్కునే జిగురు కోసం పరిశోధన చేస్తుండగా అతుక్కుని వెంటనే ఊడిపోయి మళ్లీ అతుక్కునే జిగురు తయారైంది. దాంతోనే పోస్ట్ ఇట్ నోట్స్‌ని కనిపెట్టారు.

★ అగ్గిపెట్టె: జాన్‌వాకర్ అనే బ్రిటిష్ ఫార్మసిస్ట్ తయారుచేసిన రసాయన మిశ్రమం ఓ పుల్లకి అంటుకుని ఎండిపోయింది. దాన్ని తీయడానికి నేలకేసి రుద్దితే అది మండింది. దాంతో అగ్గిపుల్లలు తయారయ్యాయి.

చతుర సమాచారం

లుంది. ఆ గొలుసు రెండో చివర ఖైదీలకేసే సంకెళ్ళలాంటివి రెండున్నాయి.

"పులి మేక కోసం ముందుకు రాగానే దాని ముందటి కాళ్ళలో ఏదో ఒకటి ఈ రెండు సంకెళ్ళలో ఒకదాన్లో ఇరుక్కుని బిగుసుకుపోతుంది. పులి దాన్నుంచి విడిపించుకోడానికి గింజుకుంటూ ఉంటుంది. అప్పుడు మనం దాన్ని వేటాడాలి.. అర్థమైందా? " అన్నాడు పోచగె.

అర్థమైందన్నట్టు తల వూపాడు గుంజన్.

"జాగ్రత్త..! అది బెంగాల్ పెద్దపులి. దాని కాలు మాత్రమే ఇందులో ఇరుక్కుంటుంది కాబట్టి దానికి అందకుండా మనం దాడి చేయాలి. ఆ సమయంలో పులి పిచ్చి పట్టినట్టు ఉద్రేకంతో వూగిపోతూ ఉంటుంది. దాని ఒంటిమీద ఎక్కువ గాయాలు కూడా చేయకూడదు. పులి చర్మానికి ఎన్ని రంధ్రాలు పడితే దాని ధర అంతగా తగ్గిపోతుంది.. గుర్తుంచుకో" అన్నాడు పోచగె.

మెల్లగా చీకట్లు కమ్ముకుంటున్నాయి. పోచగె, అతని బావమరిది గుంజన్‌ని తీసుకెళ్లి మేకని కట్టేసిన చెట్టుకి కొద్దిగా ఇవతల ఉన్న చెట్టెక్కి కూచున్నారు. మిగతావాళ్లు మరో రెండు చెట్లమీద కొమ్మల

చాటున దాక్కుని కూచున్నారు.

సంధ్యా సమయంలో పక్షుల అరుపుల్తో అడవంతా ప్రతిధ్వనించింది. చీకటి దట్ట మయ్యేకొద్దీ పక్షుల అరుపులు ఆగిపో యాయి. మధ్య మధ్యలో కొమ్మలపై సర్దు కుంటున్న పక్షుల రెక్కల చప్పుడు, కీటకాల రొద తప్ప మరేమీ విన్పించడం లేదు. మెల్లగా ఆకాశంలో చంద్రుడు ఉదయిం చాడు. అడవంతా వెన్నెట్లో తడిసి ముద్ద వుతోంది. అప్పటికి నాలుగ్గంటల నుంచి వాళ్ళు చెట్లమీద కూచుని పులి రాక కోసం ఎదురు చూస్తున్నారు. ఏవో జంతువుల అరుపులు మంద్రంగా విన్పిస్తున్నాయి తప్ప, పులి గాండ్రింపు విన్పించలేదు.

మరో గంట గడిచింది. మేకపిల్ల తన ముందు వేసిన ఆకుల్ని తినేసి చెట్టుకాను కుని పడుంది. అప్పుడు విన్పించింది పులి గాండ్రింపు. మేకపిల్ల ఉలిక్కి పడి లేచింది. పోచగెతో సహా అందరూ అప్రమత్తమ య్యారు. తమ తమ చేతుల్లోని పొడవాటి శూలాల్లాంటి ఆయుధాల్ని ఒడిసి పట్టుకుని పులి కోసం ఎదురుచూస్తూ కూచున్నారు.

గుంజన్ కుడిచేత్తో గొడ్డలిని, ఎడంచేత్తో పైకొమ్మని పట్టుకుని నిలబడ్డాడు. పులి మెల్లగా నడుచుకుంటూ వస్తోంది. దాని గోధుమ రంగు చారల మీద వెన్నెల పడి మెరుస్తోంది. బెంగాల్ పులిని అంత దగ్గ రగా చూడటం అదే మొదటిసారి గుంజ న్‌కి. చాలా పొడవుగా, బలంగా కన్పి స్తోంది. తప్పకుండా చాలా బరువుంటుం దనుకున్నాడు. ఎటొచ్చీ అది భయంక రంగా లేదు. దాన్ని చూస్తుంటే భయమేయలేదు గుంజన్‌కి. పైగా పులి చాలా అందంగా కన్పించింది. దాని నడ కలో అందం ఉంది.. దర్జా ఉంది.

పులి దగ్గరకు రావడం చూసి మేకపిల్ల పెద్దగా అరుస్తూ, తాడుని తెంపుకోడానికి విఫలయత్నం చేస్తోంది. పులి మరింత సమీపానికొచ్చి ఓ క్షణం నిలబడి చూసింది. ఒక్కసారిగా లంఘించి మేకపిల్ల మెడను పట్టుకోబోయింది. మేక పక్కకు గెంతి చెట్టుచాటుకెళ్ళి మళ్ళా గింజుకుంటోంది. పులి కూడా అటువైపుకి పరుగెత్తి పంజాతో మేకపిల్ల వీపుమీద చరిచింది. మేకపిల్ల కిందపడి వెంటనే లేచి దానికందకుండా చెట్టుకి మరోవైపుకి తిరి గింది. పులి కోపంతో, అసహనంతో గాండ్రించి ఒక్కదుముకు దుమికి మేకపిల్ల మెడను కరిచిపట్టుకుంది. కానీ వెంటనే బాధతో అరుస్తూ పులి మేకను వదిలే సింది. కారణం, పులి ముందుకాళ్ళలో కుడి కాలు స్టీల్తో చేసిన ట్రాప్‌లో ఇరు క్కుపోయింది. అదిప్పుడు తన కాలిని లాక్కోడానికి గింజుకుంటోంది. పులి లాక్కునేకొద్దీ ట్రాప్ మరింత బిగుసుకుపో తోంది. పళ్ళతో గొలుసుని తెంపడానికి ప్రయత్నిస్తోంది.

"అందరూ దిగండి" అంటూనే పోచగె ఓ గెంతు గెంతి నేలమీద నిలడ్డాడు. అతన్తో పాటే మిగతావాళ్లూ దిగారు. చేతుల్లో ఉన్న శూలాలు, బరిసెల్లాంటి ఆయుధాలతో వాళ్లు పులిని చుట్టుము ట్టారు. తన చుట్టూ మనుషుల్ని చూడగానే పులి మరింత రెచ్చిపోయింది. భయంక రంగా అరుస్తూ కోరలు సాచి వాళ్ళందితే చాలు చీల్చి చెండాడటానికి ప్రయత్ని స్తోంది. అదే సమయంలో ఇరుక్కున్న తన కాలిని లాక్కోవడానికీ ప్రయత్ని స్తోంది. పోచగెతో పాటు మిగతావాళ్ళు దానికి అందనంత దూరంలో నిలబడి శూలాల్తో గాయం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. పులి వాళ్ళకా అవ కాశం ఇవ్వకుండా తప్పించుకుంటోంది.

పోచగె తన కొడుకోసం చూశాడు కానీ కన్పించలేదు. తలయెత్తి చెట్టుమీదకి చూశాడు. గుంజన్ పైకొమ్మను పట్టుకుని మెల్లగా కొమ్మ చివరికి నడుస్తున్నాడు.

"గుంజన్! ఏం చేస్తున్నావక్కడ? తొంద

## పసికందుల్ని గుడిపై నుంచి తోసేస్తారక్కడ!

చతుర సమాచారం

ప్రపంచంలోని వివిధ సంస్కృతుల్లో పిల్లలకి సంబంధించి అనేక ఆచారాలు ఉన్నాయి. క్రూరంగా, వింతగా ఉండేవాటిలో కొన్ని...

★ స్వీడన్‌లో జీరో టెంపరేచర్‌లో పసి పిల్లలని ఇంటి బయట ఉంచే ఆచా రం ఉంది. దీనివల్ల జలుబు, దగ్గు లాంటి రుగ్మతలు రావని విశ్వాసం.



★ బాలి, ఇండోనేషియాల్లో పుట్టినబిడ్డ మూడు నెలలదాకా భూమిని తాకకూడదనే ఆచారముంది. 105వ రోజున న్యాబుటన్ అనే వేడుకలో బిడ్డ కాళ్లని మొదటిసారి నేలకి తాకిస్తారు.

★ జపనీస్ సంస్కృతిలో బిడ్డ నుండి వేరు చేసిన బొడ్డు తాడు చాలా ప్రాముఖ్యమైంది. కొటోబుకీ-బాకో అనే ప్రత్యేక పెట్టెలో పాడవకుండా దాన్ని భద్రపరుస్తారు.

★ గ్వాటిమాలలో పిల్లలకి మొదటి పన్ను కనపడగానే బిడ్డ ఎదురుగా పుస్తకం, కత్తి, కత్తెర, బంగారం లాంటి అనేక వస్తువులని ఉంచి బిడ్డని వదులుతారు. మొదటగా దేన్ని తాకితే, పెద్దయ్యాక ఆ వృత్తి చేపడతారని నమ్మకం.. పుస్తకం ముట్టుకుంటే ప్రీస్ట్ లేదా టీచర్ అవుతారని. ఈ వేడుక పేరు ఆగ్రాహడిగ్. మన అన్నప్రాశనలో చేసే వేడుకే ఇది.

★ టోక్యోలోని సాం సోజీ ఆలయంలో జరిపే నకీజుమో అనే వేడుకలో తల్లిదండ్రులు తమ పిల్లలను బలవంతంగా ఏడ్పిస్తారు. ఇందువల్ల దుష్టశక్తులు వారిని తాకవని విశ్వాసం.

★ బల్గేరియాలో పిల్లల మీద ఏటా ఏప్రిల్‌లో అంతా ఉమ్మేస్తారు. ఇందువల్ల పిల్లలకు దిష్టి తగలదని నమ్మకం.

★ స్పెయిన్‌లోని కేస్ట్రిలోడి ముర్షియా అనే గ్రామంలో పిల్లల మీదనుంచి దూకే ఆచారం ఉంది. పసుపుపచ్చ దుస్తులు ధరించిన వారు పిల్లల మీద నుంచి దూకితే దుష్టశక్తులు పోతాయని నమ్మకం.

★ భారతదేశంలో మహారాష్ట్రలోని ముస్తి అనే గ్రామంలో ఓ ఆలయం పై నుంచి పిల్లలను యాభై అడుగుల కిందకి పడేసే ఆచారం ఉంది. కింద పట్టుకున్న దుప్పటి మీదకి వారిని విసిరేస్తారు. ఇందువల్ల వారికి అనారోగ్యాలు రావని నమ్మకం. ముస్లిమ్‌లు కూడా దీంట్లో పాల్గొంటారు.

---

రగా దిగిరా! నీ మొదటి వేటు ఈ పులి మీద పడాలని కదా పిల్చుకొచ్చాను. తొందరగా రా!" అన్నాడు.

గుంజన్ బదులివ్వకుండా మరింత ముందుకు నడిచాడు. అతడిప్పుడు పులి నిలబడి ఉన్న చోటుకి సరిగ్గా అడుగు అవతల చెట్టుపైన నిలబడి ఉన్నాడు.

"ఏం చేస్తున్నావు గుంజన్? పట్టు జారి పడ్డావంటే నేరుగా పులి నోట్లో ఉంటావు. పిచ్చిపనులు చేయకు. వెనక్కెళ్ళిపో! నువ్వు నిలుచున్న కొమ్మ విరిగేపోయేలా ఉంది" అంటూ హెచ్చరించాడు పోచగె.

గుంజన్ కొన్నిక్షణాలు నిశ్చలంగా నిలబడ్డాడు. తర్వాత గాలిని గుండెలనిండా పీల్చుకున్నాడు. పులి నిలబడి ఉన్న తీరును మనసులోనే బేరీజు వేసుకున్నాడు. గొడ్డలిని కుడిచేత్తో బిగించి పట్టుకుని కిందికి దుమికాడు. పులి తన దృష్టంతా చుట్టూ ఉన్న మనుషుల మీద కేంద్రీకరించి ఉంది. పైనుంచి వస్తున్న ఉపద్రవాన్ని వూహించలేదు. గుంజన్ కిందకు పడుతూనే గొడ్డలితో పులి తల మధ్యన బలంగా కొట్టాడు. గుంజన్ కాళ్ళు నేలకానడం, దాని తల రెండు ముక్కలుగా విడిపోవడం ఒకేసారి జరిగాయి.

పోచగెతో సహా మిగతావాళ్ళందరూ

నోట మాట రాక కొన్నిక్షణాలు శిలా ప్రతి మల్లా బిగుసుకుపోయారు. కనీసం గంట సేపు నానా రకాలుగా హింసిస్తే కానీ చావని పులి ఒక్కవేటుతో విగతజీవిగా మారడంతో వాళ్ళు సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు. పులి శరీరం మీద ఒక్క గాటు కూడా లేకుండా చంపడం వల్ల దాని చర్మానికి రెండింతల ధర పలుకుతుందన్న విషయం గుర్తొచ్చి ఆనందంతో గంతులే శారు. పోచగె తన కొడుకుని ఎత్తుకుని "ఎంత ప్రమాదకరమైన పన్చేశావో తెలుసా? అది గురితప్పితే నీ ప్రాణాలు పోయేవిగా కొడకా!" అన్నాడు.

"నా గురి తప్పదని తెలుసయ్యా!" అన్నాడు గుంజన్.

అంతే..! ఆ రోజు నుంచి పర్ధితెగలో గుంజన్ హీరో అయిపోయాడు.

ఆలోచనల్లోంచి బైటపడి గుంజన్ మెల్లగా నడుస్తున్నాడు. తనిప్పటివరకు నలభై రెండు పులుల్ని చంపాడు. ఈ రోజు వేటాడబోయే పులి నలభై మూడోది. వారం క్రితం లఖన్ ఓ వ్యక్తిని పిల్చుకొ చ్చాడు. అతడు చైనా దేశస్థుడిలా ఉన్నాడు. లఖన్ పర్ధితెగవాళ్ళకి బైటి నుంచి బిజినెస్ తెచ్చే దళారి. కమీషన్ తీసుకుని పులి చర్మాన్ని, పులి ఎముకల్ని కొనేవాళ్ళని వెదికి తెస్తుంటాడు.

"గుంజన్! ఇతడు వాళ్ళ దేశంలో పులి చర్మంతో వ్యాపారం చేస్తుంటాడట. పులిని చంపి తెస్తే ఏభైవేలిస్తానంటున్నాడు. ఏమంటావు? " అన్నాడు లఖన్.

"గిట్టుబాటు కాదని చెప్పు. లక్షకు తక్కు వైతే కుదరదని చెప్పేయి" అన్నాడు గుంజన్.

"లక్ష రూపాయలంటే మరీ ఎక్కువ కదా! నువ్వే ఆలోచించు. పార్టీకి అంత డబ్బు ఖర్చవుతుందని చెప్పాలన్నా దానికో లెక్క ఉండొద్దా..? న్యాయం ధర్మం ఉండొద్దా? " అన్నాడు లఖన్.

"మనం చేసేదే న్యాయానికి, ధర్మానికి వ్యతిరేకమైన పని. వాటి గురించి ఎందుకు మాట్లాడ్తావు? ఒకప్పుడు అడ విలో పులులు విస్తారంగా ఉండేవి. ఇపుడు బాగా తగ్గిపోయాయి. ఫారెస్ట్ డిపార్ట్‌మెంటోళ్ల కళ్ళుగప్పి పులిని చంపడ మనేది చాలా ప్రమాదంతో కూడుకున్న పని. లక్ష రూపాయలని చెప్పు. నీ కమీ షన్ నీకు ముట్టుందిగా. మధ్యలో నీకేంటి బాధ? " అన్నాడు గుంజన్.

"బాధ.. అందుక్కాదు. పార్టీ వెళ్లిపోతే మన బిజినెస్ దెబ్బతింటుందని.. అందుకు!" అంటూనే ఆ విదేశీయుడితో వచ్చీరాని ఇంగ్లీష్‌లో ఏదో మాట్లాడాడు. గుంజన్‌వైపు తిరిగి "మరో పదివేలు కావా లంటే పెంచుతానంటున్నాడు. ఆ తర్వాత నీ ఇష్టం" అన్నాడు.

"వీళ్ల నఖరాలు నాకు తెలీవా? పాతి కేళ్ళ నుంచి ఈ వ్యాపారం చేస్తున్నవాణ్ణి. పులి ఎముకల్తో మందులు తయారుచేసి వేల రూపాయలకు అమ్ముకుంటారు. పులి గోళ్ళని లాకెట్లలో వేసి అమ్ముతారు. చివ రికి పులుల పెంటని కూడా వదలకుండా మగతనం పెంచే గుణాలున్నాయని అమ్ముకుంటారని నీకూ తెలుసు.. నాకూ తెలుసు. మరోసారి అడిగి చూడు" అన్నాడు గుంజన్.

లఖన్ అతనితో కొద్దిసేపు మాట్లాడి "చివరికి డెబ్బయ్ ఐదు వేలకు ఒప్పిం చాను. ఇంకేం మాట్లాడకు! ఒప్పేసుకో!" అన్నాడు.

గుంజన్ ఒప్పుకోలేదు. చివరికి లఖన్‌కి లక్ష రూపాయలకి ఒప్పుకోక తప్పలేదు.

ఆ రోజు నుంచి అడవిలో కాపు కాశాడు. నాలుగు రోజులు ఫారెస్ట్ గార్డుల కళ్ళుపడకుండా అడవంతా గాలించాక పులి పాదముద్రలు కన్పించాయి. వాటి పక్కనే రెండు పులిపిల్లల పాదముద్రలు కూడా కన్పించాయి. అంటే ఆడ పులి అయి

అక్షరం

మన జీవితంలో
ఒక దారి మూసుకుపోయినపుడు
తప్పకుండా మరో దారి తెరిచి ఉంటుంది
తెరిచిన దారిని గుర్తించగలగడమే విజయానికి మార్గం

– అలెగ్జాండర్ ఫ్లెమింగ్



ఉంటుందనుకున్నాడు. ఆ రాత్రి చెట్లమీద జాగారం చేసి పులిని చూశాడు. దాని పిల్లలకు మూడు నాలుగు నెలల కంటే ఎక్కువ వయసుండదు. తనకున్న అపారమైన అనుభవాన్ని బట్టి ఆ పులి పిల్లలు రెండూ మగవని గుర్తించాడు.

ఈ రోజు తల్లి పులిని చంపి, వీలయితే ఆ రెండు పులి పిల్లల్ని కూడా పట్టుకోవాలనే పట్టుదలతో నడుస్తున్నాడు.

★ ★ ★

మరో రెండున్నరేళ్ళలో అసెంబ్లీ ఎన్నికలున్నాయి. పోయిన ఎన్నికలప్పుడు పోటీ చేసి ఎమ్మెల్యేగా గెలిచాక ఈ రెండున్నరేళ్ళలో ధనుంజయ వంజారి బాగానే సంపాయించాడు. తను రోజూ రాత్రుళ్ళు తాగే బ్లాక్ డాగ్ విస్కీకన్నా అధికారం మత్తుగా ఉంటుందని బాగా వంట పట్టించుకున్నాడు. విస్కీ చప్పరిస్తూ మధ్య మధ్యలో నంజుకునే మసాలా దట్టించిన కోడికూర వేపుడులా అధికారం మహారుచిగా ఉంటుందని నరనరాన జీర్ణించుకున్నాడు.

అతని అధికారదాహం ఈ మధ్య మరీ పెరిగింది. పోయినసారి వెంట్రుక వాసిలో మంత్రి పదవి తప్పిపోయింది. ఈ ఎన్నికల తర్వాత ఎలాగైనా మంత్రి కావాలనేది అతడు ప్రతిరోజూ కంటున్న కల. అదీ అటవీశాఖ మంత్రి! అడవి తల్లి కామధేనువులా కోరికలు తీరుస్తుందనీ, అక్షయపాత్రలా కాసుల వర్షం కురిపిస్తుందనీ అడవితో తనకున్న నలభై యేళ్ళ అనుబంధం ద్వారా తెలుసుకున్న జ్ఞాని వంజారి.

పదిహేనేళ్ళ వయసులో మొదట వంటచెరకు దొంగిలించడంతో అడవితో తన సుదీర్ఘమైన సాహచర్యం మొదలైంది వంజారికి. పాతికేళ్ళు కలపని, జంతు చర్మాల్ని దొంగతనంగా రవాణా చేయటంలో సిద్ధహస్తుడయ్యాడు. ముప్పయ్యేళ్ళు దాటాక కలప కాంట్రాక్టర్‌గా అవతారమెత్తి, ఆ ముసుగులో అసాంఘిక కార్యకలాపాల్ని యథేచ్ఛగా కొనసాగించాడు. నలభైయేళ్ళు వచ్చేసరికి కోట్లకు పడగలెత్తాడు. ఆ డబ్బుని వెదజల్లి రాజకీయాల్లోకి రంగప్రవేశం చేశాడు. మొదటి ప్రయత్నంలో ఓడిపోయినా రెండో ప్రయత్నంలో ఎమ్మెల్యేగా గెలిచాడు. ఇప్పటికీ అతని కింద పనిచేసే పోచర్ల ముఠాలున్నాయి. వాళ్ళ ద్వారా జంతు చర్మాల్ని సంపాయించి, వాటిని అధిక ధరలకు విదేశీయులకమ్ముతుంటాడు.

మంత్రి అవ్వాలన్న కల సాకారం కావాలంటే మొదట తను ఎమ్మెల్యేగా ఈసారి ఎన్నికల్లో కూడా గెలవాలి. దానికోసమని ఇప్పటి నుంచే ప్రజల చుట్టూ తిరుగుతూ, వాళ్ళ యోగక్షేమాలు కనుక్కుంటూ దీనబంధు, ప్రజాబంధు అన్పించుకునే ప్రయత్నాలు మొదలెట్టాడు. ఎవరైనా, ఏమైనా అడగటం ఆలస్యం 'ఓ! తప్పకుండా చేసిపెడ్తాను' అనేయడం, ఆ వెంటనే 'రాబోయే ఎన్నికల్లో కూడా మీ ఓటు నాకే వేసి గెలిపించారంటే ఈసారి మంత్రి కావడం ఖాయం. అప్పుడు నా నియోజకవర్గాన్ని న్యూయార్క్ సిటీలా మార్చేస్తాను. నా నియోజకవర్గంలోని ప్రియాతి ప్రియమైన ప్రజలందరి జీవితాల్ని బంగారం చేసే

స్తాను' అనటం మాత్రం మర్చిపోవటం లేదు వంజారి.

మధ్యాహ్న భోజనంలో నాలుగు చపాతీలతో పాటు అరకోడి మసాలా కూరని లాగించేసి పడక్కుర్చీలో కునికిపాట్లు పడుతూ వంజారి ఏదో కల కంటున్నాడు. ఎటుచూసినా విశాలమైన అడవి.. దట్టమైన చెట్లు.. గంధపు చెట్లు.. లేత గులాబి రంగులో ఉన్న నోట్లకట్టల్ని కాండంగా చుట్టినట్టు వూరించే గంధపు చెట్లు. తన నెత్తిమీద ధగధగా మెరిసిపోయే కిరీటాన్ని తొడిగారెవరో! చేతిలో ఓ మంత్రదండాన్ని పెట్టి 'సుఖీభవ' అని దీవించారు. తను మంత్రదండాన్ని గంధపు చెట్ల చుట్టూ తిప్పాడు. అవి మాయమైపోయి నోట్ల కట్టల చెట్లలా ఎత్తుగా నిలబడ్డాయి.

వందల వేల జంతువులు.. నెమళ్ళ గుంపు.. లేళ్ళు చెంగు చెంగున గెంతుతున్నాయి. తను మంత్రదండం తిప్పాడు. జంతు కళేబరాలు.. తోళ్ళ గుట్టలు.. నెమళ్ళ, దుప్పుల మాంసం. మళ్ళా మంత్రదండం తిప్పాడు. అవి మాయమై నోట్లకట్టలు, జంతు కళేబరాల్లా గుట్టలు గుట్టలుగా కన్పిస్తున్నాయిప్పుడు. తను పగలబడి నవ్వుతున్నాడు. నోట్ల కట్టలమీద పడి దొర్లుతున్నాడు.

ఒక్కసారిగా పెద్దగా హోరు! అడవిలోని జంతువులన్నీ మూకుమ్మడిగా తన మీదకు దూకుతున్నట్టు అలజడి! చప్పున కళ్ళు తెరిచి చూశాడు. ఎదురుగ్గా నలుగురు మనుషులు నిలబడి ఉన్నారు. కళ్లు విప్పార్చి భయం భయంగా చూశాడు. తన మీద దాడికి వచ్చింది జనాలు కాదు. తన నియోజకవర్గంలోని ప్రజలే. 'సూర్య ఇండస్ట్రీస్ లిమిటెడ్'కి చెందిన ఉన్నతోద్యోగులు.

సూర్య ఇండస్ట్రీస్- పేలుడు పదార్థాల్ని తయారుచేసే పెద్ద ప్రైవేట్ కంపెనీ. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీకి అవసరమైన పేలుడు పదార్థాలు తయారు చేసే కాంట్రాక్టు ఈ కంపెనీకి లభించింది. ఫ్యాక్టరీ నెలకొల్పడానికి స్థలం కోసం అన్వేషణ మొదలైంది. దాదాపు రెండొందల ఇరవై ఎకరాల స్థలం కావాలి. బైట ఎక్కడా దొరకలేదు కాబట్టి అటవీ స్థలాన్ని కేటాయించాల్సిందిగా ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. దానికోసమే ఇంతకుముందు తన రికమండేషన్ని వాడుకున్నారన్న విషయం గుర్తొచ్చిందతనికి. దాంతోపాటు తనకు అందిన ముడుపులూ, తనద్వారా అటవీశాఖ మంత్రికి ముట్టిన భారీసైజు ముడుపులూ గుర్తొచ్చి మొహం నిండా నవ్వు పులుముకుని లేచి నిలబడ్డాడు.

"రండి రండి! ఏమిటీ సంగతి? మీ ఇండస్ట్రీలోని పెద్ద తలకాయలన్నీ కదిలి వచ్చినట్టనిపిస్తోంది!" అన్నాడు వంజారి వాళ్ళకు కూచోడానికి సోఫాలు చూపిస్తూ..

"మీరు మాటిచ్చిన విధంగా మా ఇండస్ట్రీకి తొంభై హెక్టార్ల అటవీ భూమి ఇప్పించకపోతే మా ఇండస్ట్రీలోని దాదాపు వెయ్యి మంది ఉద్యోగులు వచ్చి మీ ఇంటిముందు ధర్నా చేయాల్సిన గతి పడ్తుంది" నవ్వుతూ అన్నాడు దేశ్‌ముఖ్. అతను సూర్య ఇండస్ట్రీస్‌లో ఫైనాన్స్ డైరెక్టర్.

"అయ్యో! ఎంతమాట! నా నియోజకవర్గంలో ఉన్న ఇండస్ట్రీల్లోకెల్లా మీది పెద్ద ఇండస్ట్రీ. మీకు కష్టం వస్తే నాకొచ్చినట్టు కాదా! మీ ప్రపోజల్‌ని ఓకే చేయమని అటవీశాఖ మంత్రిగారికి చెప్పానే. చెప్పి కూడా చాలారోజులైంది. వారు తప్పకుండా మనకు సాయం చేస్తానని మాటిచ్చారు కూడా" అన్నాడు వంజారి.

"దినపత్రికల్లో ఆ వార్త వచ్చినప్పటి నుంచీ మాకు కష్టాలు మొదలయ్యాయి. పాత విషయాలన్నీ తోడి మాకు వ్యతిరేకంగా రాస్తున్నారు. మూడున్నరేళ్ళ క్రితం అప్పటి ప్రభుత్వ హయాంలో తొంభై హెక్టార్ల అటవీభూమి కోసం అర్జీ పెట్టుకు

# క్షయ చేసిన మేలు!

చతుర సమాచారం

క్షయవ్యాధికి నేడు మందులు ఉన్నాయి. కానీ మందు కనిపెట్టక మునుపు ఈ వ్యాధిగ్రస్థుల్లోని ప్రతీ ఏడుగురిలో ఒకరు మరణించేవారు. ఈ వ్యాధి వల్ల సామాజికంగా కొన్ని మార్పులు చోటు చేసుకున్నాయి.

★ పూర్వం ప్రజలు ఎక్కడ పడితే అక్కడ ఉమ్మేసేవారు. ఆడవారి పొడువాటి స్కర్ట్ నేలమీద తాకి, దానికి ఆ ఉమ్ము అంటుకునేది. అందులో వ్యాధిక్రిములు ఉంటాయి కాబట్టి, పొట్టి స్కర్ట్‌లు ధరించడం ఆరంభించారు.

★ తుమ్ములు, దగ్గు వల్ల టి.బి. వ్యాపిస్తుందని తెలియక మునుపు గడ్డాలని పెంచేవారు. కానీ గడ్డంలోకి వ్యాధి క్రిములు చేరితే, ఇరవైనాలుగ్గంటలూ జీవించి ఉంటాయని, భార్యని పిల్లల్ని ముద్దుపెట్టుకుంటే, వారికవి అంటుకుంటాయని వైద్యులు నిర్ధారించడంతో నిత్యం షేవ్ చేసుకునే అలవాటు వచ్చింది.

★ క్షయ వ్యాధిగ్రస్థులకి దగ్గు రాకుండా ఉండడానికి ఏటవాలుగా కూర్చునేందుకు వీలుగా కుర్చీలని డాక్టర్ ఎడ్వర్డ్ లివింగ్‌స్టన్ కనిపెట్టాడు. అవే నేడు రిలాక్సేషన్‌కి వాడే రిక్లయినింగ్ కుర్చీలు.

★ 1890లో ఓ పెన్నీకి చిన్నగ్లాస్‌లో ఐస్‌క్రీం పోసిస్తే దాన్ని పూర్తిగా నాకి గ్లాసు ఇచ్చేసేవారు. దీన్ని పెన్నీలిక్ అనేవారు. క్షయవ్యాధి భయంతో 1899లో లండన్‌లో దీన్ని నిషేధించారు. 1904లో రీపుల్ కోన్ కనిపెట్టి, ఐస్‌క్రీంని సర్వ్‌చేయడం ఆరంభించారు.

★ క్రిముల వల్ల క్షయ వ్యాపిస్తుందని తెలిసాక, ఓసారి ఉపయోగించి పారేసే కప్పులని 1907లో బోస్టన్‌లో లారెన్స్ ల్యూవెన్ కనిపెట్టాడు. వీటిని 'హెల్త్‌కప్' అనేవారు.



★ 1924లో క్లీనెక్స్ కంపెనీ టిష్యూలని కూడా క్షయ నివారణగా కనిపెట్టింది.

★ రేజర్స్, పెన్స్, నీళ్ళసీసాలు.. డిస్పోజల్స్‌లో రావడానికి కారణం క్షయవ్యాధే.

★ క్షయవల్ల శారీరక పరిశుభ్రత అమెరికాలో బాగా ప్రబలింది. పిల్లలు నిత్యం పదకొండు జాగ్రత్తలని పాటించేవారు. భోజనానికి మునుపు చేతులు కడుక్కోవడం, రోజుకి రెండుసార్లు పళ్ళు తోముకోవడంలాంటివి అమెరికాలో 70 లక్షలమంది పిల్లలతో ఆరంభమై నేడది ప్రపంచమంతా కొనసాగుతోంది.

న్నప్పుడు అది తిరస్కరించిన విషయాన్ని గుర్తుచేస్తూ ఈ ప్రభుత్వం అదే కార్పొరేట్ సంస్థకి స్థలాన్ని ధారాదత్తం చేయాలనుకోవడంలో మతలబేంటో తెలియడంలేదని పత్రికలు రాశాయి" అన్నాడు దేశ్‌ముఖ్.

"నేనూ చదివాను. ఇతరత్రా భూమి అందుబాటులో ఉన్న పక్షంలో ఫారెస్టు భూమి ఇవ్వడం సాధ్యపడదని కదా గత ప్రభుత్వం మీ విన్నపాన్ని తిరస్కరించింది. ఇప్పుడున్న ప్రభుత్వం దృష్టిలో మీకివ్వడానికి ఫారెస్టు భూమి తప్ప మరే భూమీ అందుబాటులో లేదు. అందుకే కల్మేశ్వర్ అటవీ భూమిలో రెండొందల ఇరవై ఎకరాలు మీ ఫ్యాక్టరీకి కేటాయించబోతున్నట్టు అటవీశాఖామంత్రి పేర్కొన్నారుగా" అన్నాడు వంజారి.

"నిజమే! ఇప్పుడు మరో సమస్య వచ్చింది.. నాగపూర్ ఫారెస్టు డిపార్ట్‌మెంట్ వాళ్ళు ప్రభుత్వానికి ప్రతిపాదన పంపే ముందు వైల్డ్‌లైఫ్ వార్డెన్ అభిప్రాయాన్ని తీసుకోలేదనేదేది"

"అలా తీసుకోవాల్సిన అవసరం లేదని కదా అటవీశాఖ వాళ్ళ వాదన. కార్పొరేట్ సంస్థకు కేటాయించాలనుకుంటున్న స్థలానికి పది కిలోమీటర్ల దూరంలో పులుల సంచారం ఉన్నట్టు రుజువులు లేకపోతే

వైల్డ్‌లైఫ్ వార్డెన్‌కి తెలియబర్చాల్సిన అవసరం లేదని డిప్యూటీ కన్జర్వేటర్ సమాధానమిచ్చాడుగా? ”

“అక్కడే మెలిక పడింది. వైల్డ్‌లైఫ్ వార్డెన్ కుందన్ హేటే నిన్న పేపర్ ప్రకటన ఇచ్చాడు. కెమెరా ట్రాప్‌లలో లభించిన ఫొటోల ఆధారంగా చూస్తే ఆ పరిసరప్రాంతాల్లో పులి సంచరిస్తున్న జాడలు కన్పించాయని.. అందువల్ల ఫారెస్టు భూమిని కార్పొరేట్ సంస్థకు అప్పగించడాన్ని తను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నట్టు చెప్పాడు. అంతే కాకుండా అలా చేయడం వల్ల పులికీ, మనిషికీ మధ్య సంఘర్షణ ఏర్పడే అవకాశముందనీ, తద్వారా పులి మనుషుల మీద దాడిచేసే ప్రమాదముందనీ చెప్పాడు. అటవీ భూముల్ని తక్కువ ధరకు కొట్టేయాలనే దుర్బుద్ధితో మా సంస్థ రాజకీయనాయకుల అండతో పావులు కదుపుతోందని పత్రికలవాళ్ళు మసాలా జోడించి రాశారు. పర్యవసానంగా మా ఫైల్ ఆగిపోయింది”

వంజారి ఓ నిమిషంసేపు ఆలోచించి చెప్పాడు “అందులో నాకేమీ సమస్య కన్పించడం లేదు. మీ ఫైల్‌ని వైల్డ్‌లైఫ్ డిపార్ట్‌మెంట్‌కి పంపించి వాళ్ళ ఉద్దేశమేంటో కనుక్కుంటే సరి!”

దేశ్‌ముఖ్ కంగారు పడ్డాడు “అప్పుడు కొంపలంటుకుంటాయి కదాసార్! ఆ హేటే మనకు వ్యతిరేకంగా రాసి పడెయ్యడా? ”

పెద్దగా నవ్వాడు వంజారి “ఇంట్లోకి నడిచొచ్చే లక్ష్మిని చూసి మొహం తిప్పుకునే మహానుభావులు నా దృష్టికి ఇప్పటివరకూ రాలేదు. మీక్కనిపిస్తే చెప్పండి. దర్శనం చేసుకుని కాళ్ళకు నమస్కారం చేసి తరిస్తాను” అన్నాడు.

“అంతేనంటారా? ”

“ముమ్మాటికీ అంతే! నేనున్నానుగా చక్రం తిప్పడానికి. నాకొదిలేసి నిశ్చింతగా ఉండండి. ఖర్చు కొంచెం పెరుగుతుందని మీకర్థమై ఉంటుంది. దాన్ని సర్దుబాటు చేయండి చాలు”

“రేపు సాయంత్రం లోపల మీకందే ఏర్పాటు చేస్తాను” అంటూ లేచాడు దేశ్‌ముఖ్. అతనికి తోడుగా వచ్చిన వాళ్ళు కూడా లేచి నిలబడ్డారు.

వాళ్ళు వెళ్ళబోయే ముందు వంజారి తను రాజకీయాల్లోకి రావాలనుకుంటున్న రోజుల్లో కష్టపడి ప్రాక్టీస్ చేసిన నవ్వుని మొహం నిండా పులుముకుని “వచ్చే ఎన్నికల్లో మీ సపోర్ట్ నాకుంటుందని నమ్ముతున్నాను. ఈసారి గెలిస్తే అటవీశాఖామంత్రిని కావడం ఖాయం. అప్పుడు నా సపోర్ట్ మీకుంటుందన్న విషయం నేను వేరుగా చెప్పక్కరలేదనుకుంటాను” అన్నాడు.

★ ★ ★

మసక చీకట్లు కమ్ముకుంటున్నాయి. గుంజన్ వేగంగా పనిచేసుకుపోతున్నాడు. ఈసారి అతడు కొత్తరకం ట్రాప్‌ని ఉపయోగించాలనుకుంటున్నాడు. పాదానికి బిగుసుకునే సంకెల కాకుండా నేరుగా మెడకు చుట్టుకుని బిగుసుకుపోయి వూపిరాడకుండా చేసే ట్రాప్. పులి కాలు తగిలితే చాలు స్ప్రింగ్ పనిచేసి రెండు లోహపు చేతుల్తో మెడని పట్టేసుకున్నట్టు దాన్ని శరీరం కదలకుండా పట్టేసుకుంటుంది. రెండ్రోజుల క్రితమే ఈ ట్రాప్‌ని కొన్నాడు. దాన్ని చెట్టుకి కట్టక్కరలేదు. జంతువు వూపిరాడక నిలబడిపోతుంది. కాబట్టి దాన్ని చంపడం కూడా సులభం.

పులి తన పిల్లల్తో రాత్రుళ్ళు ఆహారం కోసం బయల్దేరినపుడు నడిచే స్థలంలో ట్రాప్‌ని అమర్చి అది కన్పించకుండా దాని పైన ఆకులు కప్పాడు. ప్లాస్టిక్ కవర్లో చుట్టి తెచ్చిన బలిసిన కొర్రమీను చేపలు నాల్గింటిని భుజానికి తగిలించుకున్న సంచీలోంచి తీసి, దానికి నాలుగు వైపులా ఉంచాడు. పులి ఎటువైపు నుంచి వచ్చినా

చేపని అందుకోడానికి ప్రయత్నించగానే ట్రాప్‌లో ఇరుక్కోడం ఖాయం.

చీకటి పడే లోపలే చెట్టెక్కి కూచు న్నాడు. సాధారణంగా పులిని వేటాడ్డానికి వెళ్ళాలంటే పర్ధితెగ నుంచి కనీసం పది మంది మనుషులైనా జట్టుగా బయల్దేర తారు. కానీ గుంజన్ మాత్రం ఒంటరిగానే వేటాడతాడు. నెలకో, రెణ్ణెల్లకో ఓ బేరం తగలడం, ఆ వచ్చిన డబ్బుని అందరూ పంచుకోవడం వల్ల పర్ధితెగలో పులుల్ని చంపి అమ్ముకోవడం ద్వారా ధనవంతులై నవారెవ్వరూ లేరు. బేరం తగిలిన తర్వాత ఓ పదిరోజులు బాగా తిని తాగడం, ఆ తర్వాత పస్తులుండటం లేదా చిన్నచిన్న దొంగతనాలు చేసి పొట్టనింపుకోవడం వా ళ్ళకు అలవాటే. తనకు వచ్చే డబ్బుల్ని మిగతా వాళ్ళతో పంచుకోవాల్సిన అవస రం లేనందువల్ల గుంజన్ ఒక్కడే ఆ తెగ లో సంపాయించిన దాంట్లో ఎంతో కొంత వెనకేసుకున్నాడు. ప్రస్తుతం పర్ధీతెగలో గుంజన్ ఒక్కడే కొద్దిగా డబ్బున్న వ్యక్తి.

వెన్నెల విరగకాస్తోంది. గుంజన్ ఓపిగ్గా ఎదురుచూస్తూ కూచున్నాడు. అర్ధరాత్రి దాటిపోయింది. పులిజాడ కన్పించలేదు. సాధారణంగా పులిని చంపాలనుకున్న ప్పుడు మేకని ఎరగా వేస్తారు. గుంజన్‌కది ఇష్టంలేదు. మేకపిల్లని చెట్టుకి కట్టేసిన పుడు దాని అరుపులకి పులే రావాలని లేదు. మాంసాహారానికి అలవాటు పడ్డ ఏ క్రూర జంతువైనా రావొచ్చు. అందుకే పులి తిరుగాడే స్థలంలో బలిసిన చేపల్ని వేయడం మొదలెట్టాడు గుంజన్. పులి చేపల్ని బాగా ఇష్టంగా తింటుంది. దానికి తోడు చేప వాసన తొందరగా గాలిలో కలుస్తుంది. అతని ఆలోచన సరైందేనని గతానుభవాలు రుజువు చేశాయి. కానీ ఈ రోజు పులి రాకపోవటంతో తనేమైనా తప్పు చేశానా అని ఆలోచించాడు.

కొంతమంది వేటగాళ్ళు మాంసాన్ని ఎరగా వేస్తారు. ఎటొచ్చీ ఆ మాంసంలో విషం కలిపి పెడ్తారు. దాన్ని తిన్న జంతువు చచ్చిపోతుంది. కానీ పులిని అలా చంపడం వల్ల దాని మాంసం ఎము కలు పనికిరాకుండా విషతుల్యమైపో తాయి. చర్మం, గోళ్ళు తప్ప అమ్మకానికేవీ పనికిరావు.

ఈ రోజుకిక రాదేమో అనుకుంటున్నం తలో పులి గాండ్రింపు విన్పించింది. కొద్ది సేపు వేచి చూశాక పులి పిల్లల్తో పాటు రావడం కన్పించింది. గుంజన్ మనసులో ఒకే ఒక భయం సుళ్ళు తిరుగుతోంది. తల్లి పులికి బదులు దాని పిల్లల్లో ఒకదాని మెడకు ట్రాప్ బిగుసుకుంటే ఏం చేయాల నేది. తల్లి పులి ముందు నడుస్తుంటే దాని కిరువైపులా వెనగ్గా పులి పిల్లలు నడుస్తుం డటం చూశాక అతని మనసు కొంత నెమ్మదించింది.

వూపిరి బిగపట్టి కూచున్నాడు. అతను శ్వాస తీసుకుంటున్న శబ్దం అతనికే విన్పిం చేంత ఉత్కంఠ! పులి చేపల వాసన పసి గట్టి మెల్లగా ట్రాప్ ఉన్నవైపుకి దారితీ సింది. మొదట ట్రాప్‌కి ఇటువైపున్న చేపని నోట్లో కరిచి పట్టుకుని తన పిల్లల ముందు పడేసింది. అవి రెండూ చేపని తినడం మొదలెట్టాక ట్రాప్‌కి కుడిపక్క నున్న చేపను ఒక్క గుటకలో నమిలి మింగేసింది. ఆ తర్వాత అటువైపున్న చేప కోసం కొద్దిగా ముందుకు కదలగానే ట్రాప్ చిన్నగా శబ్దం చేస్తూ దాని మెడకు బిగు సుకుపోయింది. అది వూపిరాడక గింజుకో వటం ప్రారంభించింది. పులి పిల్లలు రెండూ బెదిరి దూరంగా వెళ్ళి బిక్కుబిక్కు మంటూ చూస్తున్నాయి. అదే అదనుగా గుంజన్ ఒక్క గెంతులో కిందికి దూకాడు. పులి తన ముందు పంజాలతో స్టీల్ బద్దల్ని తొలిగించుకోవడానికి విశ్వప్రయ త్నం చేస్తోంది. అంతకంతకూ దాని గొం తు చుట్టూ మరింత బిగుసుకుపోవడంతో

అది కింద పడిపోయింది. గుంజన్ తన గొడ్డలితో దాని తలమీద బలంగా మోదాడు. క్షణాల్లో అది ప్రాణాలు విడిచింది.

పులి పిల్లలు మరింత దూరంగా వెళ్ళి గుంజన్‌వైపు భయంగానూ, కోపంగానూ చూస్తున్నాయి. గుంజన్ వాటిని పట్టుకోవడానికి వెంట పడ్డాడు. అవి చెరోవైపు పరుగెత్తి పొదల్లో దూరి మాయమైపోయాయి. అవింక దొరకవని నిర్ధారించుకుని గుంజన్ వెనక్కి తిరిగి వచ్చాడు. తన వెంట తెచ్చుకున్న చక్రాల చెక్కపలక మీద గోనెసంచి పరిచి, దాని మీదకి పులి శరీరాన్ని చేర్చాడు. తాళ్ళతో దాన్ని చెక్కపలకకి కట్టేశాడు. దానికున్న తాడుని భుజం మీద వేసుకుని లాక్కుంటూ అడవి బైటకి చేరుకున్నాడు. పులి శరీరం బాగా బరువుగా ఉండి మెల్లగా లాగాల్సి రావడం వల్ల, ఎగుడుదిగుడు నేల వచ్చినపుడు మరింత జాగ్రత్తగా వ్యవహరించాల్సి రావడం వల్ల అడవి లోపల నుంచి బైటకు రావడానికి దాదాపు రెండు గంటల సమయం పట్టింది.

రోడ్డు పక్కన పెట్టిన ట్రాలీలో అతని బంధువు సిద్ధంగా ఉన్నాడు. ఇద్దరూ కలిసి పులి శరీరాన్ని ట్రాలీలోకి ఎక్కించి పైన గోనెపట్టాలు కప్పారు. మరో గంటలో తెల్లారుతుండనగా ఇళ్ళకు చేరుకున్నారిద్దరూ.

పర్ధితెగకు చెందిన దాదాపు పాతిక కుటుంబాల్లో ఆ రోజు పండగ వాతావరణం నెలకొంది. వాళ్ళు పులిమాంసం రుచి చూసి చాలారోజులైంది. పులుల సంఖ్య తగ్గిపోవడం వల్ల, అటవీ సిబ్బంది పులుల సంరక్షణ విషయంలో అప్రమత్తంగా ఉండటంవల్ల పులుల్ని వేటాడటం బాగా తగ్గింది. ఒకప్పుడు పులి చర్మాల కోసం అడవిలో వేటాడేవాళ్ళను అటవీ సిబ్బంది పట్టుకుంటే జైలుశిక్ష మాత్రమే ఉండేది. ఆమధ్య మహారాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకంగా అడవి జంతువుల సంరక్షణ కోసం ఓ ఉత్తర్వు జారీ చేసింది. అడవిలో ఎవరైనా అనుమానంగా కన్పించినా సరే కాల్చేసే అధికారం ఫారెస్టు అధికారుల కిచ్చింది. అందువల్ల పర్ధితెగవాళ్ళు అడవిలోకి వెళ్ళడానికే భయపడుతున్నారు. గుండెలు తీసిన బంటు కాబట్టే గుంజన్ అడవిలోకి వెళ్ళి పులిని చంపి తీసుకురాగలిగాడని అందురూ అనుకున్నారు.

గుంజన్ లాఘవంగా పులి చర్మాన్ని దాని శరీరం నుంచి వేరుచేశాడు. దాని ఎముకలకు అంటుకుని ఉన్న చర్మాన్ని గీకేసి ఎముకల్ని వేరుగా ఓ గోనెసంచిలో వేసి పెట్టాడు. దాని గోళ్ళను కత్తిరించి చిన్న ప్లాస్టిక్ కవర్లో వేశాడు. మిగిలిన మాంసాన్ని అన్ని కుటుంబాలకు పంచాడు.




అన్ని ఇళ్ళల్లో మసాలా వేసి మాంసం వండుతున్న వాసనకు పిల్లలందరూ ఎపుడెపుడు తిందామా అని ఉత్సాహంగా ఉన్నారు. పులి మాంసం మేక మాంసం లానే రుచిగా ఉంటుంది. దానికన్నా మృదువుగా కూడా ఉంటుంది. దాన్ని తింటే చాలా బలమొస్తుందని వాళ్ళ నమ్మకం. మొదట గుండెను తిన్నాక మిగతా మాంసం తింటే పులిలా శక్తి సామర్థ్యాలు పెరుగుతాయని వాళ్ళలో ఓ మూఢనమ్మకం కూడా ప్రచారంలో ఉంది.

ఒక్క గుంజన్ ఇంట్లో మాత్రం విషాదం అలముకుని ఉంది. దానిక్కారణం శ్రద్ధ. గుంజన్ కూతురు శ్రద్ధ కాలేజీలో పద కొండో తరగతి చదువుతోంది. పర్దితెగలో చదువుకుంటున్న ఒకే ఒక అమ్మాయి శ్రద్ధ. ఆ అమ్మాయిని చదివించడానికి ముఖ్యకారణం గుంజన్‌కున్న ఆర్థిక వెసు లుబాటు మాత్రమే కాక శ్రద్ధకు చదువు మీదున్న శ్రద్ధ కూడా. శ్రద్ధకు డాక్టర్ కావా లని కోరిక. రకరకాల రోగాల్తో బాధపడ్తున్న తన తెగవాళ్ళకు వైద్యసేవలు చేసి ఆదుకోవాలని కంకణం కట్టుకుందా అమ్మాయి.

గుంజన్ ఇంటికొచ్చిన క్షణం నుంచీ శ్రద్ధ కోపంగా ఉంది. విపరీతంగా బాధప డ్తోంది. గుంజన్, అతని భార్య ఎంత సముదాయించినా ఆమె కోపం తగ్గటం లేదు. ఏడుపూ ఆపడం లేదు. దీనికి బీజం మూడునెలల క్రితం కాలేజీలో సంజయ్ కొఠారి అనే లెక్చరర్ వేశాడు.

మూడు నెలల క్రితం ఏం జరిగిం దంటే..

పర్యావరణానికి సంబంధించిన పాఠం చెప్తున్నాడు లెక్చరర్ సంజయ్ కొఠారి. శ్రద్ధ చాలా శ్రద్ధగా వింటోంది. మామూ లుగానే ఆ పిల్లకు చదువంటే చాలా ఇష్టం. అందునా కొఠారి చెప్పే పాఠాలంటే చెవి కోసుకుంటుంది. దానికి చాలా కార ణాలున్నాయి. కొఠారి చాలా మృదువుగా మాట్లాడతాడు. అతని ప్రతిమాటలో విద్యార్థుల మీద ప్రేమ, వాత్సల్యం ఉట్టిప డుతుంటాయి. తన అనుచరులతో సంభా షిస్తున్న ఏసుక్రీస్తులా కన్పిస్తాడతను. పాఠాలతో పాటు జీవకారుణ్యాన్ని ప్రబోధి స్తుంటాడు. ప్రకృతి సంపదని కాపాడుకో వాల్సిన అవసరం గురించీ, ప్రాణికోటిని రక్షించుకోవాల్సిన అగత్యం గురించీ నూరి పోస్తుంటాడు. 'వైల్డ్ లైఫ్ ట్రస్ట్' అనే స్వచ్ఛంద సంస్థని ప్రారంభించాడు. దాని ముఖ్యోద్దేశం అటవీ జంతువుల్ని కాపా డటం. పులుల్ని రక్షించడం. చెట్లని, జంతు వుల్ని పరిరక్షించుకోడానికి ఆకాశం నుంచి దిగివచ్చిన దేవదూత ఇతను అనుకుంటా రందరూ.

ఆ రోజు పాఠం మధ్యలో పులుల ప్రస్తా వన వచ్చింది. "మనదేశంలో ప్రకృతి సంపదకు కొదవలేదన్న విషయం మీకు తెలుసు. ఎన్నో నదులున్నాయి.. జీవన దులు. ఎన్నో జంతువులకు ఆవాస యోగ్యంగా దట్టమైన అడవులున్నాయి. బ్రిటీష్‌వాళ్ళ హయాంలో మనదేశంలో ఉన్న పులుల సంఖ్య ఎంతో తెలుసా? యాభైవేలు! కానీ ప్రస్తుతం వాటి సంఖ్య రెండువేల రెండొందల ఏభైకంటే తక్కు వకు పడిపోయింది. ప్రభుత్వం అభయార ణ్యాల పేరుతో పులులకు సంరక్షణ కల్పి స్తున్నా వాటి సంఖ్య గణనీయంగా తగ్గిపో వడానికి కారణం తెలుసా? " అని కొఠారి విద్యార్థుల్ని ఉద్దేశించి అడిగాడు.

"సరదా కోసమో, ప్రతిష్ఠ కోసమో పులుల్ని వేటాడి చంపడం వల్ల" అన్నాడో విద్యార్థి.

కొఠారి నవ్వి "బ్రిటీష్ దొరలు పరిపా లించే రోజుల్లో వేట పేరుతో పులుల్ని చంపేవారు. పులిని చంపడమనేది ఆ రోజుల్లో గొప్ప ఘనకార్యంలా భావించి, చనిపోయిన పులి వెనక ఫోజులిచ్చి నిల బడి ఫొటోలు దిగేవారు. పులుల సంఖ్య తగ్గడానికి ఆ రోజుల్లో అదో కారణం. ఇపు డలాంటివి చేయడం చట్టవిరుద్ధం. జైలు శిక్ష పడ్తుంది" అన్నాడు.

"పులుల్ని వాటి చర్మాల కోసం దొంగత నంగా చంపడం వల్ల" అన్నాడు మరో విద్యార్థి.

"అదే ముఖ్యమైన కారణం. పులుల చర్మాల కోసం వాటిని చంపేవాళ్ళని పోచ ర్లంటారు. మరో కారణమేమంటే పులులు, వాటి పిల్లలు మోటారు వాహనాల కింద

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, పెద్దకథ, నవలావలోకనం, చతుర ప్ర.జ. ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ ఆగస్టు 17. – సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

---

పడి చనిపోవడం. మనదేశంలో పులుల సంరక్షణ కోసం నలభైయేడు కేంద్రాలున్నాయి. ఇవన్నీ 'నేషనల్ టైగర్ కన్సర్వేషన్ అథారిటీ' కింద పని చేస్తుంటాయి. ప్రపంచంలో ఉన్న మొత్తం పులుల్లో డెబ్బయ్ శాతం పులులు మనదేశంలోనే ఉన్నాయి. కానీ మనిషి తన స్వార్థం కోసం వాటిని చంపి వాటి చర్మంతో, ఎముకల్తో వ్యాపారం చేయడం ప్రారంభించాక వాటి సంఖ్య బాగా తగ్గిపోతోంది. 1986- 92 మధ్య కాలంలో రెండు వందల పులుల్ని పోచర్లు చంపారంటేనే ఈ సమస్య ఎంత తీవ్రమైందో మీకర్థమవుతుంది. పులి ఎముకల్ని చైనాలో మందులు తయారుచేయడానికి వాడతారు. చైనా ప్రభుత్వం పులి శరీర భాగాల్తో వ్యాపారం చేయడాన్ని నిషేధించాక, ఇది మరింత ఉద్ధృతంగా, దొంగచాటుగా జరగడం మొదలైంది. కేవలం నాలుగైదు వేలకోసం పోచర్లు పులిని చంపుతారని తెలిసినపుడు నేనెంత బాధపడ్డానో.. మధ్యవర్తులు మాత్రం వేలకు వేలు సంపాయించుకుంటారు. పోచర్ల అమాయకత్వాన్ని, వాళ్ళకు అడవితో ఉన్న పరిచయాన్ని, పులులకు సంబంధించి వాళ్ళకున్న విజ్ఞానాన్ని మధ్యవర్తులు దోచుకుంటున్నారన్న మాట"

"పోచర్లు ఎక్కువగా మన రాష్ట్రంలోనే ఉన్నారటగా సార్! పర్ధిజాతికి చెందిన మనుషులు పోచర్లుగానే బతుకుతారనీ, పులుల్ని వేటాడి చంపడంలో వాళ్ళు సిద్ధహస్తులనీ మా నాన్న చెప్పాడు" అన్నాడో విద్యార్థి.

అతని మాటలకు శ్రద్ధ ఉలిక్కిపడింది. తన జాతికి సంబంధించిన ప్రస్తావన రాగానే భయంతో ముడుచుకుపోయింది.

కొఠారి మౌనంగా ఉండటం చూసి "మాతోపాటు చదువుతున్న శ్రద్ధ కూడా పర్దిజాతి అమ్మాయే సార్" అన్నాడా కుర్రాడు అదోలా నవ్వుతూ.

"పర్దిజాతి వాళ్ళందరూ దొంగలట కదా సార్! మా తాతయ్యవాళ్ళది ఆంధ్రప్రదేశ్‌లో వేటపాలెం అనే వూరు. అక్కడికి దగ్గర్లో స్టూవర్ట్‌పురం అనే వూరుందట. అక్కడి మనుషులంతా దొంగలేనట. ఒంటి నిండా ఆముదం రాసుకుని దొంగతనాలకెళ్తారట, ఎవరైనా పట్టుకున్నా జారి పోవడానికి. అక్కడ స్టూవర్ట్‌పురం ఎలానో మనకు పర్దితెగవాళ్ళు అలాగట కదా! మా అమ్మ చెప్పింది"

వాళ్ళ చూపులు 'నువ్వు దొంగల కులంలో పుట్టావు కాబట్టి నువ్వు కూడా దొంగవే' అన్నట్టు గుచ్చుకుంటున్నాయి. తనా జాతిలో పుట్టడమే నేరమైనట్టు వాళ్ళ ఎగతాళి నవ్వులు గుండెల్ని రంపంలా కోస్తున్నాయి. ఆమెకు ఏడుపు తన్నుకు వచ్చింది.

తలొంచుకుని కన్నీళ్ళ పర్యంతమవుతున్న శ్రద్ధవైపు చూశాడు కొఠారి. "నువ్వెందుకమ్మా ఏడుస్తావు? ఏం తప్పు చేశావని? నువ్వెందుకు తలొంచుకుంటావు? తలొంచుకోవాల్సింది నిన్ను చూసి నవ్విన మిగతా విద్యార్థులు కదా! తోటి విద్యార్థి విషయంలో సంస్కార హీనంగా ప్రవర్తించింది వాళ్ళు కదా! నువ్వు బాధపడ్తావని తెలిసి కూడా నిన్ను అవమానకరంగా అవహేళన చేసిన వాళ్ళు కదా సిగ్గుతో నేలలోకి తమ తలల్ని పాతేసుకోవాలి" అన్నాడు.

క్లాస్ ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది.

క్లాస్ మొత్తాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ "శ్రద్ధ పర్దితెగకు చెందిన అమ్మాయి అని నాకు తెలుసు. మీరు గుర్తుచేయాల్సిన అవసరం లేదు. అయినా ఓ కులానికి చెందినవాళ్ళందర్నీ దొంగలుగా ముద్ర వేయడం దారుణం. మనల్ని బానిసలుగా చేసి రెండొందలేళ్ళకు పైగా పరిపాలించిన ఆంగ్లేయుల మానసిక వైకల్యంలోంచి పుట్టిందే, 1871లో వాళ్ళు జారీ చేసిన క్రిమినల్ ట్రైబ్స్ చట్టం. దాదాపు నూటయాభై జాతుల్ని ఈ చట్టం పరిధిలోకి తెచ్చి, వాళ్ళని అణచడానికి పోలీసులకు విస్తృతాధికారాల్ని కట్టబెట్టారు. పుట్టుకతోనే ఎవరూ దొంగలో, నేరగాళ్ళో కారు. పరిస్థితుల ప్రభావంతో కొంతమంది అలా మారవచ్చు. అంతే! జాతి జాతినంతా నేరగాళ్ల జాతిగా పరిగణించడం వెనుక ఆంగ్లేయుల కుట్ర దాగి ఉంది. ముఖ్యంగా పర్దితెగని ఈ చట్టంలో చేర్చడానికి కారణం చెప్తాను.

ఆంగ్లేయులకు ముందు పరిపాలించిన మొగలాయిలు అడవుల్నించి ఆదాయాన్ని ఆశించలేదు. తమ బొక్కసాలు నింపుకోవడానికి అడవులు కామధేనువుల్లాంటివని గుర్తించిన ఆంగ్లేయులు వాటి మీద పూర్తి నియంత్రణని సాధించారు. దానివల్ల అప్పటివరకూ అడవితల్లి మీద ఆధారపడి, వేట ద్వారా ఆహార సముపార్జన చేసిన పర్దితెగవాళ్ళు నిరాశ్రయులయ్యారు. దాంతోపాటు ఆహారం కోసం అనేక వృత్తులు చేపట్టాల్సిన అగత్యం ఏర్పడింది. అందులో ఎక్కువశాతం మంది వ్యవసాయ కార్మికులుగా భృతిని వెతుక్కున్నారు. కొంతమంది మాత్రం దొంగతనాల్ని, పులుల్ని చంపడాన్ని వృత్తిగా స్వీకరించారు. ఆ కొద్ది మంది వల్ల జాతి మొత్తానికీ చెడ్డ పేరు స్థిరపడిపోయింది.

మన దేశానికి స్వతంత్రం సిద్ధించాక క్రిమినల్స్ ట్రైబ్ చట్టాన్ని రద్దు చేశారు. అయినప్పటికీ పర్దితెగవాళ్ళందరూ దొంగలన్న మచ్చ మాత్రం మాసిపోలేదు. దానికి దోహదం చేసింది మన పోలీసు వ్యవస్థే. పర్ది తెగవాళ్ళు నివాసముండే చుట్టుపక్కల ఏ దొంగతనం జరిగినా ఆ

తెగలోని మగవాళ్ళని ముసలీముతకా అనే భేదం లేకుండా పోలీస్‌స్టేషన్‌కి లాక్కెళ్ళి చితకబాదటం ఆనవాయితీగా మారింది. పర్థితెగవాళ్ళు ఎన్నెన్ని అవమానాల్ని సహిస్తున్నారో తమపై పడిన ముద్రని చెరిపేసుకోలేక ఎన్నెన్ని అవస్థలు పడుతున్నారో మీకెవ్వరికీ తెలియదు.

వాళ్ళ తెగలో అందరూ దొంగలని ఎవరో చెప్పగానే మీరందరూ శ్రద్ధను చూసి ఎగతాళిగా నవ్వారు. తప్పు కదా! శ్రద్ధ ఒక్కతే వాళ్ళ తెగనుంచి చదువుకుంటున్న పిల్ల. దానికి మనందరం ఆ పిల్లను అభినందించాలి కదా! నా క్లాస్‌లో చదువుకుంటున్న విద్యార్థులకు కూడా అప్పటి బ్రిటీషర్లకున్న మనోవైకల్యం ఉండటం నన్నింకా బాధ పెడ్తోంది. నేనిన్నాళ్ళూ మీకు నేర్పిందంతా ఏమైపోయింది? ఎదుటి వ్యక్తిని ప్రేమించండి. ప్రేమించకున్నా ఫర్లేదు కానీ ద్వేషించకండని నేను చెప్పిన పాఠాలు ఎటు పోయాయి? నేను నేర్పిన సంస్కారం ఏమైపోయింది? నేనీరోజు ఇంక పాఠం చెప్పలేను. గాయపడిన మనసుకి కొంత సాంత్వన కావాలి" అంటూ కొఠారి బైటికెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు.

క్లాస్‌లోని విద్యార్థులందరూ లేచి నిలబడి "సారీ సార్! మావల్ల తప్పయింది.. క్షమించండి!" అన్నారు.

"మీరు క్షమించమని అడగాల్సింది నన్ను కాదు.. శ్రద్ధని" అని శ్రద్ధ వైపు తిరిగి "నువ్వోసారి నా రూంకి రా! మాట్లాడాలి" అనేసి కొఠారి బైటికెళ్ళిపోయాడు.

తన తోటి విద్యార్థులు సారీ చెప్పినా శ్రద్ధ మనసులో గాయం పచ్చిగానే సలుపుతోంది. వీళ్ళ తప్పేముంది? సమాజంలో ప్రబలంగా ఉన్న అభిప్రాయాన్నేగా వీళ్ళూ చెప్పారు. పోలీసులందరూ తన జాతివాళ్ళని పుట్టుకతో దొంగలనే కదా అనుకుంటున్నారు. పోలీసులంటే ప్రభుత్వమేగా! ప్రభుత్వమే తన తెగవాళ్ళ నుదుటి మీద దొంగలని పచ్చబొట్టు పొడుస్తున్నప్పుడు తన తోటి విద్యార్థులు మరోలా అనుకుంటారని వూహించడం తప్పే. అలా అనుకోవాలని ఆశించడం కూడా తప్పే.

శ్రద్ధ వెళ్ళే సమయానికి కొఠారి ఏదో పుస్తకం తిరగేస్తున్నాడు. శ్రద్ధని చూడగానే పుస్తకాన్ని మూసేసి "కూర్చో శ్రద్ధా" అన్నాడు.

శ్రద్ధ అతనికెదురుగా ఉన్న కుర్చీలో కూచుంది.

"నువ్వీ కాలేజీలో అడ్మిషన్‌కొచ్చినపుడు నేనెంత సంతోషపడ్డానో తెలుసా శ్రద్ధా? మీ పర్థితెగ గురించి నాకు బాగా తెలుసు. మీ వాళ్ళలో అలసత్వం ఎక్కువ. మగపిల్లల్ని కూడా స్కూళ్ళకు పంపరు. అలాంటిది నువ్వు ఆడపిల్లవై ఉండి బాగా చదువుకుంటున్నందుకు ఎంత ముచ్చటపడ్డాను తెలుసా? మీ తెగలో ఉన్న అంధకారాన్ని పారదోలడానికి నువ్వో జ్యోతిలా ఉపయోగపడ్తావని ఆశపడ్డాను. కానీ ఈ రోజు నిన్ను చూసి కొంత నిరాశపడ్డానమ్మా" అన్నాడు కొఠారి.

"ఎందుకు సార్? నన్నెవరెంతగా అవమానించినా నేను చదువు ఆపను సార్! డాక్టర్ కోర్సు చదివి మా తెగలోని వాళ్ళందరికీ ఉచితంగా వైద్య సేవలందించాలనేది నా ఆశయం. అది సాధించి తీరుతాను సార్!" అంటున్నప్పుడు శ్రద్ధ కళ్ళు

## కొత్తగాలి...

**జీవితం అనే మంచం మీద**
**ఆలోచనలనే నల్లులు**
**పొడిచి పొడిచి**
**మనిషిని హింసిస్తున్నాయి**

*- బి. గోవిందరాజు,*
మన్యంవారి పాలెం, తూ. గో. జిల్లా

మెరవడం గమనించాడతను.

"నేను నిరాశ పడింది అందుకు కాద మ్మా! వాళ్ళేదో అనగానే నువ్వు తలొంచు కున్నావు చూడు అందుకు. నేను నీ నుంచి ఆశించేది తలొంచుకోవడం కాదమ్మా! ఝాన్సీరాణిలా ఎదురొడ్డి పోరాడటం"

"మా జాతివాళ్ళందరినీ దొంగలంటుంటే ఏడుపు రాకుండా ఎలా ఉంటుంది సార్? ఒక్కోసారి నేనీ జాతిలో ఎందుకు పుట్టానా? అని బాధపడుతుంటాను. మా కులంలో కాక మరో కులంలో పుట్టి ఉంటే ఈ అవమానాలుండేవి కాదుకదా! అన్పిస్తుంది" శ్రద్ధ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

కొఠారి ఓ నిమిషం మౌనంగా ఉన్నాక చెప్పాడు. "నీతో మాట్లాడాలనుకున్న విషయం ఇదేనమ్మా! నువ్విలా అనుకుంటూ ఉంటావని వూహించాను. నీ ఆలోచన తప్పని చెప్పడానికే పిలిపించాను. నువ్వు నీ పర్దితెగలో పుట్టినందుకు గర్వపడాలమ్మా!"

"ఏముంది సార్ గర్వపడటానికి? "

"గర్వపడేలా చేయవచ్చు కదా!"

"నేనేం చేయగలను? "

"నువ్వే చేయగలవు. చాలా చేయగలవు. మీ తెగలో చదువుకుంటున్న ఒకే ఒక వ్యక్తిగా నువ్వు తల్చుకుంటే చాలా సాధించగలవు"

"ఏం చెయ్యాలో చెప్పండి సార్! మా తెగ బాగుపడ్తుందంటే దానికోసం నేను ఏం చెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నాను"

"నువ్వు చేయాల్సిన పనులు ముఖ్యంగా రెండున్నాయి. మొదటిది మీ తెగవాళ్లకు చదువు ప్రాముఖ్యాన్ని తెలియజెప్పడం. మీవాళ్లు ఎంతటి పేదరికంలో మగ్గుతున్నారో నాకు తెలుసు. దాన్నుంచి బైటపడడానికి ఒకే ఒక రాచమార్గం చదువు. మీకు ప్రభుత్వం రిజర్వేషన్లు కల్పించింది కాబట్టి బాగా చదువుకుంటే ప్రభుత్వ ఉద్యోగాలు దొరుకుతాయి. దానివల్ల ఆర్థికంగానే కాక సాంఘికంగా కూడా ఎదగవచ్చు. తద్వారా సమాజంలో మీ వాళ్లకో గుర్తింపు లభిస్తుంది"

శ్రద్ధ పేలవంగా నవ్వింది. "ప్రభుత్వం మాపైన దొంగలనే ముద్ర వేయడం తప్ప ఏ రకమైన ప్రయోజనాలూ కల్పించలేదు సార్! మా పేర్లు ఓటర్ల లిస్టులో చేర్చుకోరు. మేం సంచార జాతులమట. స్థిరనివాసం లేదు కాబట్టి రేషన్‌కార్డులూ ఇవ్వరు. ఈమధ్య టెంపరరీ రేషన్ కార్డులు మంజూరు చేయమని ఉత్తర్వులు వెలువడ్డాయి. కానీ అవి కూడా మాకు దక్కటం లేదు సార్! మావాళ్లు ఎక్కడ గుడిసెలేసుకున్నా మున్సిపాలిటీ వాళ్లొచ్చి మమ్మల్ని తరిమేస్తున్నారు. పర్దితెగవాళ్లు చుట్టుపక్కల ఉండటాన్ని ఎవరూ ఇష్టపడరు కదా సార్! అందుకే మున్సిపాలిటీ వాళ్లతో కలిసి ప్రజలే మమ్మల్ని తరిమేసే ప్రయత్నం చేస్తుంటారు. ఇటువంటి పరిస్థితుల్లో ఏ స్కూల్లో అని చేరతారు చెప్పండి. అక్కడ ఆ కుటుంబాన్ని ఎన్నాళ్లు ఉండనిస్తారో తెలీదుకదా!"

"నువ్వు చెప్పింది నిజమే! పర్దితెగవాళ్లు ఎదుర్కొంటున్న సమస్యలు చాలా ఉన్నాయి. ఇందులో ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించడానికి లేదమ్మా! దాన్ని ఆచరణలో పెట్టే వ్యక్తుల్లో ఉన్న లోటుపాట్ల వల్లే ఇలా జరుగుతోంది"

"దానికితోడు చదువు చెప్పించే స్థోమత మా వాళ్లలో ఎంతమందికి ఉందంటారు? ఏ పూటకాపూట గంజినీళ్లు కాచుకోడానికే గతిలేని జాతి మాది"

"నువ్వు చదువుకుంటున్నావు కదమ్మా!"

"మా తెగలో మా ఒక్క కుటుంబమే ఆర్థికంగా కొద్దిగానైనా ఓ మోస్తరుగా ఉంది. మిగతావాళ్లకు చదువుల ఖర్చులు భరించడం కష్టం కదా సార్!"

"నువ్వు మీ తెగలో పిల్లల్ని స్కూళ్లల్లో చేర్పించడానికి పెద్దవాళ్లని ఒప్పించు.

చమత్కారం

# తలబిరుసు పండితుడికి గుణపాఠం

ఒకాయనకి పాండిత్యంలో తనకు ఎవరూ సాటిలేరని మహాతలబిరుసు. నోటి దురుసు. ఎప్పుడంటే అప్పుడు తమలపాకులు నమలడం - వాటిలోకి కావాల్సిన సున్నంకోసం దారే పోయే ఆడపడుచులను సరసంగా అడగడం అప్పట్లో పండితులకు అలవాటు. సున్నమడిగితే సదరు అమ్మాయిలు కూడా గౌరవంగా ఇచ్చేవారు. ఆ అలవాటుతోనే ఈ పండితుడు దారిలో ఎదురైన ఓ పూబోడిని చూసి-



పర్వతశ్రేష్ఠ పుత్రికా పతి విరోధి
అన్నపెండ్లాము అత్తను కన్నతండ్రి
పేర్మిమీరను పెంచిన పెద్దబిడ్డ
సున్నమించుక తేగదే సుందరాంగి!

అన్నాడు. పద్యం చివరిపంక్తిలో చూడండి.. 'సున్నమించుక తేగదే సుందరాంగి' అన్నాడు గురుడు.

ఆ పడతి భ్రుకుటి ముడిపడింది.. వెంటనే-

శతపత్రంబుల మిత్రుని
సుతుచంపిన వాని బావ సూనుని మామన్
సతతము శిరమున దాల్చెడు
సుతువాహన వైరి వైరి సున్నంబిదిగో!

అంటూ ఆయన మొహాన ఇంత సున్నం కొట్టి తనదారిన తానుపోయింది.

పద్యంలో ఆయనేమడిగాడు.. ఈవిడేం చెప్పింది ఇదే కదా మీ సందేహం. ఓసారి పై పద్యం చిత్తగించండి. పర్వతశ్రేష్ఠపుత్రికా పతి విరోధి అంటే- పర్వతశ్రేష్ఠుడు హిమవంతుడు. ఆయన పుత్రిక పార్వతి. ఆమె పతి శివుడు. అతని విరోధి మన్మథుడు ఇది తొలిపంక్తి. అన్నపెండ్లాము అత్తను కన్నతండ్రి- అంటే ఇందాక మన్మథుడిదాకా వచ్చాం కదా! ఆయన అన్న బ్రహ్మ. బ్రహ్మ భార్య సరస్వతి. ఆమె అత్త లక్ష్మి. ఆ లక్ష్మిని కన్న తండ్రి సముద్రుడు. ఆయన ప్రేమగా పెంచిన పెద్దకూతురు, ఇంకెవరు జ్యేష్ఠాదేవి. దరిద్రదేవత!! అందుకే 'ఓ దరిద్రదేవతా సున్నం ఇవ్వవే' అని అడిగాడన్నమాట ఆ పండితుడు.

నన్ను దరిద్రదేవత అంటాడా అనుకుని ఆమె ఎలా తిప్పికొట్టిందో చూడండి. శతపత్రంబుల మిత్రుడు.. సూర్యుడు- సుతుచంపినవాని బావ సూనుని మామన్ అంటే- సూర్యుడి సుతుడు కర్ణుడు, అతన్ని చంపిన వాడు అర్జునుడు. అతని బావ కృష్ణుడు- కృష్ణుడి కొడుకు మన్మథుడు. మన్మథుడి మామ చంద్రుడు- ఈ చంద్రుడ్ని ఎప్పుడూ తలపై మోసేవాడు శివుడు. ఆయన కొడుకు గణపతి. గణపతి వాహనం ఎలుక. ఎలుక శత్రువు పిల్లి. పిల్లికి వైరి కుక్క. కనుక 'ఒరి కుక్కా! ఇదుగో సున్నం' అని ఇచ్చిందట ఆ గడసరి. అదీ చమత్కారం!

- సేకరణ: చంద్రప్రతాప్

స్కూళ్లు, కాలేజీలు నడుపుతున్న ఓ స్వచ్ఛంద సంస్థ నాకు తెలుసు. వాళ్లు ఉచితంగానే చదువు చెప్తారు. పుస్తకాలు కూడా వాళ్లే పంపిణీ చేస్తారు. నేను హామీ ఇస్తున్నాను. మీ వాళ్లకు ఉచితంగా చదువు చెప్పించే బాధ్యత నాది. ఒప్పించే బాధ్యత నీది"

"సరే సార్! తప్పకుండా ప్రయత్నిస్తాను. నేను చేయాల్సిన రెండో పనేమిటో చెప్పండి"

కొఠారి మృదువుగా నవ్వాడు.. "అది చెప్తే అర్థమయ్యే విషయం కాదు. రేపు చూపిస్తాను. క్లాసులయిపోయాక నాతో ఓ గంట సేపు బైటికి రాగలవా? "

"వస్తాను సార్!"

"మీ ఇంట్లో చెప్పి రా, ఓ గంట ఆలస్యమవుతుందని"

శ్రద్ధ నవ్వింది. "మా ఇంట్లో వాళ్లకు చెప్పకుండా ఏ పనీ చేయను సార్!"

"గుడ్! అలానే ఉండాలి.. ట్రాన్స్‌పరెంట్‌గా" అన్నాడతను.

ఆ రాత్రి శ్రద్ధకు నిద్ర పట్టలేదు. రేపు కొఠారి సార్ చూపించబోతున్న విషయం ఏమిటా? అని ఆలోచించింది. ఎంత ఆలోచించినా ఏదీ తట్టలేదు. పోనీ తన జాతికి సంబంధించి తను చేయగల పని మరేమైనా ఉందా? అని ఆలోచించింది. ఫలితం కన్పించలేదు. ఎలాగూ రేపు తెలుస్తుందిగా అనుకుని ఆ విషయాన్ని వదిలేసి మాస్టారు మాటల్ని గుర్తుకు తెచ్చుకుంది. జన్మతః దొంగలన్న ముద్ర పడటం వల్ల పర్ది తెగవాళ్లు అనుభవిస్తున్న కష్టాలు, అవమానాలూ.. తనెన్ని చూడలేదూ! తన పదిహేనేళ్ల వయసులోనే అలాంటి ఘోరాలెన్నో కళ్లారా చూస్తే, యాభై అరవై యేళ్లు దాటిన వాళ్ల సంగతేమిటి?

ఆమెకు వెంటనే పిన్ని చంద్రసేన తనకు పూసగుచ్చినట్టు చెప్పిన విషయాలు గుర్తుకొచ్చాయి. ఆరేళ్ల క్రితం జరిగిందా సంఘటన. బాబాయి కాలేకి అప్పుడు ముప్ఫయ్యేళ్లుంటాయి. వ్యవసాయ పనులకు వెళ్తుండేవాడు. అలా సంపాయించిన అరకొర డబ్బుల్తోనే ముగ్గురు పిల్లలున్న సంసారాన్ని గుట్టుగా నడుపుకొచ్చేది పిన్ని. అప్పుడు పిన్ని కడుపుతో ఉంది. మూడో నెల. దానిమ్మ పండు తినాలనుందని భర్తకు చెప్పిందట. ఎర్రెర్రగా కెంపుల్లా మెరుస్తూ ఊరించే దానిమ్మ గింజల్ని తినాలని ఎవరైనాసరే కోరుకుంటారు కదా! అలాంటిది వేవిళ్లు పడ్తున్న స్త్రీ కోరుకోవటంలో ఆశ్చర్యమేముంది?

కాలే దగ్గర డబ్బుల్లేవు. భార్య కోరింది చిన్నకోరికే అయినా రెండ్రోజులు తన్నుకున్నా దానిమ్మ పండు కొనివ్వలేకపోయాడు. ఆ రోజు ఎలాగైనా సరే దాన్ని సంపాదించాలనుకున్నాడు. పక్కవీధిలోని సర్వేశ్వర్రావు ఇంట్లో దానిమ్మ చెట్టుని, దానికి వేలాడుతున్న దానిమ్మపళ్లని చూశాడు. అతనికి కావాల్సింది ఒక్కటే. మహా అయితే రెండు.

సర్వేశ్వర్రావు ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తాడు. అడిగితే ఒక్క పండు ఇవ్వడా? అని ఆలోచించి ఆ సాయంత్రం వాళ్ల గేటు దగ్గర నిలబడి దీనంగా 'దొరా' అని పిలిచాడు. ఆ పిలుపుకి సర్వేశ్వర్రావుతో పాటు అతని భార్య కూడా బైటికొచ్చింది.

"ఎవర్నువ్వు? ఏం కావాలి? " సర్వేశ్వరరావు గొంతు కర్కశంగా ఉంది.

"నా పేరు కాలే దొరా! పక్కీధి చివర్న గుడిసెల్లో ఉంటాం దొరా!" గౌరవ సూచకంగా కొద్దిగా ఒంగిపోయి చెప్పాడు.

"పర్ది తెగవాడివా? "

కాలే భయపడ్తూనే "ఔ దొరా!" అన్నాడు.

"సర్లే! ఏం కావాలి? " చిరాగ్గా భ్రుకుటి ముడివేస్తూ అడిగాడు.

"నా ఆడది కడుపుతో ఉంది దొరా!

అ
క్ష
రం

**అం**దరిపట్ల మర్యాదగా వ్యవహరించు
ఎక్కువమందితో కలిసిమెలిసి వ్యవహరించు
కొద్దిమందితో పరిచయం పెంచుకో
ఒకరితో స్నేహితుడిగా ఉండు
ఎవరికీ శత్రువు కావద్దు

– బెంజిమిన్ ఫ్రాంక్లిన్



దానికి దానిమ్మ పండు తినాలని ఉందంట. దొరవారు ఓ పండుని ఇప్పిస్తే..”

“పండు కాదుకదా ఓ గింజ కూడా విద ల్చను. పో ఇక్కడి నుంచి”

“సగం పండు కోసిచ్చినా చాలయ్యా!”

“ఇవ్వనన్నానా! మీరందరూ దొంగనా యాళ్లని నాకు తెలీదనుకున్నావా? నా చెట్టుమీదే పడిందా నీ కన్ను! కాళ్లూ చేతులు విరిచేస్తాను ఏమనుకున్నావో! పోరా! పో!” కోపంతో రెండడుగులు ముందుకు వేసి అన్నాడు.

అతని భార్య కలుగజేసుకుంటూ “పోన్లెండి! భార్యకు వేవిళ్లేమో! ఒక్క పండేగా” అంది.

“నువ్వు నోర్ముయ్! నేను మాట్లాడుతు న్నాగా! మధ్యలో నీ బోడి సలహా ఎవరడి గారు? నువ్వు లోపలికి తగలడు” అంటూ భార్యని కసురుకుని కాలేవైపు తిరిగి “ఇంకా ఇక్కడే ఉన్నావేమిటి? పోతావా? పోలీ సుల్ని పిలవమంటావా? ” అంటూ మరో రెండడుగులు గేటువైపుకేశాడు.

కాలే అయిష్టంగానే అక్కడినుంచి కదిలి, సర్వేశ్వరరావు వైపూ బాగా కాయపట్టిన దానిమ్మ చెట్టువైపు వెనక్కి తిరిగి మార్చి మార్చి చూస్తూ వెళ్లిపోయాడు.

మరునాడు ఉదయం పదింటికి కాలే ఇంటిని వెతుక్కుంటూ పోలీసులొచ్చారు. వాళ్లతోపాటే సర్వేశ్వరరావు కూడా ఉన్నాడు.

“పద! స్టేషన్‌కి! నిన్ను ఎస్సయ్ దొర గారు పిల్చుకు రమ్మన్నారు” అన్నాడో కాని స్టేబుల్.

“నేనేం చేశానని పిలిపించారు దొరా? నేనేం తప్పు చేయలేదే? నిన్న సాయంత్రం ఈ దొర ఇంటికెళ్లి ఒక దానిమ్మ పండి మ్మని అడిగినా. అలా అడగడం నేర మని నాకు తెలీదు దొరా” అన్నాడు.

“చెట్టుకున్న పాతిక కాయలూ రాత్రికి రాత్రి దొంగిలించుకుపోయింది కాక ఎలా నాటకాలాడ్తున్నాడో చూడండి” అన్నాడు సర్వేశ్వరరావు ఇద్దరు కానిస్టేబుళ్లతో.

“వీడికిలా చెబితే అర్థంకాదు సార్! లాఠీ భాషైతేనే బాగా అర్థమవుతుంది” అంటూ ఓ కానిస్టేబుల్ లాఠీతో కాలే మోకాళ్ల మీద కొడుతూ “చెప్పరా! పాతిక దానిమ్మ పళ్లు ఎక్కడ దాచావో చెప్పు? ” అన్నాడు.

కాలేకేమీ అర్థం కావడం లేదు. పాతిక పళ్లేమిటి? తనక్కావాల్సింది ఒక్కటే పండు కదా! అదికూడా దొరగారు ఇవ్వ నని కసురుకున్నాడు కదా!

“ఏం చేశావో చెప్పరా? పాతిక పళ్లూ తినేశావా లేకపోతే ఎవర్నికైనా అమ్మే శావా? ” రెండో కానిస్టేబుల్ కూడా తన లాఠీకి పనిచెప్పాడు.

“సత్తె ప్రమాణంగా నాకేమీ తెలీదు దొరా! నా ఆడదాని కడుపులో పెరుగు తున్న బిడ్డ మీద ప్రమాణం చేసి చెప్తున్నా. పాతిక పళ్లు కాదు కదా ఒక్క పండు కూడా దొంగిలించలేదు దొరా” కాలే కింద పడిపోయి కానిస్టేబుళ్ల కాళ్లు మొక్కుతూ అన్నాడు. వాళ్లు కొడ్తున్న దెబ్బలకు తాళలేక వలవలా ఏడుస్తూ సర్వేశ్వరరావు కాళ్లు కూడా పట్టుకున్నాడు.

"ఛీ! వదులు!!" అంటూ విదిలించుకు న్నాడు తప్ప అతడు కనికరం చూపించ లేదు ఏమాత్రం.

కాలేకి ఓ విషయం అర్థం కావడం లేదు. నిన్న సాయంత్రం సర్వేశ్వరరావు ఒక్క పండు కూడా ఇవ్వనన్నప్పుడు ఆ రాత్రికి ఎట్లాగయినా దానిమ్మ పళ్లని దొంగిలించాలన్న ఆలోచన వచ్చింది. ఎటొచ్చీ అదేరోజు దొంగతనానికి పోతే సర్వేశ్వరరావు అప్రమత్తంగా ఉంటాడేమో నన్న అనుమానంతో దాన్ని వాయిదా వేసు కున్నాడు. నాలుగైదు రోజులయ్యాక ఏ అర్ధరాత్రో గేటుదూకి పళ్లని దొంగిలించా లని ప్లాన్ వేసుకున్నాడు. కానీ పాతిక పళ్లు కాదు, రెండు పళ్లని మాత్రమే. ఇంతలో ఆ పళ్లని ఎవరో దొంగిలించి ఉంటారు. తన ఖర్మకొద్దీ నిన్న రాత్రి తను అడిగాడు కాబట్టి అనుమానం తన మీదికి మళ్లింది.

కానిస్టేబుళ్లిద్దరూ గుడిసెలోకెళ్లి అం గుళం అంగుళం గాలించారు. పళ్లు దొర క్కున్నా కనీసం వాటి తొక్కలయినా ఆన వాళ్లుగా దొరికితే చాలని వాళ్ల ఆలోచన. ఏమీ దొరక్కున్నా కాలేని పట్టుకుని స్టేష న్‌కి తీసుకెళ్లారు.

పరర్ధితెగలోని మగవాళ్లని పోలీసుస్టేష న్‌కి పిల్చుకెళ్లి, ఒకట్రెండు రోజులుంచి, ఎముకలు విరిగేలా తన్ని ఇంటికి పంపిం చడం మామూలే కాబట్టి చంద్రసేన రెండ్రోజులు ధైర్యంగానే ఉంది. మూడోరో జుకీ రాకపోయేసరికి పోలీసుస్టేషన్‌కె ళ్లింది. అక్కడ కాలే లేడు.

"దొరా..! నా మొగుడెక్కడ ఉన్నాడు? అడ్ని ఏంచేశారు?" అంటూ నెత్తీనోరు బాదుకుంటూ అడిగితే చావుకబురు చల్లగా చెప్పారు అక్కడివాళ్లు.

"వాడు మా కానిస్టేబుళ్ల నుంచి తప్పిం చుకుని పారిపోతూ పోతూ కాలుజారి కింద పడ్డాడు. తలకి బలంగా రాయి తగిలి అక్కడికక్కడే చచ్చిపోయాడు. శవం మార్చురీలో ఉంది. వెళ్లి చూసుకో" అన్నాడు ఎస్సై.

చంద్రసేన తన మొగుడి శవాన్ని చూసింది. ఒంటి నిండా గాయాలు కన్పిం చాయి. ఎవరి సలహాతోనో ధైర్యం చేసి కోర్టులో కేసు వేసింది. పోస్టుమార్టం రిపో ర్టులో కింద పడటం వల్ల దెబ్బలు తగిలి చనిపోయినట్లు డాక్టర్ రిపోర్టిచ్చాడు. చంద్రసేన అంతటితో వదిలి పెట్టక మరో సారి పోస్టుమార్టం జరిపించాల్సిందిగా కోర్టువారికి అర్జీ పెట్టుకుంది. కోర్టు ఆమె విన్నపాన్ని మన్నించి రెండోసారి పోస్టు మార్టం నిర్వహించాల్సిందిగా ఆదేశిం చింది. ఈసారి రిపోర్టులో కాలే శరీరం పైన పధ్నాలుగు చోట్ల బలమైన దెబ్బలు న్నట్టు, దాంతో పాటు ఒంటినిండా బెల్టుతో కొట్టిన వాతలున్నట్టు డాక్టరు ధ్రువీకరిం చారు. రెండు రిపోర్టులు భిన్నంగా ఉండటం వల్ల కేసుని కూలంకషంగా పరి శోధించి రిపోర్టు ఇవ్వవలసిందిగా సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ని నియమించారు.

చంద్రసేన అదృష్టం కొద్దీ అలా నియమించిన ఇన్‌స్పెక్టర్ నిజాయితీ పరుడు కావడంతో నిజాలు బైటికొచ్చాయి. అతడి పరిశోధనలో ఏం తేలిందంటే కాలేని పోలీసుస్టేషన్‌కి తీసుకెళ్లిన రోజు ఎస్సైతో పాటు ఇద్దరు కానిస్టేబుళ్ళు అతన్ని లాఠీలతో కుళ్ళబొడిచారు. బెల్టు లతో చావగొట్టారు. తల మీద కూడా లాఠీ దెబ్బలు తగలడం వల్ల కాలే అదే రోజు రాత్రి చనిపోయాడు.

ప్రభుత్వం వెంటనే స్పందించి సదరు ఎస్సైని, ఇద్దరు కానిస్టేబుళ్ళని సస్పెండ్ చేసింది. చంద్రసేనకు నష్టపరిహారం ఇవ్వాల్సిందిగా ఆదేశించింది.

ఇది జరిగి ఐదు సంవత్సరాలు కావ స్తున్నా నష్టపరిహారం డబ్బు చంద్రసేనకు ఇప్పటికీ అందలేదు. కాలే చావుకి బాధ్యు

లైన ఉద్యోగులకు శిక్షలేమీ పడలేదు. ఈ రెండింటినీ సాధించడం కోసం చంద్రసేన నిద్రాహారాలు మాని కోర్టుల చుట్టూ ప్రదక్షిణలు చేస్తూనే ఉంది.

★ ★ ★

మరునాడు కాలేజీలో చివరి పీరియడ్ లేనందువల్ల సాయంత్రం నాల్గింటికే క్లాసు లైపోయాయి. కొఠారి మాస్టారు తన స్కూటర్ మీద శ్రద్ధని కూచోబెట్టుకుని జూకి పిల్చుకెళ్ళాడు. జూ ఆవరణలో నడుస్తూ "ఇక్కడికెందుకు పిల్చుకొచ్చారు మాస్టారూ? " అని అడిగింది శ్రద్ధ.

"నువ్వు చేయాల్సిన రెండోపని ఏమిటో వివరంగా చెప్పాలంటే ఇదే సరైన ప్రదేశం"

"జూనా..? ఇక్కడ జంతువులు కదా ఉంటాయి! నేను చేసే పనేముంటుంది? "

"ఉంది! జంతువుల్ని రక్షించడం. ముఖ్యంగా పులుల్ని రక్షించడం!"

"పులుల్ని రక్షించే విషయంలో నేనేం చేయగలను మాస్టారూ? "

"నువ్వే చేయగలవు! తల్చుకుంటే చాలా చేయగలవు!" అంటూ ఓ భవనంలోకి ప్రవేశించాడు. అతడి వెనకే లోపలికెళ్ళింది శ్రద్ధ మెల్లిగా నడుచుకుంటూ.

"ఇక్కడ గాయపడిన జంతువులకు చికిత్సచేస్తారు. ముఖ్యంగా మాన్ ఈటర్‌గా మారి పట్టుబడిన పులులకుండే శారీరక బాధల్ని నివారించే ప్రయత్నం చేస్తారు. వాటితోపాటు పోచర్లవల్ల గాయాలపాలై మృత్యువు నుంచి తప్పించుకున్న పులులకు కూడా వైద్యమందించి, ఆరోగ్యం కుదుటపడ్డాక మళ్ళా అడవిలో వదిలేస్తారు" అన్నాడు కొఠారి మాస్టారు.

శ్రద్ధకు వెంటనే జ్ఞానోదయమైంది. పర్ధితెగవాళ్ళే పోచర్లుగా మారి పులుల్ని చంపుతుంటారు కాబట్టి, దానికి సంబంధించిన పనేదో తనకు చెప్పడానికే మాస్టారు పిల్చుకొచ్చారని. కానీ ఆమెకో విషయం అర్థం కాలేదు. ఆ విషయాలు చెప్పడానికి జూకెందుకు పిల్చుకు రావాలి? క్లాస్

## చతురలో ఇది నా తొలి నవల



### సలీం

ఒంగోలు దగ్గర త్రోవగుంట మా స్వగ్రామం. ఆంధ్రా యూనివర్శిటీలో యం. యస్సీ (టెక్) చేశాను. ఆదాయపు పన్ను శాఖలో ఉద్యోగం. ప్రస్తుతం నాగపూర్‌లో నివాసం. 170కి పైగా కథలు రాశాను. అవి ఎనిమిది సంపుటాలుగా వెలువడ్డాయి. మూడు కవితా సంపుటాలు వెలువరించాను. పది నవలలు రాశాను. 'కాలుతున్న పూల తోట' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. 'అనూహ్య పెళ్లి' నవల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక శాఖ నిర్వహించిన పోటీలో బహుమతి పొందింది. 'అనామిక డైరీ' నవల కూడా మరో పోటీలో ప్రథమ బహుమతి గెలుచుకుంది. పలు కథలు, నవలలూ హిందీ, ఇంగ్లీషు, కన్నడ, మలయాళం, ఒరి యా, మరాఠీ భాషలలోకి అనువదితమయ్యాయి. మానవత్వాన్ని ప్రతిబింబించే కథలు రాయడమన్నా, చదవడమన్నా ఇష్టం. చతురలో నా నవల చూసుకోవాలన్న కోరిక ఇన్నాళ్లకు తీరింది. 'అరణ్యపర్వం' నవలలో మరా ఠా ప్రాంతానికి చెందిన పర్ధితెగల జీవన విధా నాన్ని చర్చించాను. పులికీ మనిషికీ మధ్య సంఘర్షణని చిత్రించిన ఈ నవల పాఠకుల మన్ననలు అందుకుంటుందని ఆశిస్తున్నాను.


**చిరునామా :**
సయ్యద్ సలీం,
రూమ్‌నెంబర్ 206, ఆయకార్ భవన్,
సివిల్ లైన్స్, నాగపూర్-440001

రూంలో చెప్పినా తనకు తెలిసేవిగా.

ఆమెకొచ్చిన అనుమానాన్ని నివృత్తి చేస్తూ "పోచర్ల బారిన పడి తప్పించుకున్న ఓ పులిని రెండ్రోజుల క్రితమే జూకి అప్ప గించారు. దాన్ని చూపించడానికే నిన్ను పిల్చుకొచ్చాను" అన్నాడు కొఠారి.

అక్కడున్న సిబ్బందితో మాట్లాడి ఓ షెడ్‌లోకి పిల్చుకెళ్ళాడు. అక్కడ బోన్లలో రకరకాల జంతువులున్నాయి.. కొన్ని గాయపడి, మరికొన్ని రోగాల బారిన పడి. కొఠారికి సాయంగా వచ్చిన సిబ్బంది ఒక తను వాళ్ళని ఓ బోను దగ్గరకు తీసుకె ళ్ళాడు. దానిలో ఓ పులి అతి దయనీ యంగా పడుకుని ఉంది.

"శ్రద్ధా! ఈ పులికి ఎన్ని గాయాలు న్నాయో జాగ్రత్తగా పరిశీలించు" అన్నాడు కొఠారి.

దాని కుడికాలి తొడ దగ్గర కట్టుకట్టి ఉంది. దాన్నుంచి రక్తం కారుతోంది. పక్క టెముకల దగ్గర కూడా గాయముంది.

"ఈ పులిని పోచర్లు లోకల్‌గా తయా రుచేసిన ఇనుపట్రాప్‌తో బంధించారు. ఇది దాని మీద కాలు మోపగానే ట్రాప్ యాక్టివేటయి కుడికాలిని తొడదగ్గర గట్టిగా పట్టేసింది. వెంటనే పోచర్లు సన్నటి ఇనుప పూచలతో దీని మీద దాడి చేశారు. పక్కటెముకల దగ్గర కన్పిస్తున్న గాయాన్ని గమనించావా? అది పొరపాటున చేసిన గాయం. చర్మానికి ఎన్ని రంధ్రాలు పడితే అంత విలువ తగ్గిపోతుంది. అందుకే పోచర్లు దీని శరీరం మీద గాయాలు కాకుండా జాగ్రత్తపడ్డారు"

"మరి ఎలా చంపుతారు? "

"చెప్తా ఉండు!" అంటూ సాయంగా వచ్చిన సిబ్బందికి సైగచేశాడు.

అతను పొడవుగా ఉన్న ఒక పరికరాన్ని బోను లోపలికి పెట్టి పులి నోరు తెరిచి చూపించాడు. నోరంతా లోపల పచ్చిపుం డులా, ఎర్రగా ఉంది.

"పులిని చంపడానికి పోచర్లు శూలా ల్లాంటి పదునైన ఆయుధాలతో దాని నోట్లో పొడుస్తారు. దాని గొంతులో ఉన్న రక్తనాళాల్ని తెంపేస్తారు. పొడవాటి పూచల్ని గొంతులోపలికి దూర్చి జీర్ణాశ యాన్ని చీలుస్తారు. దీని నోట్లో చూశావా? నాలికని రెండుగా చీలుస్తూ, కింది దవడలోకి లోతుగా గుచ్చుకుని పోయింది"

శ్రద్ధ చెవులు మూసుకుని "ప్లీజ్ మాష్టారు! ఇంక చెప్పకండి! నేను విన్లేను" అంది. అప్పటికే ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నిన్ను ఇక్కడికి పిల్చుకు రావడానికి కారణం పోచర్లు ఎంత క్రూరంగా, ఎంత నిర్దయగా పులుల్ని చంపుతారో కళ్ళారా చూపించడానికే!"

"చూసింది చాలు మాష్టారు! వెళ్ళి పోదాం!" అంది శ్రద్ధ.

కొఠారి అక్కడి సిబ్బందికి ధన్యవాదాలు తెలియజేసి, బైటికి కొంతదూరం నడిచి ఓ చెట్టుకింద వేసి ఉన్న బెంచీ మీద కూచుంటూ "ఓ పది నిముషాలు కూచో! నీతో కొంత మాట్లాడాలి" అన్నాడు.

శ్రద్ధ అతనికి కొంత ఎడంగా కూచుంది.

"అసలు పులుల్ని సంరక్షించాల్సిన అవ సరమేంటో నీకు తెలియాలి. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో మనదేశంలో యాభై వేల పులులుండేవి. ప్రస్తుతం అవి మొన్నటి లెక్కల ప్రకారం 2226 ఉన్నాయి. ఇలా తగ్గిపోవడానికి ముఖ్యకా రణం పోచర్లు. 2013లో నలభై రెండు పులుల్ని పోచర్లు పొట్టన పెట్టుకున్నారు. దానికి ముందు సంవత్సరం ముప్ఫయ్ నాలుగు పులుల్ని చర్మాల కోసం చంపే శారు. వాటి చర్మాలతో, ఎముకల్తో చేసే వ్యాపారం చిన్నాచితకా ఏమీ కాదు. ఏడా దికి మొత్తం ఇరవై బిలియన్ డాలర్ల వ్యాపారం"

"అమెరికా జపాన్‌లాంటి దేశాలు కొంటాయా? "

"కాదు. చాలామటుకు వ్యాపారం చైనా, నేపాల్, టిబెట్ దేశాలతోనే జరుగుతోంది. చైనాలో మందుల్ని తయారుచేయడంలో పులుల ఎముకల్ని వాడతారు. చివరికి పులుల విసర్జకాల్ని కూడా మందుల్లో వాడ తారు. వాటి ఎముకల్తో ఓ రకమైన వైన్ తయారుచేస్తారు. దీన్ని సేవించడం వల్ల పులికున్నంత బలంతో పాటు మగతనం పెరుగుతుందన్న నమ్మకం వల్ల వేలంవె ర్రిగా కొంటారు. అందుకే పులిచర్మం, దాని ఎముకలు, మాంసం బైటి మార్కెట్లో కొన్ని లక్షలరూపాయిల ధర పలుకుతుందంటే నమ్ముతావా? పది పదిహేను లక్షలదాకా పలకవచ్చు. అమ్మకం, కొనుగోళ్ళు డాల ర్లలో జరుగుతాయి కాబట్టి పాతిక లక్షలు పలికినా ఆశ్చర్యం లేదు"

"పాతిక లక్షలా? " శ్రద్ధ ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టింది.

"కానీ పోచర్లు అదే మీ పర్ధితెగవాళ్లకు వాళ్లు విదిలించే డబ్బులెంతో తెలుసా? మహా అయితే యాభైవేలు. అది ఐదారు గురు పంచుకుంటే ఒకొక్కరికి వచ్చేది పది వేల కంటే. తక్కువే. ఆ కాసిని డబ్బుల కోసం మీ తెగవాళ్లు పులుల్ని నిర్దాక్షిణ్యంగా చంపుతున్నారు. ఇదెంత వరకు న్యాయం? నువ్వా తెగకు సంబంధించిన దానివి కాబట్టి దీన్ని ఆపగల సత్తా నీకుందన్న నమ్మకంతో చెప్తున్నాను. నువ్వు చేయాల్సిన రెండోపని ఇదే. మీ తెగవా ళ్ళకు నచ్చజెప్పి పులుల్ని వేటాడే పనిని మాన్పించు. పులులకూ పర్యావరణానికి మహోపకారం చేసిన దానివవుతావు"

"నేనా మాష్టారూ? నేను చెప్తే మావాళ్ళు వింటారా? "

"తప్పకుండా వింటారు. నువ్వు చదువు కుంటున్న దానివి కాబట్టి నీ మాటకు విలు వుంటుంది. ఒక్కో పోచరు వల్ల ఎంత నష్టమో నీకు అర్థం కావడానికి ఓ ఉదాహ రణ చెప్తాను. 'సంసార్ చంద్' అని ఓ పేరుమోసిన పోచరు ఉండేవాడు. అతన్ని 'ఉత్తరదేశపు వీరప్పన్' అని పిలిచేవారు. అతని వ్యాపారమంతా ఢిల్లీలోని సదర్ బజారు నుంచే జరిగేది. అతను పోలీసు లకి పట్టుబడకుండా నలభై సంవత్సరాలు వ్యాపారాన్ని నిరాటంకంగా సాగించాడు, తన హయాంలో నేపాల్, టిబెట్ దేశా ల్లోని కేవలం నలుగురు కస్టమర్లకు 470 పులి చర్మాల్ని అమ్మాడంటేనే పోచర్ల వల్ల జరుగుతున్న నష్ట తీవ్రత ఎంతో నీకు అర్థ మవుతుంది"

శ్రద్ధకు తన నాన్న చంపిన పులుల సంఖ్య గుర్తొచ్చి ఒళ్ళు జలదరించింది. దాన్ని పైకి కన్పించనీయకుండా జాగ్రత్త పడ్తూ "మరి ప్రభుత్వం వాళ్ళనేమీ చేయదా? " అని అడిగింది.

"ఇప్పటివరకూ దొరికిన గణాంకాల ప్రకారం పోచర్లలో కేవలం నాలుగు శాతం మందే పట్టుబడ్డారు. వాళ్ళు కూడా కొన్ని రోజులు జైళ్ళలో గడిపి బెయిళ్ళ మీద బైట పడ్తున్నవాళ్ళే. ఎటొచ్చీ ఈమధ్య కాలంలో రాష్ట్ర ప్రభుత్వాలు పోచర్లని నిరోధించడా నికి కఠినమైన చర్యలు చేపడ్తున్నాయి. మహారాష్ట్ర ప్రభుత్వం పోచర్లని అనుమా నమొస్తే చాలు వాళ్ళని కాల్చి చంపేసే అధికారాన్ని ఫారెస్టు రేంజర్లకు కట్టబెడ్తూ

## కొత్తగాలి...

**ప్రతి వాన చినుకును**
**ప్రాణమోలె జూద్దాం!**
**పూడిక తీసిన చెర్వుల్లో**
**ధనమోలె దాద్దాం!!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

2012లో చట్టం చేసింది. అయినా పోచర్లు అటవీ సిబ్బంది ద్వారా రేంజర్ల కదలికల్ని తెలుసుకుంటూ పులుల్ని చంపుతూనే ఉన్నారు. ఈ పులుల్ని రక్షించడానికి 1973లో ప్రారంభించిన 'ప్రొటెక్ట్ టైగర్ స్కీం' కింద ప్రభుత్వం ఎంత ఖర్చు చేసిందో తెలుసా? నాలుగు వందల మిలియన్ డాలర్లు!"

శ్రద్ధకు గణాంకాల మీదికి మనసు పోలేదు. కన్పిస్తే కాల్చేసే ఉత్తర్వుల గురించి వినగానే చప్పున భయమేసింది. ఇన్నాళ్ళూ ఒకవేళ తన నాన్న పట్టుబడితే జైల్లో వేస్తారనుకుంది తప్ప, ఇలా కాల్చి చంపేస్తారన్న విషయం మాష్టారు చెప్పేవరకు తెలియలేదు. 'నాన్న ఈసారి అడవిలోకెళ్ళినపుడు ఏ రేంజరో కాల్చి చంపేస్తేనో' - అన్న ఆలోచన రాగానే ఆమె భయంతో చిగురుటాకులా వణికిపోయింది. ఎట్లాగయినాసరే నాన్నని మళ్ళా అడవిలోకెళ్ళకుండా ఆపాలని నిర్ణయించుకుంది. మరి ఇల్లు గడిచేదెట్లా? అన్న అనుమానమొచ్చి అదే విషయాన్ని ప్రస్తావిస్తూ "మీరు మా తెగవాళ్ళని పోచర్లుగా పనిచేయకుండా ఆపమన్నారు కదా సార్! వాళ్ళకు చదువులేదు కదా! తెల్సిన విద్య అదొక్కటే. ఆ పని మానేసి మేం ఎట్లా బతకాలని అడిగితే నేనేం సమాధానం చెప్పగలను? " అని అంది.

"నీ ఈ ప్రశ్న కోసమే ఎదురుచూస్తున్నానమ్మా. నేను 'వైల్డ్ లైఫ్ ట్రస్ట్' అనే స్వచ్ఛంద సంస్థని నడుపుతున్నానని నీకు తెలుసు కదా!"

తెలుసన్నట్టు తల వూపింది శ్రద్ధ.

"మా సంస్థ 'వైల్డ్ లైఫ్ ప్రొటెక్షన్ సొసైటీ ఆఫ్ ఇండియా' అనే మరో స్వచ్ఛంద సంస్థకు అనుబంధంగా పన్చేస్తోంది. దాన్ని 'బెలిందా రైట్' అనే ఆవిడ స్థాపించింది. ఆమె మొదట్లో సినిమాలు నిర్మించేది. ఆమె నిర్మించిన డాక్యుమెంటరీ 'ల్యాండ్ ఆఫ్ ది టైగర్'కి ఎమ్మీ అవార్డు వచ్చింది. ప్రపంచంలో ఉన్న పులుల్లో డెబ్బయ్ శాతం పులులకు ఆవాసమైన మనదేశంలో పోచర్ల వల్ల పులుల సంఖ్య తగ్గిపోవడం చూసి, బాధ పడి, పులుల్ని.. వాటితో పాటు పోచర్ల వల్ల అంతరించిపోతున్న ఏనుగుల్ని, ఖడ్గమృగాల్ని రక్షించాలనే సదుద్దేశంతో ఆమె ఈ సంస్థని ప్రారంభించింది. ఇక మా సంస్థ విషయానికొస్తే దీన్లో చాలామంది కార్యకర్తలు పని చేస్తున్నారు. ఎక్కువ మంది స్వచ్ఛందంగా పర్యావరణ ప్రేమికులు కాబట్టో, జంతుప్రేమికులు కాబట్టో ఏమీ ఆశించకుండా పన్చేస్తున్నవాళ్ళే. కొంతమందిని మాత్రం మేం జీతమిచ్చి పెట్టుకుంటాం. మీ పర్ధితెగ వాళ్ళు పోచింగ్ మానేసే పక్షంలో మా సంస్థలో వాళ్ళకి ఉద్యోగాలిస్తాను సరేనా!" అన్నాడు కొఠారి.

శ్రద్ధకి ఆ ఆలోచన బాగా నచ్చింది. నాన్నకా ఉద్యోగం వస్తే నెలనెలా కొంత జీతమొస్తుంది. దాంతో గౌరవంగా బతకొచ్చు. అప్పుడు రేంజర్లు కాల్చేస్తారేమోనన్న భయం కానీ, పోలీసులు పట్టుకెళ్ళే అవకాశం కానీ ఉండదు. ఎటొచ్చీ వాళ్ళేవిధంగా సంస్థకు ఉపయోగపడ్తారో ఆమెకు అర్థం కాలేదు.

ఆ విషయాన్ని వివరిస్తూ కొఠారి "మీ తెగవాళ్ళ గురించి నీకెంత తెలుసో నాకు తెలియదు. వాళ్ళకు అడవితో ఉన్న పరిచయాన్ని, అడవి జంతువులకు సంబంధించిన జ్ఞానాన్ని, పాద ముద్రల్ని బట్టి జంతువుల కదలికలు గుర్తించడంలో వాళ్ళకున్న ట్రాకింగ్ నైపుణ్యాన్ని పూర్వ కాలంలో రాజులు బాగా ఉపయోగించుకునేవారు. రాజులు వేటకెళ్ళేటపుడు పర్ధితెగవాళ్లని కూడా తీసుకెళ్ళేవారు. ఆ రోజుల్లో రాజులు ఆసియా జాతికి చెందిన చిరుత పులుల్ని పెంచుకునేవారు. ఆ చిరుతలకు ట్రయినింగ్ ఇచ్చే పని కూడా మీ తెగవాళ్ళే

నిర్వహించేవారు. బ్రిటీష్‌దొరల కాలంలో కూడా వేట సమయంలో దొరలకు సాయంగా పర్దితెగమగవాళ్ళు వెళ్ళేవాళ్ళు. ఇదే నైపుణ్యాన్ని వాడుకుని మేమిపుడు పులుల్ని సంరక్షించే పనులు చేపడ్తున్నాం"

పులుల్ని చంపడానికి ఉపయోగపడిన నైపుణ్యం వాటిని రక్షించడానికి ఎలా ఉపయోగపడ్తుందో ఆమెకు అర్థమయ్యేలా చెప్పాడు కొఠారి. "గాయపడిన పులిని ట్రాక్ చేసి, అవసరమైన వైద్యసాయం అందించి దాన్ని కాపాడొచ్చు. పులి మాన్ ఈటర్‌గా మారినపుడు దాన్ని పట్టుకోడానికి సాయపడటం ద్వారా ప్రజలు పులి బారిన పడకుండా రక్షించవచ్చు. పోచర్ల కదలికలు, వాళ్ళ వ్యాపార లావాదేవీల గురించి వీళ్ళకు అవగాహన ఉంటుంది. కాబట్టి ఆ సమాచారాన్ని అటవీశాఖకు అందజేసి పోచింగ్ జరక్కుండా నిరోధించవచ్చు. అటువంటి సీక్రెట్ సమాచారాన్ని మాకందజేసినం



దుకు మేమావ్యక్తికి నగదు బహుమతి కూడా ఇస్తాం. అలా పోచర్లని పట్టివ్వడం ద్వారా పులులకే కాదు, దేశానికి కూడా ఉపకారం చేసిన వాళ్ళవుతారు"

ఆమె జూ నుంచి ఇంటికి తిరిగి వెళ్ళేప్ప టికి ఓ కృతనిశ్చయానికి వచ్చేసింది. మొదట నాన్నని అడవికెళ్ళకుండా, పులుల్ని వేటాడకుండా ఆపాలి. ఆ తర్వాత తమ తెగలోని మిగతావాళ్ళని మార్చడా నికి ప్రయత్నించాలి.

★ ★ ★

సంజయ్ కొఠారి మాష్టారు శ్రద్ధని జూకి పిల్చుకెళ్ళి నెలదాటింది. ఆ రోజు ఆది

కొత్తగాలి...

**డబ్బుల్లేని**
**చదువులు నాడు**
**డబ్బుల్తోనే**
**చదువులు నేడు**

– వంగీపురం కృష్ణ,
రాయచోటి, కడప జిల్లా

వారం. తమ తెగలోని పిల్లలకు చదువు చెప్పే విషయం గురించి ఎలా ప్రస్తావిం చాలా అని ఆలోచించింది శ్రద్ధ. మొదటే స్కూల్ కెళ్ళి చదువుకోమంటే అందరూ వెళ్ళం అని చెప్పే అవకాశమే ఎక్కువ. అందుకే వాళ్ళకు చదువు ప్రాముఖ్యాన్ని అర్థమయ్యేవరకు ఆదివారాలు తనే వాళ్ళకి పాఠాలు చెప్పాలని నిర్ణయించుకుంది. మొదట నలుగురైదుగురితో ప్రారంభిస్తే, ఆ తర్వాత మిగతా పిల్లలందరూ వాళ్ళకు వాళ్ళే వచ్చి చేరిపోయే అవకాశముం టుంది. ఎటొచ్చీ మొదట ఆ నలుగురైదు గురిని ఎలా పట్టుకోవాలా అనేది సమస్య. వీళ్ళను ఆకర్షించడానికి ముందుగానే మరా



ఠీలో బొమ్మల కథల పుస్తకాలు ఓ అరడ జను కొని పెట్టుకుంది.

అప్పుడే ప్రతాప్ యింటిముందు నుంచి వెళ్తూ కన్పించాడు. వాడు శ్రద్ధకు బాబాయి కొడుకు. వయసు పదమూడే ళ్ళుంటుంది. చేతిలో కొడవలి, ఎడం భుజం మీద తాడు..

"ఒరేయ్ ప్రతాప్! ఇటు రారా!" అని పిలిచింది.

"ఏంటి దీదీ? " అంటూ దగ్గరకొచ్చాడు.

"ఎక్కడికెళ్తున్నావు? "

"అడవికి దీదీ. పొయ్యిలోకి కట్టెలు తేవ డానికి వెళ్తున్నా"

"రేపైనా వెళ్ళొచ్చులేరా! నేను నీకు చదువు చెప్తాను. నేర్చుకుంటావా? "

వాడు బుర్రగోక్కుని "సదువా..! నాకెం దుకు దీదీ? " అన్నాడు.

"చదువెందుకంటావేమిట్రా? చదువు కుంటే బోలెడు విషయాలు తెలుస్తాయి. బాగా చదువుకుంటే మంచి ఉద్యోగం వస్తుంది. దొరబాబులా ఉండొచ్చు"

"నాకు సదువు రాదులే దీదీ" నవ్వుతూ అన్నాడు.

"ఎందుకు రాదు? చదువుకోవాలన్న కోరిక బలంగా ఉంటే, ఏదైనా వస్తుంది"

"మా అయ్యకు సదువు లేదు. మీ అయ్యకు సదువు లేదు. మన సుట్టాల్లో ఎవ్వరికీ సదువు లేదు. మరి నాకెలా వచ్చుద్ది సెప్పు? "

"నాకు రాలేదా? నేను చదువుకుంటు న్నాగా? "

"నీ ఇసయం ఏర్లే దీదీ. మన సుట్టాల్లో అందరూ అనుకుంటారుగా.. సరస్వతీ అమ్మవారే నీలా పుట్టిందని"

శ్రద్ధకు ఏం చెప్పాలో అర్థం కాలేదు. మరో కోణంలోంచి నరుక్కొద్దామని "కొద్దిగా చదువుకున్నా చాలు. రాయడం, చదవడం వస్తే చాలు. దానివల్ల చాలా లాభాలున్నాయి"

"ఏం లాభాలు దీదీ? "

తన దగ్గరున్న కథల పుస్తకాలు తీసి చూపిస్తూ "ఇందులో ఎంతెంత మంచి కథ లున్నాయో తెలుసా? చదువొస్తే వీటిని నువ్వే చదువుకోవచ్చు"

"నీకు సదువొచ్చుగా దీదీ. నువ్వు సదివి మా అందరికీ ఆ కతలేంటో సెప్తే సాలుగా. దానికి మల్లా నేనెందుకు సదువుకోటం? "

శ్రద్ధ సమాధానం కోసం తడుముకుంది. "అలా కాదురా! నీకు నువ్వు చదువుకుంటే ఆ మజానే వేరు"

"నాకొద్దులే దీదీ. ఇప్పటికే ఆలీసెమైంది. కట్టెలు తేలేదనుకో.. అమ్మ వాతలు తేలేలా కొడ్తుంది. నేను అడివికి పోతున్నా" అంటూ వాడు వేగంగా అడవి వైపుకి కదిలాడు. వెనక నుంచి శ్రద్ధ పిలుస్తున్నా విన్పించుకోకుండా పరుగు లంకించుకున్నాడు.

శ్రద్ధ తలపట్టుకుని కూచుంది. ఆమెకీ విషయంలో ఓటమి ఇష్టంలేదు. ఎలాగైనా తను అనుకున్నది సాధించాలనుకుంది.

బాబాయి కూతుళ్లు ఇద్దరున్నారు. పెద్దమ్మాయికి పదేళ్ళు, చిన్నదానికి ఎనిమిదేళ్ళు. వాళ్ళేం చేస్తున్నారోనని చూసింది. ఇద్దరూ ఆరుబయట తొక్కుడు బిళ్ళ ఆడుతున్నారు. వాళ్ళని పిల్చుకొచ్చి తన దగ్గర కూచోబెట్టుకుంది. చిన్నపిల్లలు కాబట్టి 'మీకు చదువుకోవటం ఇష్టమా? ' అని అడక్కుండా నేరుగా చదువు చెప్పటంలోకి వెళ్ళిపోతే కిక్కురుమనకుండా వింటారని ఆమె ఆలోచన..

"మీ ఇద్దరికీ మరాఠీ నేర్పుతాను కూచోండే" అంది, వాళ్ళిద్దరికీ తను ముందుగానే కొని పెట్టుకున్న పలకా బలపాలు ఇస్తూ.

వాళ్ళిద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకొని శ్రద్ధవైపు భయంగా చూశారు.

"నేను పలక మీద రాసిస్తా! దిద్దుతూ నేను చెప్పినట్టు చెప్పండి. అ ఆ ఇ ఈ" అంటూ అక్షరాలు రాసి వాళ్ళ చేతులకు పలకలిచ్చింది.

వాళ్ళిద్దరూ నోరెళ్ళబెట్టి శ్రద్ధవైపు చూస్తున్నారు తప్ప పలక మీద బలపం మోపడంలేదు.

"దిద్దండే! అక్షరాలు నోటితో చెబుతూ దిద్దండి.. అ ఆ ఇ ఈ"

"మేం వెళ్ళి ఆడుకుంటాం దీదీ" అంది పెద్దపిల్ల.

"ఏం ఆటలవి? దేనికి పనికొస్తాయి? నోర్మూసుకుని చెప్పినట్టు చేయండి" గద్దిస్తూ అంది.

చిన్నపిల్ల ఏడుపు లంకించుకుంది.

దాని ఏడుపు చూసి మొదట శ్రద్ధ కంగారు పడినా తమాయించుకుని "మీరు ఈ అక్షరాలు దిద్దితే నేను కూడా మీతో ఆడతాను. తొక్కుడు బిళ్ళే కాదు.. మీకు కొత్తకొత్త ఆటలు నేర్పుతాను. చాలా బావుంటాయి తెలుసా" అంది.

పిల్లలిద్దరూ ఆ గాలానికి తగులుకున్నారు. "నిజంగానా దీదీ? " అంది పెద్ద పిల్ల.

"నీ మీదొట్టు" అంది శ్రద్ధ, ఆ పిల్ల నెత్తి మీద చేయి పెడ్తూ.

"హాయ్..! బలేబలే! దీదీ మాతోపాటు ఆడుతుంది" అంది చిన్నపిల్ల చప్పట్లు కొడ్తూ.

ఎప్పుడు చూసినా చదువుకుంటూ ఉండే దీదీ- తమతో కలిసి ఆడుతుందనగానే పిల్లలిద్దరూ ఎంతో సంబరపడ్డారు. పలక తీసుకుని 'అ ఆ..' అంటూ అక్షరాల్ని దిద్దారు. ఇది తన మొదటి విజయం అనుకుంది శ్రద్ధ.

వాళ్ళకు మాటిచ్చినట్టే కొద్దిసేపు శ్రద్ధ వాళ్ళతో కలిసి ఆడింది.

"మాతో కూడా ఆడవా దీదీ" అని అడిగిన పిల్లల్తో "మీరు ఆదివారం నాడు నాదగ్గరకొచ్చి అక్షరాలు దిద్దుతానంటే మీతో కూడా ఆడ్తాను" అంది.

బాబాయి పిల్లలతో ఆడి, తమతో ఆడక పోతే అవమానంగా భావించి మిగతా పిల్లలు కూడా "సరే దీదీ" అన్నారు.

మరో ఆదివారం వచ్చేప్పటికి శ్రద్ధ విద్యార్థులు ఆరుగురయ్యారు. వాళ్ళకు చదువులో ఆసక్తి కలగడం కోసం మంచి మంచి కథలు చెప్పేది.. రాజుల కథలు, మంత్రగత్తెలు, మాయలు మంత్రాలూ. పిల్లలందరూ ఆదివారం కోసం ఎదురుచూసేవారు. నెల తిరిగేసరికి శ్రద్ధ పిల్లలకు మంచి మంచి విషయాలు నేర్పుతుందన్న విషయం తమ తెగలో అందరికీ తెలిసి పోయింది. ఆదివారం రావడం ఆలస్యం 'అలా పిచ్చి పిచ్చి ఆటలు ఆడుకోకపోతే శ్రద్ధాదీదీ దగ్గరకెళ్ళి నాలుగు అక్షరాలతో పాటున కాసిని మంచి మాటలు నేర్చుకోవచ్చుగా' అని పెద్దలు పిల్లల్ని మందలించడం మొదలయింది.

శ్రద్ధ మరిన్ని పలకలు కొంది. తన చదువులో ఒక్కరోజు పిల్లల కోసం త్యాగం చేసి, ఆదివారాల్ని పూర్తిగా వాళ్ళకు పాఠాలు చెప్పడానికే కేటాయించింది. తమ తెగలోని దాదాపు సగంమంది పిల్లలు తన దగ్గర కూచుని అక్షరాలు దిద్దుతూ ఉండటంతో తను చేయాలనుకున్న మొదటిపనిలో ప్రథమాంకాన్ని విజయవంతంగా పూర్తిచేశానని మురిసిపోయింది శ్రద్ధ.

ఇక రెండోపనిలో మొదటి అంకం నాన్నని అడవికెళ్ళకుండా ఆపడం. రెండో అంకం తమ తెగలోని మిగతా మగవాళ్ళని పోచర్లుగా పని చేయకుండా నిరోధించడం. సందర్భం లేకుండా ఈ విషయాన్ని నాన్నతో చర్చించే బదులు, సరైన సమయం ఆసన్నమయ్యే వరకు ఎదురు చూడాలని నిర్ణయించుకుంది. ఎక్కువ రోజులు ఎదురుచూడాల్సిన అవసరం లేకుండానే తను మాష్టారికి మాటిచ్చిన మూడునెలల తర్వాత ఆ సమయం ఈరోజు రానే వచ్చింది.

★ ★ ★

"నేనంత కాని తప్పు ఏం చేశాను చెప్పు! పులిని వేటాడటం మనం తరతరాలుగా చేస్తున్న పనేగా! ఈ రోజూ అదే చేశాను. ఇందులో నువ్వంత బాధపడే విషయం ఏముందో నాకర్థం కావటం లేదు" అన్నాడు గుంజన్.

"ఆ పులి నిన్నేం చేసింది నాన్నా? నిన్నేమైనా బాధ పెట్టిందా? నీకేమైనా నష్టం కలిగించిందా? దానిపాటికది అడవిలో బతుకుతుంటే నువ్వెళ్ళి చంపడం పాపం కాదా? ఎన్ని పాపాల్ని మూటగట్టుకుంటున్నావో ఆలోచించావా? అది పిల్లల తల్లి. దాన్ని చంపటానికి నీకు మనసెలా ఒప్పింది? ఇపుడా పిల్లల గతేంటి? వాటి ఆలనాపాలనా ఎవరు చూసుకుంటారు? అడవిలోని మిగతా క్రూర జంతువులు వాటిని పొట్టన పెట్టుకోవా? వాటికి రక్షణ ఎవరు కలిగిస్తారు? నువ్వీ విషయాల గురించి ఒక్కక్షణం ఆలోచించి ఉన్నా ఆడ పులిని చంపేవాడివి కాదు" అంది.

"తప్పకుండా చంపి ఉండేవాడిని. అది నా జీవనాధారం. మనం తినే తిండి, కట్టుకున్న యిల్లు, నీ చదువూ- అంతా దానివల్లనే. నేను దాని పిల్లల మీద జాలిపడితే నా పిల్లల గతేంటి? ఆకలితో మాడి చావాల్సిందే మనందరం" మెల్లగా నచ్చచెప్తున్న ధోరణిలో అన్నాడు.

"అటువంటి సంపాదనతో చదువు చెప్పించేట్టయితే నాకీ చదువు వద్దు నాన్నా. ఈ ఇల్లూ వద్దు. గుడిసెలో ఉందాం. ఆ పని చేయనంత మాత్రాన ఆకలితో మాడి చావాల్సిన అవసరం లేదు నాన్నా. బతకడానికి చాలా మార్గాలున్నాయి. కూలిపని చేసుకొనైనా గౌరవంగా బతకొచ్చు. ఈ పులుల్ని చంపి తినే నెత్తుటి కూడు నాకొద్దు. ఈ రోజు నుంచే నేను చదువు మానేస్తున్నాను"

ఆ మాటలకు ఖంగుతిన్నాడు గుంజన్. తమ తెగలో చదువుకుంటున్న ఒకే ఒక వ్యక్తి తన కూతురు శ్రద్ధ. అలా అనుకుంటేే తనకు ఎంత గర్వంగా ఉంటుందో! అలాంటిది శ్రద్ధ చదువు మానేస్తే తన పరువేం కాను? తన కూతురి విషయంతో తనకెన్ని కలలున్నాయో! బాగా చదువుకుని తన కూతురు డాక్టరైతే చూడాలని ఎంత కోరికో! ఇపుడు శ్రద్ధ చదువు మానేస్తే తన కలల సంగతేంగాను?

"వద్దమ్మా! నువ్వు చదువు మానొద్దు! నువ్వలా అంటే తట్టుకోలేను" అన్నాడు.

"అయితే నువ్వు పులుల్ని చంపడం మానేయి"

గుంజన్ కొన్నిక్షణాలు ఆలోచించి చెప్పాడు. "నాకు మరోపని చేతకాదు కదమ్మా! ఏం చేసి నా భార్యాబిడ్డల్ని పోషించుకోవాలో నువ్వే చెప్పు"

"ఇన్నాళ్లూ పులుల్ని చంపావు కదా నాన్నా! ఇకనుంచి పులుల్ని రక్షించే పని చేయి. ఇంతకాలం మూటగట్టుకున్న పాపం కొంతైనా తగ్గుతుంది"

ఆ మాటకు నవ్వాడు.. పడీ పడీ నవ్వాడు.

నాన్న ఎందుకు నవ్వుతున్నాడో అర్థం కాక శ్రద్ధకు ఉక్రోషం వచ్చింది.

"నేనేమీ జోక్ చెప్పలేదే! ఎందుకలా నవ్వుతున్నావు? "

"ఏడ్వలేక నవ్వుతున్నానమ్మా! నేను సంపాదనకు మార్గం చెప్పమంటే నువ్వు పులుల్ని రక్షించే పని చేయమంటున్నావు. దానివల్ల మనకు ఒరిగేదేముంటుంది? "

"ఉంది నాన్నా! మొన్న మా లెక్చరర్ నన్ను పిలిచి మన పర్దీతెగలో మగవాళ్ళు ఇంకా పులుల్ని వేటాడి చంపుతున్నారా? అని అడిగాడు. నేను మౌనంగా ఉండిపోయాను. అడవిలో అనుమానాస్పదంగా కన్పిస్తే కాల్చేయమని ప్రభుత్వ ఉత్తర్వులున్న విషయం మీ వాళ్ళకు తెలుసా? అని అడిగాడు. దానికీ నేనేమీ మాట్లాడలేదు. అప్పుడు చెప్పాడు పులుల్ని సంరక్షించే సంస్థలు చాలా ఉన్నాయని. తను కూడా ఓ సంస్థని నడుపుతున్నాడట! దాని పేరు 'వైల్డ్ లైఫ్ ట్రస్ట్'. పర్దీతెగవాళ్ళకున్న నైపుణ్యాన్ని వాళ్ళ సంస్థ ఉపయోగించుకుంటుందనీ, దానికిగాను నెలకింతని జీతం ఇస్తారని కూడా చెప్పాడు. నేను మా లెక్చరర్‌తో మాట్లాడతాను నాన్నా. నీకు తప్పకుండా ఉద్యోగం దొరుకుతుంది"

"పులుల్ని చంపడానికి పనికొచ్చే మా నైపుణ్యం పులుల్ని రక్షించడానికి ఎలా పనికొస్తుంది? "

"పాదముద్రలు ఏ జంతువుకి సంబంధించినవో? అది ఆడో? మగో? దాని వయసెంతో? కనుగొనే నైపుణ్యం మన పర్దీతెగకున్నట్లు ఇతరులకు లేదు. ఇలాంటి సమాచారం వాళ్ళ కవసరం. పులుల కదలికల్ని పసిగట్టడంలో అది బాగా ఉపయోగపడుతుంది. ఒంటి మీదున్న చారల్ని బట్టి పులుల్ని గుర్తుపట్టడం కూడా ముఖ్యమే. ఎప్పుడైనా పులి మనుషుల్ని చంపడానికి అలవాటు పడ్డప్పుడు దాన్ని వేటాడడానికి మనవాళ్ళ సాయం తప్పకుండా అవసరమవుతుంది"

గుంజన్ రెణ్ణిముషాలు తన కూతురు చెప్పిన విషయాల గురించి ఆలోచించాడు. ఆ సాయంత్రం దళారీ లఖన్ వచ్చి చేతిలో

## కొత్తగాలి...

**ఆకలికి**
**కులం లేదు**
**మతం లేదు**

– టి. లక్ష్మీకుమారి,
మచిలీపట్నం

లక్ష రూపాయలు పెట్టగానే కూతురికిచ్చిన మాటని మర్చిపోయాడు. లక్షరూపా యలు.. ఎవరి దగ్గరో వూడిగం చేస్తే నెల కెంతిస్తారు? అలాంటి ఎన్ని నెలజీతాలు కలిపితే లక్ష రూపాయలవుతాయి? శ్రద్ధ చిన్నపిల్ల! దానికేం తెలుసు డబ్బు సంపా దన ఎంత కష్టమో? మరోబేరం రావడా నికి కనీసం నెలరోజులు పడ్తుంది. అప్ప టికి శ్రద్ధ అన్నీ మర్చిపోతుంది. చిన్నపిల్ల లున్న ఆడపులిని చంపడం వల్ల తన కూతురి మనసుకు బాధ కలిగింది. ఆ పొరపాటు మళ్ళా చేయకూడదు. మగపు లినే చంపాలి. అపుడు శ్రద్ధ అంతగా అభ్యంతర పెట్టదు. ఇలా ఆలోచించాక గుంజన్ కొంత స్థిమిత పడ్డాడు.




**గుం**జన్ మేనత్త కూతురి పెళ్ళి. పద హారేళ్ళ అరుణ కుందనపు బొమ్మలా అలంకరించుకుని కూచుంది. పెళ్ళికొడుకు పద్దెనిమిదేళ్ళ జయరాం చౌహాన్. పసు పుపూసిన తెల్లటి పంచెకట్టు, తలచుట్టూ పాము చుట్టలు చుట్టుకున్నట్టు కట్టిన కాషాయం రంగు తలపాగ, చివర్ల మెలి తిప్పిన గుబురు మీసాలు. తన స్నేహితు లతో కబుర్లాడుతూ మధ్యమధ్యలో మీ సాల మీద కుడిచేతి వేళ్ళుంచి "మాది పృథ్వీరాజ్ చౌహాన్ వంశం! వీరత్వం మా రక్తంలోనే ఉంది" అంటున్నాడు.

పెళ్ళితంతు పూర్తయ్యాక వధూవరుల్ని అగ్నిహోత్రం చుట్టూ తిప్పుతున్నప్పుడు ఓ ఎస్సై ఇద్దరు కానిస్టేబుళ్ళని వెంటేసుకుని వచ్చాడు. పెళ్ళికొడుకు నుద్దేశించి "పోలీస్ స్టేషన్‌కి పద! సర్కిల్ సాబ్ నిన్ను పిల్చుకు రమ్మన్నాడు" అన్నాడు.

అక్కడే ఉన్న గుంజన్ కలుగచేసుకుని "పెళ్ళి ఇప్పుడేగా అయింది. ఒక్కరోజు గడువివ్వండి దొరా! రేపు నేనే దగ్గరుండి పిల్చుకొస్తాను" అన్నాడు.

"ఏం నువ్వేమైనా సత్యహరిశ్చంద్రుడి తమ్ముడివా? నీ మాట ఎందుకు నమ్మాలి? వీడు పారిపోడని గ్యారెంటీ ఏముంది? " అంటూ చౌహాన్‌వైపు తిరిగి "నోర్మూసుకుని మాతో బయల్దేరు. ఇపుడే పెళ్ళయిన కొత్త పెళ్ళికొడుకువని మర్యా దగా స్టేషన్‌కు రమ్మంటున్నాం. లేకపోతే మేం లాఠీలతో చేసే పెళ్ళి ఎలా ఉంటుందో నీకు అర్థమయ్యేది" అన్నాడు ఒక కానిస్టేబుల్.

'నాకు నువ్వే దిక్కు' అన్నట్టు గుంజన కేసి చూశాడు చౌహాన్.

గుంజన్‌కి ఏంచేయాలో అర్థం కావడం లేదు. పర్ధితెగలో కొత్తగా పెళ్ళయిన యువకుల్ని పోలీసులు ఏదో ఒక నేరం మోపి స్టేషన్‌కి లాక్కెళ్ళడం మామూలే. కానీ ఇప్పుడు లాక్కెళ్ళబోతోంది తన మేనత్త కూతురి మొగుడ్ని. ఇందులో చౌహాన్ పరువూ మర్యాదే కాదు, తనదీ ఉంది - అనుకోగానే ఒక్కసారిగా విషాదం అతని మనసుని కమ్మేసింది. పర్ధితెగలో పుట్టాక పరువా? మర్యాదా? సమాజమే కాదు పోలీసులు కూడా తమని పేడపురు గుల కన్నా హీనంగా చూస్తారన్న విషయం గుర్తొచ్చింది.

అసలు చౌహాన్ ఏం నేరం చేసి ఉంటాడు? అని ఓ క్షణం ఆలోచించాడు. కోతుల్ని ఆడించి పొట్టపోసుకునే కుర్రాడు. అతని దగ్గర రెండు కోతులున్నాయి. ఒకటి ఆడా, మరొకటి మగా. వాటికి

రంగు రంగుల బట్టలు తొడిగి, వాటితో రకరకాల విన్యాసాలు చేయిస్తాడు. మొగుడు కొడితే పెళ్ళాం అలిగి పుట్టింటికి పోవడం, మొగుడికి వంట చేసిపెట్టి, ముద్దలు నోటికందించడం లాంటివి వాటితో చేయించి, చూసేవాళ్ళు వేసే చిల్లర డబ్బుల్ని ఏరుకుని బతుకుతు న్నాడు. ఇందులో నేరమేమైనా ఉందా? అని అడుగుదామనుకున్నాడు. వెంటనే అతనికి మరో ఆలోచన వచ్చింది. ఈ పోలీసులు దుర్మార్గులు. కోతుల్ని ఆడించ డమే నేరమనొచ్చు. లేదా ఈ కోతుల్ని నువ్వు దొంగతనం చేసి తెచ్చుకున్నావ నొచ్చు. రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా? ఏమైనా ఫర్లేదని ధైర్యం చేసి "మా వాడు చేసిన నేరమేంటి దొరా?" అని అడిగాడు.

"ఏరా! చెప్తేగాని పంపించవా? నువ్వు వీళ్ళందరికీ లీడర్‌వా? నీకూ వాడికి సంబంధమేమిటి? ఇద్దరూ తోడుదొం గలా? వాటాలు పంచుకుంటుంటారా? నువ్వూ పద స్టేషన్‌కి. నీ యవ్వార మేందో? వాడి యవ్వారమేందో? అక్కడ తేల్చేస్తాం" గుంజన్ మెడ మీద చెయ్యివేసి నెడ్తూ అన్నాడు మరో కానిస్టేబుల్.

ఈలోపల ఎస్సై కలుగజేసుకుని "తన పొలంలోంచి బంగాళాదుంపలు దొంగిలిం చాడని పొలం యజమాని కేసు పెట్టాడు. విచారణకు సర్కిల్ దొర పిల్చుకు రమ్మ న్నాడు. ఇప్పటికైనా వస్తారా? లేక మా కానిస్టేబుళ్ళు చెప్పినట్టు నాలుగు తగిలించ మంటారా?" అంటూ హూంకరించాడు.

చౌహాన్, గుంజన్తో పాటు గుంజన్ మేనత్త, చౌహాన్ వాళ్ళ నాన్నా స్టేషన్‌కి బయల్దేరారు.

దార్లో గుంజన్‌కి మరో అనుమానమొ చ్చింది. బంగాళాదుంపల దొంగతనం కేసుని విచారించడానికి ఎస్సై రావాలా? అదే విషయం కానిస్టేబుల్‌ని అడిగాడు.

"కొత్తపెళ్ళికొడుక్కదా! స్టేషన్‌కి రమ్మం టే అంత సులభంగా వస్తాడా? నీల్గడా? వాడికి మీరందరూ వత్తాసుపలకరా? అం దుకే ఎస్సైగార్ని పిల్చుకొచ్చాం" అన్నాడు.

కానీ గుంజన్‌కి లోపల అనుమానమేదో పీకుతూనే ఉంది. కొత్తగా పెళ్ళయిన కుర్రాళ్ళని ఏదో ఒక నేరం మీద స్టేషన్‌కి పిల్చుకెళ్ళి వాళ్ళని వదిలి పెట్టడానికి ఏం బేరం పెడ్తారో గుంజన్‌కే కాదు పర్దితెగ లోని చాలామందికి అనుభవమే. ఆ ఆలో చన రాగానే గుంజన్ ఒళ్ళు ఒక్కసారిగా జలదరించింది.

స్టేషన్లో కానిస్టేబుళ్ళు లాఠీలతో చౌహా న్ని కుళ్ళబొడిచారు. "ఎకరం పొలంలో పండించిన బంగాళాదుంపల్ని ఏం చేశా వురా? ఎన్ని బస్తాలొచ్చాయి? ఎవరిక మ్మావు? ఎంత డబ్బొచ్చింది? ఆ డబ్బునేం చేశావు? నీ పెళ్ళి ఖర్చులకు వాడుకున్నావా? ఈ బట్టలూ, తలపాగా ఆ డబ్బుల్తోటే కొన్నావా? ఈ విషయా లన్నీ తేలేవరకు నిన్నొదిలేది లేదురోయ్! ఈలోపల మేం కొట్టే దెబ్బలకు నీ ఎము కల్లో సున్నం బైటికి రావాల!" అన్నాడో కానిస్టేబుల్.

గుంజన్ వెళ్ళి ఎస్సై కాళ్ళు పట్టుకుని "ఆడ్ని వదిలేయ్ దొరా! నీ కాల్మొక్త. ఆడి బదులు నన్ను కొట్టు. నన్ను జైల్లో పడేయి. కొత్తగా పెళ్ళయిన కుర్రాడు దొరా! దయచూడు దొరా!" అంటూ వేడు కున్నా ఫలితం లేకపోయింది.

"ఇదేమైనా కోతులాట అనుకున్నవ్రా! వాడి బదులు నిన్ను జైలుకి పంపడానికి? నేరం చేసింది వాడు. శిక్ష కూడా వాడికే" అన్నాడు ఎస్సై.

దెబ్బలకు తాళలేక చౌహాన్ పెడ్తున్న కేకలకి గుంజన్తో పాటు మిగతా ఇద్దరి గుండెలు అవిసిపోతున్నాయి.

చౌహాన్ వాళ్ళ నాన్న గుంజన్తో "పైస లిస్తే వదిలేస్తారేమో కనుక్కో! నీవద్ద ఉన్న

పైసల్తోపాటు నావద్ద ఉన్న పైసలు కూడా కలిపి ఇచ్చేద్దాం. ఈపాటికి శోభనానికి తయారుకావాల్సిన కుర్రాడు. మనమేదో ఒకటి చేసి ఆడ్ని విడిపించక తప్పదు" అన్నాడు.

గుంజన్ చాలా సేపటి నుంచి ఎస్సైకి డబ్బులిచ్చి సమస్యని పరిష్కరిద్దామనే ఆలోచిస్తున్నాడు. తన మేనత్త కూతురి జీవితానికి సంబంధించిన విషయం కాబట్టి చౌహాన్ తరపువాళ్ళు డబ్బులివ్వకున్నా తనొక్కడే ఆ భారాన్ని మోయడానికి సిద్ధంగా ఉన్నాడు. ఎటొచ్చీ వాళ్ళ వాలకం చూస్తే డబ్బులకు వదిలేలా లేరు.

గుంజన్ ఎస్సై వద్దకెళ్ళి "దొరా! ఆడ్ని వదిలేయి దొరా! నీ రుణం ఉంచుకోన్లే.. పైసలిస్తాను" అన్నాడు.

ఎస్సై కోపంతో తాటిచెట్టంత ఎత్తుకి ఎగిరాడు. "మాకు పైసలిచ్చేంత తాహతుం దిరా నీకు? ఎన్ని లక్షలు సంపాయించావే మిటి? దొంగతనాలు చేసేగా సంపాయిం చావు. మొదట నిన్ను బొక్కలో తోసి నాలుగు తగిలిస్తే నిజాలు అవే బైటికొ స్తాయి. ఎవరెవరి యింట్లో ఎంతెంత దొంగిలించావో"

గుంజన్ ఎస్సై కాళ్ళ మీద బోర్లా పడి పోయాడు "నన్ను క్షమించు దొరా! మా కాడ లక్షలు లక్షలు ఎక్కడుంటాయి దొరా? పేదోళ్ళం! ఏదో మా కాడ ఉన్న కాడికిచ్చేసి.."

ఎస్సై శాంతించి "ఇదంతా సర్కిల్ దొర గారి చేతుల్లో ఉంది. సార్ బైటికెళ్ళారు. వారు వచ్చాక వారి కాళ్ళే పట్టుకుంటారో? పైసలే ఇచ్చి విడిపించుకుంటారో? మీ ఇష్టం" అన్నాడు.

సదరు సర్కిల్ దొరగారు మధ్యాహ్నం ఒంటిగంట దాటినా రాలేదు. అందరికీ గుండెతో పాటు కడుపూ కాలుతోంది. చౌహాన్ని వదిలి వెళ్లి నాలుగు మెతుకులు తిని వద్దామంటే భయం. కాలేని కొట్టి చంపేసి, పారిపోతూ చచ్చిపోయాడని చెప్పినట్టు, చౌహాన్ విషయంలో కూడా జరుగుతుందని అందరూ స్టేషన్ బయట ఉగ్గపట్టి కూచున్నారు. సాయంత్రం ఐద యింది. సర్కిల్ జాడ లేదు. గుంజన్ భయపడుతూ లోపలికెళ్లి ఎస్సైతో "పెద్ద దొర ఎపుడొస్తాడయ్యా? " అని అడిగాడు.

"వస్తాడ్రా! వెంటనే రమ్మని ఫోన్‌చేసి చెప్తా! ఇక్కడ నువ్వో లార్డ్‌వి. ఎదురు చూస్తున్నావు కదా! దొరగారు రాకపోతే ఈ దొరగారికి కోపమొస్తుంది కదా!" అంటూ పళ్ళు కొరుకుతూ "నఖరాలు చేయక సార్ వచ్చేవరకు ఎదురుచూడు. లేదా వెళ్ళిపో! అంతేగానీ మధ్యమధ్యలో వచ్చి దొరెప్పుడొస్తాడని అడిగావనుకో.. నాకు చిర్రెత్తుకొస్తుంది. ఆ కోపంలో ఏం చేస్తానో నాకే తెలీదు" అన్నాడు ఎస్సై.

గుంజన్ నిశ్శబ్దంగా బైటికొచ్చేశాడు. ఆకలికి తాళలేకపోతున్నాడు. అతని మేనత్త మాత్రం ఆకలి వూసెత్తకుండా ఏక ధారగా ఏడుస్తూనే ఉంది. ఆమెకు భర్త లేడు. నాలుగేళ్ళ క్రితం అనారోగ్యంతో చనిపోయాడు. అప్పటి నుంచి ముగ్గురు పిల్లల సంసారాన్ని తన కాయకష్టంతో లాక్కొస్తోంది. పెద్దపిల్ల పెళ్ళి సజావుగా జరిగిందని సంతోషపడ్తున్న సమయంలో ఈ ఉపద్రవమేంటో ఆమెకర్థం కావటం లేదు. తనంత నష్ట జాతకురాలు ఉండర నుకుంది. లేకపోతే జ్వరమొచ్చిన మూడో రోజే భర్త చనిపోవటమేంటి? ఎన్నిసార్లు జ్వరాలు రాలేదు! మంచి అల్లుడు దొరికా డని సంబరపడింది కదా! తీరా పెళ్లికాగానే బంగారాదుంపలు దొంగిలించాడని పోలీ సులు పట్టుకురావడమేంటి? అంతా తన ఖర్మ కాకపోతేనూ..

సాయంత్రం ఆరింటికి సర్కిల్ దొర గారు వచ్చారు. ఆరడుగుల ఎత్తుతో, బాన పొట్టతో చిన్నసైజు రాక్షసుడిలా ఉన్నాడు. వయసు యాభైకి దగ్గరగా ఉంటుంది.

సర్కిల్ రావడం చూసి మరోమారు చౌహాన్‌ని లాఠీలతో ఉతికి ఆరేశారు కాని స్టేబుళ్ళు.

గుంజన్ తన మేనత్తతో సహా లోపలి కెళ్ళి సర్కిల్ కాళ్ళ మీద పడ్డాడు.

"వీడి మీద కనికరం చూపించే ప్రశ్నే లేదు. కనీసం మూడు సంవత్సరాలు వీడు జైలు కూడు తినాల్సిందే" అన్నాడు సర్కిల్.

ఏం చేయాలో పాలుపోక మళ్ళా బైటి కొచ్చి నిలబడ్డారు.

ఈ లోపల ఓ కానిస్టేబుల్ చౌహాన్ వాళ్ళ నాన్నని లోపలికి పిలిచాడు. "నువ్వు కుర్రాడి నాన్నవి కాబట్టి నీకు అసలు రహస్యం చెప్తున్నా విను. ఈ సమస్య నుంచి బైటపడటానికి ఒక్కటే మార్గ ముంది. నేను చెప్పాక ఉద్రేకపడకుండా బాగా ఆలోచించుకో! నీ కొడుకు అత్తకి, ఆమెతోపాటు వచ్చిన వాడికి నచ్చచెప్పు. అర్థమైందా? " అన్నాడు.

తన కొడుకు బైటపడటానికి మార్గ ముంది అనగానే ఆ తండ్రి మొహంలో అప్పటివరకూ ఉన్న దుఃఖం తుడుచు పోయి వెలుగు రేకలు కన్పించాయి. "చెప్పు దొరా! నీ కాల్మొక్త! నువ్వేం చెబ్తే అది చేస్తా దొరా! కోడలి తరపు వాళ్ళని ఒప్పించే పని నాకొదిలేయి దొరా!" అన్నాడు సంతోషంగా.

కానిస్టేబుల్ అటూఇటూ చూసి రహస్యం చెబ్తున్నటు చెవిలో చెప్పాడు "పెద్దదొర డబ్బులకు లొంగడు. ఒకవేళ ఆ దొర తీసుకునేవాడైనా అన్ని డబ్బులు మీ దగ్గర ఉండవు. దొరగారికి ఓ బలహీనత ఉంది. ఆడపిల్లల బలహీనత. పదిహేను, పదహారేళ్ళ కన్నెపిల్లలంటే చాలు వాళ్ళకోసం ఏమైనా చేస్తాడు. ఇపుడర్థమైందా? నీ కొడుకుని క్షేమంగా ఇంటికి పిల్చుకెళ్ళాలంటే ఏం చేయాలో? "

అతనికర్థం కాలేదు. వెర్రిమొహంలా పెట్టి "ఇందులో నేను సేసేదేముంది దొరా? " అన్నాడు.

"సరే! నీ ఖర్మ! ఈ రాత్రి నీ కొడుక్కి శోభనం జరగాల్సింది ఉంది కదా! దొర వాడ్ని ఇట్నుంచిటే జైలుకి పంపిస్తాడు. మూడేళ్ళ శిక్ష తర్వాత నీ కొడుకు యింటికి తిరిగొస్తే, అపుడు జరుపుదువుకానీ శోభనం. ఇంకా ఒళ్ళు మండిందనుకో! ఏకంగా ఎన్‌కౌంటర్ చేసేసి వల్లకాటికే పంపిస్తాడు. అప్పుడింక శోభనం కాకుండానే నీ కోడలు విధవరాలవుతుంది. వీటిలో ఏదో ఒకటి కోరుకుంటావో? లేదా నేను చెప్పినట్టు వింటావో? ఆలోచించుకో!"

"నువ్వు చెప్పినట్టే వింటా దొరా! నేనేం చేయాలో సూటిగా చెప్పు"

కానిస్టేబుల్ మరోసారి చుట్టూతా పరికించి మంద్రమైన స్వరంతో అన్నాడు.. "నీ కోడల్ని ఈ రాత్రికి దొరగారి దగ్గరికి పంపించావనుకో! రేపు దర్జాగా నీ కొడుకు శోభనం జరుపుకోవచ్చు"

చౌహాన్ తండ్రి నిశ్చేష్టుడయ్యాడు. అప్పటికీ అతను పెళ్ళికొడుకు తండ్రి కాబట్టి తమాయించుకున్నాడు. అదే పెళ్ళికూతురి తండ్రి అయి ఉంటే గుండె పగిలి అక్కడే చచ్చిపోయి ఉండేవాడు. అతను నడుస్తున్న శవంలా బైటికొచ్చి గుంజన్ ఎదురుగా నిలబడ్డాడు.

"ఏం చెప్పాడా పోలీసాయన? ఎందు

---

## కొత్తగాలి... 

**ముడుపులు దండిగా ఇస్తే**
**ఎక్కడైనా అవుతుంది పని**
**జగత్తులో దాని పేరు 'మని'**
**అందరికీ ఉంటుంది కావాలని**

*– వంగల రంగాచారి,*
చెన్నై

---

కలా ఉన్నావు?" కంగారు పడ్తూ అడి గాడు గుంజన్.

"ఎలా చెప్పాలో తెలీటం లేదు. ఆడేమ డిగాడో వింటే ఆడ్ని అక్కడికక్కడే పొడిచి చంపేయాలనిపిస్తది" అన్నాడతను.

"ఏమడిగాడు?"

"నా కోడల్ని సర్కిల్ వద్దకు పంపిస్తే నా కొడుకుని వదిలేస్తారట. లేకపోతే ఆడ్ని కాల్చి చంపేస్తారట" అతను తన తలపాగాను విప్పదీసి దాన్లో మొహం దాచుకుని ఏడ్చాడు.

ఆ మాట వినగానే గుంజన్ మేనత్త "ఓరి దేవుడో! నేనేం చేతును దేవుడో! నా కూతురికి దిక్కేవరయ్యో!" అంటూ మొదలు నరికిన చెట్టులా అక్కడే కూల బడి శోకాలు మొదలెట్టింది.

**కొత్తగాలి...**

**ఒకరు శుక్లపక్షం**
**వేరొకరు కృష్ణపక్షం**
**ఏదైనా పడక తప్పదు**
**ప్రజలపై చంద్రుని ప్రభావం**

– ముడుంబ సీత,
భద్రాచలం

గుంజన్‌కి సర్రున కోపం ఎగసిపడింది. పులుల తలలు నరికినట్టు అలా అడిగిన పోలీసోడి నాలుకని, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ తలని ఒక్కవేటుతో నరికేయాలన్నంత ఆవేశంతో స్టేషన్ లోపలికి నడిచాడు.

సర్కిల్ గదిలోకి వెళ్ళబోతున్న అతన్ని మధ్యలోనే ఎస్సై ఆపి "ఎక్కడికెళ్తున్నావ్?" అని గద్దించాడు.

ఎస్సై కూచుని ఉన్న కుర్చీ వెనక గోడకి వరసగా బాయ్‌నెట్లు అమర్చిన తుపాకులు నిలబెట్టి ఉన్నాయి. ఎస్సై ముందున్న టేబుల్‌కి కుడిపక్క నల్లటి పిస్టల్ నిగనిగలాడుతూ కన్పించింది. వాటిని చూడగానే అతని పై ప్రాణాలు పైనే పోయాయి.

"ఎందుకొచ్చావు లోపలికి?" మరోసారి గద్దించాడు ఎస్సై.

అతని కళ్ళు కోపంతో ఎర్రబడటం గమనించాడు గుంజన్. తనని పిట్టని కాల్చినట్టు కాల్చేసి, సర్కిల్ మీద దాడి చేయబోతుంటే చంపేశాననే రకంలా కన్పించి, ఒకడుగు వెనక్కివేసి "దొరగారితో మొరపెట్టుకుందామని.." అంటూ నసిగాడు.

"దొరగారితో మాట్లాడేంత మొనగాడివా? పోరా పో బైటికి" ఎస్సై లేచొచ్చి గుంజన్ మెడ మీద చేయి వేసి బైటికి నెట్టాడు.

గుంజన్ మొహం వేలాడేసుకుని మేనత్త ముందు నిలబడ్డాడు.

"ఏం చేద్దాం గుంజన్? మనకిపుడు ఏది దారి?" అతడి చేతులు పట్టుకుంటూ అడిగాందామె.

"ముందు నుయ్యి వెనక గొయ్యిలా ఉందత్తా! ఇటు మనపిల్ల.. అటు అల్లుడి చావు. నాకేం చేయాలో తోచటంలేదు. నేనేమీ చేయలేని చవటని. నా వల్ల ఏమీ కాదు. మీరూ మీరూ చూస్కోండి. అది నీ కూతురు. ఆడతని కొడుకు. మీ ఇష్టం. ఈ విషయంలో నేనేమీ చెప్పలేను" అంటూ తలదించుకుని అక్కడి నుంచి వేగంగా వెళ్ళిపోయాడు.

ఇంటికి రాగానే మంచం మీద పడిపోయి పొర్లిపొర్లి ఏడ్చాడు. సముదాయిస్తున్న భార్యకు విషయం చెప్తూ "మా బతుకులు చూశావా? అడవిలో తిరిగే పులుల పాలిట మేం యమకింకరులం. కానీ పోలీసోళ్ల ముందు పిల్లికూనలం. ఆడా కూత కూశాడని విన్న వెంటనే ఆడ్ని నరికి చంపేద్దామన్నంత కోపంతో వెళ్లా. ఆళ్ల వద్ద తుపాకులున్నాయి, పిస్తోళ్లున్నాయి. నేనేం చేయగల్ను? ప్రభుత్వమే మనల్ని బూటుకాళ్ల కిందేసి తొక్కేస్తుంటే

మనం ఎవరితో మొరపెట్టుకోవాలో తెలీటం లేదే" అంటూ ఏడ్చాడు.

జరుగుతున్న అమానుషాన్ని విని శ్రద్ధ చాలా అలజడికి లోనయింది. అనారోగ్యాల పాలై మరణిస్తున్న తన జాతిని రక్షించుకోడానికి మొదట్లో డాక్టర్ కావాలనుకుంది. కొతారి మాష్టారి మాటలు విన్నాక తన జాతిని జాగృతం చేయాలంటే చదువొక్కటే మార్గమని నమ్మి వీళ్ళని విద్యావంతుల్ని చేయడానికి టీచర్ కావాలనుకొంది.

ఇపుడు అరుణ జీవితంలో జరుగుతున్న దారుణాల్ని విన్నాక అలాంటి వాటిని ఆపాలంటే తను లాయర్ కావటమే మంచిదనిపించింది. చట్టాన్ని అమలు పరచాల్సిన వాళ్ళే రాక్షసులుగా మారి అకృత్యాలకు పాల్పడుతుంటే, వాళ్ళను న్యాయస్థానానికీడ్చి శిక్షపడేలా చేయగల సత్తా లాయర్లకే ఉంటుంది కాబట్టి.

ఊహ తెలిశాక, తమ జాతి ఆడవాళ్ళ విషయంలో మేడిపండులాంటి సభ్యసమాజంలోని వ్యక్తులు ఎంత దారుణంగా ప్రవర్తిస్తారో కథలు కథలుగా వింది. దొంగతనం నేరం మోపి మగవాళ్ళని పోలీస్‌స్టేషన్‌కి పిల్చుకెళ్ళి చావబాదటమే కాకుండా వాళ్ళకు తోడుగా వెళ్ళిన ఆడవాళ్ళ గుండెల్ని భర్తల కళ్ళముందే తడిమి మానసికంగా కూడా హింసించిన సంఘటనలెన్నో..! కన్నెపిల్లల్ని చెరబట్టిన దారుణాలెన్నో..! మగవాళ్ళని నల్లుల్ని నలిపినట్టు నలిపేసిన దురాగతాలెన్నో..! అమాయకంగా అడవినే నమ్ముకుని చిన్నచిన్న జంతువుల్ని వేటాడి పొట్టపోసుకునే తమ తెగవాళ్ళని అడవి నుంచి మైదాన ప్రాంతానికి తరిమేసింది ఈ సమాజమేగా! అదే సమాజం తమ తెగవాళ్ళని దొంగలని ముద్రవేసి రకరకాల అకృత్యాలకు పాల్పడుతూ మరెక్కడికో తరిమేసే ప్రయత్నం చేయడం ఎంత ఘోరం? ఎంతటి అమానుషం? అందుకే చదువుకుని పెద్దపెద్ద ఉద్యోగాలు చేసుకుంటున్న రాక్షసుల బారి నుండి తమ జాతిని కాపాడుకోడానికి తను ఎన్నెన్ని అవతారాలెత్తాలో అర్థమై శ్రద్ధ వ్యాకులపాటుకి లోనైంది.

★ ★ ★

రెండొందల ఇరవై ఎకరాల అటవీ స్థలాన్ని 'సూర్య ఇండస్ట్రీస్'కి ధారాదత్తం చేస్తూ ప్రభుత్వ ఉత్తర్వు వెలువడింది. ఆ నిర్ణయం తీసుకునే ముందు ఫైల్‌ని వైల్డ్ లైఫ్ డిపార్ట్‌మెంట్‌కి పంపించారు. వైల్డ్ లైఫ్ చీఫ్‌వార్డెన్ కుందన్ హేటే 'సూర్య ఇండస్ట్రీస్'కి అనుకూలంగా రిపోర్ట్ రాసి పంపించాడు. పత్రికలవాళ్ళు నిలదీస్తే "మీరు చెప్పింది నిజమే! ఇంతక్రితం ఆ స్థలంలో పులి తిరుగుతున్న జాడలు కన్పించాయని పత్రికలకు చెప్పింది నేనే. ప్రభుత్వం నుంచి నా అభిప్రాయం కోరుతూ ఫైల్ నా దగ్గరకు రాగానే ఏకంగా నెలరోజులు కెమెరా ట్రాప్‌లను పరిశీలించాం. ఎక్కడా పులి తిరుగుతున్న ఆనవాళ్ళు కన్పించలేదు. అడవిలో పులి సంచరిస్తుంటే కొన్ని రుజువులు దొరుకుతాయి. పులి చంపి తిన్నాక వదిలేసిన జంతువుల కళేబరాలు, దాని పాదముద్రలు, దాని విసర్జకాలు.. మావాళ్ళు ఇలాంటి రుజువుల కోసం అడవిలోని అంగుళం అంగుళం వెతికి, ఏమీ కన్పించలేదంటూ నాకు రిపోర్టిచ్చారు" అన్నాడు.

"మరి ఇంతకుముందు కెమెరా ట్రాప్‌లో కన్పించిన పులి అబద్ధమా? లేక మీ కల్పితమా? "

హేటే మెల్లగా నవ్వి చెప్పాడు. "రెండూ కాదు. అది నిజం పులే. దాని గురించి నిశితంగా ఎంక్వయిరీ చేయించాను. మగ పులిపిల్లలు రెండున్నరేళ్ళు దాటాక వాటి స్థావరాల కోసం చాలా దూరాలు సంచరిస్తుంటాయి. వాటికనువైన స్థలం దొరికాక,

అక్కడ ఎటువంటి ముప్పూ లేదని నిర్ధారించుకుని దాని చుట్టూ ఎల్లలు ఏర్పరచుకుని స్థిరపడిపోతాయి. ఆ ఏరియా మొత్తం దాని సామ్రాజ్యమన్నమాట. ఆడ పులుల్ని రానిస్తాయి, కానీ మగ పులి వస్తే మాత్రం పోరాడుతాయి. కెమెరా ట్రాప్‌లో కన్పించిన పులి కూడా అలా తన స్థావరానికి అనుకూలమైన స్థలాన్ని వెతుక్కుంటూ వచ్చి కెమెరాకి చిక్కింది. ఆ తర్వాత పులి కెమెరాలకు చిక్కలేదంటే అక్కడి నుంచి ప్రయాణించి అడవికి మరోవైపు వెళ్ళిపోయి ఉండాలి లేదా మరో అడవికి మారిపోయి ఉండాలి. మా రికార్డుల ప్రకారం మగ పులులు తమ స్థావరాల కోసం వందల కిలోమీటర్లు ప్రయాణించిన దాఖలాలున్నాయి" అన్నాడు.

'సూర్య ఇండస్ట్రీస్' వాళ్ళు రెండొందల ఇరవై ఎకరాల అడవిని చదును చేసే పనిలో నిమగ్నమయ్యారు. మొదట పెద్ద పెద్ద చెట్లను నరికించారు. కన్పించిన చిన్నచిన్న జంతువులను పట్టుకుని అటవీ శాఖ అధికారులకు అప్పగించారు. అక్కడ ఫ్యాక్టరీ భవనాన్ని కట్టడం ప్రారంభించారు. ఆరునెలలుగా విన్పిస్తున్న శబ్దాలకు చాలా జంతువులు అడవి మధ్యలోకి పారిపోయాయి.

★ ★ ★

ఏపుగా ఎదిగిన చెరకు పంటని చూసుకుని మురిసిపోతున్నాడు గోపాల్. ఇంకో వారం ఆగితే చాలు పంటని కోసి చక్కెర ఫ్యాక్టరీకి తరలించొచ్చు అనుకున్నాడు. దాదాపు యాభైవేల రూపాయల అప్పుంది. పంట చేతికొస్తే అప్పు తీర్చేసినా మరో యాభై వేల రూపాయల లాభం మిగుల్తుంది. గోపాల్ తన పొలం మధ్యలోకెళ్ళి నిలబడ్డాడు. ఐదెకరాల సొంత పొలం. తండ్రి నుంచి వారసత్వ ఆస్తిగా సంక్రమించింది రెండెకరాలే. దాన్ని తన కష్టంతో ఐదెకరాలకు పెంచాడు. ఊరికి దగ్గరగా చక్కెర ఫ్యాక్టరీ పెట్టినప్పటి నుంచి వూళ్ళోని చాలామంది రైతులు చెరకు పండించడానికి అలవాటు పడ్డారు. లాభాలు కూడా బాగానే ఉన్నాయి.

చెరకు గడలకు చివర్న ఉన్న పొడవాటి ఆకుల్ని గోపాల్ ప్రేమగా నిమిరాడు. ఎంత ఎత్తుగా పెరిగాయో..! తనంత ఎత్తుగా అనుకున్నాడు. వచ్చే యేడాది పిల్ల పెళ్ళి చేయాలి. దానికవసరమైన డబ్బు జమ కూడాలంటే వచ్చేయేడు కూడా చెరకు పంటనే వేయాలి. ఇపుడున్న పంట అమ్మగా వచ్చిన డబ్బులోంచి కొంత తీసి పెళ్ళికవసరమైన బట్టలు కొనిపెట్టుకోడం మంచిది.. ఇంతలో ఏదో శబ్దం వచ్చి అతడి ఆలోచన తెగింది. అతడు చెవులు రిక్కించి వినడానికి ప్రయత్నించాడు. చాలా దగ్గర నుంచే వస్తోందా శబ్దం. తన పొలంలోంచే. చెరకు గడల్ని భూమిలోంచి పీకుతున్న శబ్దం. అతను వెంటనే అప్రమత్తమయ్యాడు. చేతిలోని బాణాకర్రని పైకెత్తిపట్టుకుని "ఎవరక్కడ? ఎవర్రా అది?" అని అరుస్తూ శబ్దం వచ్చిన వైపు పరుగెత్తాడు ఆతృతగా.

బూడిద రంగుతో పర్వతాకారంలా ఉన్న రెండు ఏనుగుల్ని చూడగానే అతని పైప్రాణాలు పైనే పోయాయి. ఏనుగులు రెండూ చెరకు గడల్ని తినే క్రమంలో చాలా పంటని తొక్కి పాడుచేస్తున్నాయి. పంటని వాటి నుంచి ఎలా రక్షించుకోవాలో అర్థం కాలేదు. "ఏనుగులు.. నా పంటని ఏనుగులు నాశనం చేస్తున్నాయిరోయ్!" అంటూ పెద్దపెద్దగా అరిచాడు. ఎవరైనా విని తనకి సాయంగా వస్తారని అతని ఆశ! ఎవ్వరూ రాలేదు. ఏనుగులు తల తిప్పి అతని వైపు చూసి మళ్ళా పొలాన్ని నాశనం చేయడంలో నిమగ్నమయ్యాయి.

అతను చుట్టుపక్కల వెతికి చేతికి దొరికిన రాళ్ళని తీసుకుని ఏనుగుల మీదికి

విసిరాడు. ఓ రాయి నేరుగా వెళ్ళి ఓ ఏనుగు కంటికి అంగుళం కిందుగా తగిలింది. ఆ రాయి మొన కోసుగా ఉండటం వల్ల ఏనుగు కంటి కింద గాయమైంది. అంతే..! ఆ ఏనుగు మొదట పెద్దగా ఘీంకరించింది. చెరకు గడల్ని వదిలేసి గోపాల్ వైపు వేగంగా పరిగెత్తింది. ఊహించని ఆ పరిణామానికి గోపాల్ శిలలా బిగుసుకుపోయి నిలబడ్డాడు. కొన్ని క్షణాల తర్వాత స్పృహలోకొచ్చి చేతిలో ఉన్న రాళ్ళని అక్కడే పడేసి పరుగు లంకించుకున్నాడు.

ఏనుగు అతన్ని తరుముతూ గ్రామంలోకి ప్రవేశించింది. ఓ యింటి ముందు

> **కొత్తగాలి...**
>
> **నేపాల్‌లో భూకంపం**
> **అది ప్రకృతి ధర్మం**
> **ఇండియాలో అవినీతి పంకం**
> **ఇది మనిషి అధర్మం**
>
> – ఎస్. జయచంద్రారెడ్డి,
> బాపట్ల

గడ్డి మేస్తున్న ఎద్దుల్ని కోపంతో కింద పడేసి కాళ్ళతో తొక్కి చంపేసింది. ఊళ్ళోని కొంతమంది భయంతో బిగుసుకుపోయి తలుపులు బిగించి కూచుంటే, మరి కొంతమంది ఉత్సుకత కొద్దీ దూరంగా నిలబడి ఏనుగు సృష్టిస్తున్న బీభత్సాన్ని చోద్యంలా చూస్తున్నారు.

ప్రాణభయంతో పరిగెడుతున్న గోపాల్ దేన్నో తట్టుకుని కిందపడ్డాడు. ఏనుగు కసిగా అతన్ని సమీపించి దంతాలతో నేలకు అదిమి పట్టి లాక్కుంటూ ముందు కెళ్ళింది. ఆవేశం పట్టలేక గుండెల మీద ముందు కాళ్ళతో నొక్కుతూ బరువంతా అతని మీద వేసి కూచుంది. అప్పటికే అతనిలో చలనం ఆగిపోయింది. కొంత మంది యువకులు ధైర్యం చేసి పెద్దగా అరుస్తూ వంట గిన్నెల మీద, ఇనుప రేకుల మీద శబ్దాలు చేస్తూ దాన్ని తరమడానికి ప్రయత్నించారు. అది మరింత రెచ్చిపోయి ఇళ్ల దూలాల్ని తొండంతో లాగేసి, గోడల్ని తలతో కుమ్మేసి ధ్వంసం చేయసాగింది.

“శబ్దాలు చేయకండి! దానికి కన్పించకుండా చాటుకెళ్ళిపోండి” ఓ ముసలాయన సలహా ఇచ్చాడు. అందరూ అతని సలహాని పాటించి దానికి ఎదురుపడకుండా నక్కి కూచున్నారు. మరికొద్దిసేపు అసహనంగా వీధులన్నీ తిరుగాడి, ఏనుగు అడవి దారి పట్టింది.

ఊరి జనాలంతా వూపిరి పీల్చుకుని, జరిగిన నష్టాన్ని ఆకళింపు చేసుకునే పనిలోపడ్డారు. కొంతమంది గోపాల్ శరీరాన్ని అతని యింటికి చేర్చారు. ఎటుచూసినా ఏడుపులే ఏడుపులు.. పడిపోయిన ఇళ్లను మళ్ళా ఎలా కట్టుకోవాలో? అప్పటివరకు ఎక్కడ తల దాచుకోవాలో? తెలీక కొంత మంది, పశువుల్ని కోల్పోయి మరి కొంత మంది, పంట పొలాలు నాశనమై ఇంకొంతమంది- ఇలా గోపాల్ కుటుంబ సభ్యులతో పాటు ఊరంతా శోకసముద్రంలో మునిగిపోయింది.

అందరూ కూడబలుక్కుని సర్పంచ్‌ని తోడు తీసుకుని తమ ఎమ్మెల్యే వంజారి యింటికి బయలుదేరారు.

సాయంత్రం పూట వసారాలో పడక్కుర్చీలో కూచుని పేపరు తిరగేస్తున్న వంజారి తన యింటికి మూకుమ్మడిగా వంద మందికి పైగా జనం రావడం చూసి మొదట కలవరపడ్డాడు. ఓట్లు వేయించుకోడానికి వూరూరా తిరిగినపుడు చేసిన వాగ్దానాల్లో ఒక్కటి కూడా ఈ రెండున్నరేళ్ళల్లో పూర్తిచేయలేదన్న విషయం గుర్తొచ్చి తన మీదకి దండయాత్రకు వచ్చారేమో

నన్న భయం.. లేదా వచ్చే ఎన్నికల్లో తన మీద పోటీ చేయడానికి అవసరమైన అస్త్రాలకు పదును పెడుతున్న అపోజిషన్ అభ్యర్థి హర్షుందానీ కిరాయి మనుషుల్ని ఉసిగొల్పి గొడవ చేయమని తన మీదకు పంపాడేమోనన్న అనుమానం..

లేచి నిలబడి, తన కళ్ళద్దాలని సరిచేసుకుని చూశాడు.. తనకు తెల్సిన మొహాలో? కాదో? నిర్ధారించుకోడానికి. గుంపుకి ముందుండి నడిపిస్తున్న వ్యక్తి తనకు తెల్సినవాడే. అడవిని ఆనుకుని ఉన్న గ్రామానికి సర్పంచ్ అతను. వస్తున్న వాళ్ళు తన నియోజకవర్గంలోని అమాయక గ్రామ ప్రజలనీ, వాళ్ళ వల్ల ఏ రకమైన ప్రమాదమూ ఉండదని నిర్ధారించుకున్నాక ఊపిరి పీల్చుకుని పడక్కుర్చీలో ప్రశాంత వదనంతో కూచున్నాడు.

అందర్నీ కొద్దిదూరంలో నిలబెట్టి, సర్పంచ్ ముందుకొచ్చి తనకు నమస్కారం చేశాక చిద్విలాసంతో "ఏమిటి? ఊరి జనాన్నంతా వెంట బెట్టుకుని వచ్చావు? ఏమైనా సమస్యనా? ఒకవేళ సమస్య ఉన్నా నువ్వొచ్చి చేప్తే సరిపోయేదానికి ఇంతమందిని ఇబ్బంది పెట్టాలా? మరి నిన్ను సర్పంచ్‌గా ఎన్నుకుని ఏమిటీ లాభం? పొలం పనులు, ఇంటి పనులు మానుకుని వస్తే నా ప్రియమైన ప్రజలకు ఇబ్బంది కాదా? " అన్నాడు.

"నిజమే దొరా! కానీ మాకొచ్చిన సమస్య చాలా పెద్దసమస్య దొరా! దానివల్ల ఇదిగో ఇక్కడ గుమికూడిన అందరూ ఏదో ఓ రకంగా నష్టపోయినవాళ్ళే దొరా! తమ గోడుని స్వయంగా దొరగారికి విన్నవించుకుంటామంటే వెంటపెట్టుకుని వచ్చాను దొరా!" సంజాయిషీ ఇస్తున్నట్టుగా అన్నాడు సర్పంచ్.

సర్పంచ్ బయల్దేరినప్పుడు ఎమ్మెల్యేని గట్టిగా నిలదీయాలన్న ఆవేశంతో, ఉద్రేకంతో బయల్దేరాడు. తీరా వంజారీ తన గ్రామప్రజల మీద ప్రేమ ఒలకబోస్తూ మాట్లాడిన మాటలు విన్నాక వాటి మాయలో పడిపోయి జావకారిపోయాడు.

"ఇంతమంది ప్రజల్ని ఇబ్బంది పెట్టేంత పెద్ద సమస్య నా నియోజకవర్గంలో ఉండటమా? ఆశ్చర్యంగా ఉందే? ఏంటా సమస్య? " వంజారీ అందరి వైపు చూస్తూ అడిగాడు.

"అడవిలో ఉండాల్సిన ఏనుగులు వూర్లోకి వచ్చేస్తున్నాయి దొరా! ఈరోజు ఓ ఏనుగు మా గ్రామంలోకి జొరబడి నానా విధ్వంసం చేసింది. రెండు ఎద్దుల్ని చంపేసింది. గోపాల్ అనే రైతుని కాళ్ళతో తొక్కి చంపేసింది. ఇళ్ళని కూల్చేసింది. కోతకొచ్చిన మా పంటపొలాల్ని నాశనం చేసింది. పచ్చగా ఉండే మా వూరిని వల్లకాటిలా మార్చేసింది దొరా!" సర్పంచ్ సమధానమిచ్చాడు.

ఏనుగు వల్ల నష్టపోయిన వాళ్ళందరూ ఒక్కసారిగా ముందుకొచ్చి తమకు జరిగిన నష్టాన్ని కన్నీళ్ళతో ఏకరువు పెట్టుకున్నారు ఒక్కొరొక్కరుగా.

"మీరు బాధ పడకండి! నేను ప్రభుత్వంతో మాట్లాడతాను. మీకు నష్టపరిహారం ఇప్పించే వరకు నిద్ర పోను" అందరికీ అభయహస్తమిస్తూ అన్నాడు వంజారి.

"ప్రభుత్వం ఎన్ని డబ్బులిచ్చినా పడిపోయిన ఇళ్ళని మళ్ళా కట్టుకోగలమేమో కానీ పోయిన ప్రాణాల్ని తిరిగి తెప్పించగలమా దొరా? " అన్నాడు సర్పంచ్.

"నిజమే! మీ వూరి రైతు చనిపోయినందుకు నాకూ బాధగానే ఉంది. చావు పుట్టుకలు మన చేతిలో లేని విషయాలు కదా! మనం కేవలం నిమిత్త మాత్రులమే. ఎవరి రాతలో చావు ఎలా రాసి ఉంటే అలా జరక్క తప్పదు" వేదాంతం మాట్లాడి వాళ్ళని బుజ్జగించే ప్రయత్నం చేశాడు వంజారి.

"జరగాల్సిన నష్టమేదో జరిగిపోయింది దొరా! మా భయం ఏమంటే మళ్ళా ఆ ఏనుగులు మా వూరి మీద పడి ఎవరి ప్రాణాలు బలి తీసుకుంటాయోనని. అటు వంటి ప్రమాదం మళ్ళా రాకుండా కట్టు దిట్టం చేయమని, మీరు పూనుకుని అటవీ శాఖ అధికారులతో మాట్లాడాలి దొరా!"

"తప్పకుండా మాట్లాడతాను. అయినా అడవికి పక్కనే ఉండే గ్రామం కాబట్టి ఇటువంటి ప్రమాదాలు రాక మానవు. మీ గ్రామ ప్రజలే అప్రమత్తంగా ఉండాలి" అన్నాడు వంజారి.

ఆ మాటలకు గుంపులోంచి ఓ వ్యక్తి ముందుకొచ్చి "నాకు వూహ తెలిసినప్పటి నుండీ అంటే గత పాతికేళ్ళలో ఎప్పుడూ

కొత్తగాలి...

**భాష**
**వారధి మాత్రమే!**
**మానవత్వం**
**సజీవ ప్రవాహం!!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవల్లి

అడవిలోని జంతువులు మా వూళ్ళోకి వచ్చిన సంఘటనలు జరగలేదు. ఇప్పుడెం దుకు అలా జరిగిందో మీకూ తెలుసు మాకూ తెలుసు" అన్నాడు.

వంజారి భ్రుకుటి ముడివేసి 'ఎవరీ ఆతంకవాది?' అన్నట్టు సర్పంచ్‌వైపు చూశాడు.

"మా వూళ్ళో కొద్దో గొప్పో చదువుకున్న వ్యక్తి ఇతనే దొరా! పేరు కులకర్ణి. లోక్ మత్ దినపత్రిక్కి న్యూస్ రిపోర్టర్‌గా పన్చే స్తున్నాడు. ఉదయం ఏనుగు చేసిన బీభత్సాన్నంతా కెమెరాలో రికార్డ్ చేశాడు"

సర్పంచ్ సమాధానం విన్న వెంటనే వంజారి అప్రమత్తమయ్యాడు. ఇప్పుడు తనేం మాట్లాడినా అది రేపటి దినపత్రి కల్లో రావడం ఖాయం. కాబట్టి ఆచితూచి మాట్లాడాలని నిర్ణయించుకున్నాడు.

"మరిప్పుడలా ఎందుకు జరిగిందో నీకు తెలుసా? నాకు తెలీదే" అన్నాడు కులక ర్ణితో వంజారి.

"అడవికి సంబంధించిన స్థలాన్ని 'సూర్య ఇండస్ట్రీస్'కి ప్రభుత్వం ధారాదత్తం చేసింది కదా! దాన్లో మీ ప్రమేయం బాగా ఉందని అనుకుంటున్నారు బయట. జంతువులు తిరుగాడే అడవిలో చెట్లు కొట్టేసి, చదును చేసి ఫ్యాక్టరీలు కడితే ఆ జంతువులు వూళ్ళ మీద పడవా? వాటికి ఆహారాన్ని అందించే అడవిని నరికేస్తే పంటపొలాల మీద పడి ఆకలిని తీర్చుకోవా? ఈ రోజు ఏనుగులు అడవి దాటి బైటికొచ్చాయి. రేపు పులులూ ఎలుగుబంట్లు బైటికి రావొచ్చు. మా వూరి పశువులకూ మను షులకూ ప్రాణహాని కలగొచ్చు. ఇప్పటి కైనా మించిపోయింది లేదు. అక్కడ ఫ్యాక్టరీ నిర్మాణం జరక్కుండా ఆపండి. అందరికీ మేలు జరుగుతుంది" అన్నాడు కులకర్ణి.

"ప్రభుత్వ ఉత్తర్వు ప్రకారం రెండొందల ఇరవై ఎకరాల స్థలం ఫ్యాక్టరీ నిర్మాణం కోసం 'సూర్య ఇండస్ట్రీస్'కి ఇచ్చారు. దాన్ని ఆపే అధికారం నాకెక్కడుంది? అయినా అన్ని విషయాలూ క్షుణ్ణంగా పరిశీలించి సంతృప్తి చెందాకే ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది" అన్నాడు వంజారి.

"ఫ్యాక్టరీ పెట్టుకోడానికి ప్రైవేట్ భూములు అందుబాటులో లేవని నిర్ధారిం చుకున్నాకే ప్రభుత్వ భూముల్ని, ముఖ్యంగా అటవీ భూముల్ని ప్రైవేట్ వ్యక్తులకు ధారాదత్తం చేయాలన్న నిబంధ నని తుంగలో తొక్కారు సార్! నాగపూర్ చుట్టుపక్కల రెండొందల ఎకరాల ప్రైవేట్ భూములే లేవా.. 'సూర్య ఇండస్ట్రీస్' వారు

కొనుక్కుని ఫ్యాక్టరీ పెట్టుకోడానికి? నేను చూపిస్తాను రమ్మనండి! ప్రైవేట్ భూముల ధర ఎక్కువ కదా! అందుకు జరిగిన కుట్ర ఇదంతా! అటవీ భూములైతే చాలా చవక ధరలకు అప్పనంగా కొట్టేయవచ్చన్న ప్లాన్. దాన్లో ఎవరెవరు భాగస్వాములో అందరికీ తెల్సిన విషయమే. దాచుకోడానికేమీ లేద క్కడ" అన్నాడు కులకర్ణి.

"చూడు! నువ్వేమైనా ప్రభుత్వానికి వ్యతిరేకంగా చెప్పాలనుకుంటే కోర్టుకెళ్ళు. ఫ్యాక్టరీ కట్టడానికి వీల్లేకుండా స్టే తెచ్చుకో. నా దగ్గర వాదిస్తే ఏమిటి ప్రయోజనం? "

"మీరు ప్రజాప్రతినిధి కదా! ప్రజల్నే కాదు అడవుల్నీ రక్షించాల్సిన బాధ్యత మీ మీద ఉంది. ఇప్పటికే సగానికి పైగా అడవులు అంతరించి పోయాయి. మరి కొంత కాలం అటవీ భూముల్ని ఆక్రమించుకోవడం అనే దుశ్చర్య కొనసాగితే పులులూ సింహాలు మన ఇళ్ళలోనే కాపురాలు పెట్టడం ఖాయం" అన్నాడు కులకర్ణి.

"ఇతనేందీ అడవుల్ని స్వాహా చేస్తున్న వ్యక్తిని నేనే అన్నట్టు మాట్లాడుతున్నాడు? మీరందరూ వచ్చింది అందుకే అయితే వెళ్ళి అటవీశాఖ మంత్రితో మాట్లాడండి.. వెళ్ళండి" అన్నాడు కోపంగా వంజారి.

పరిస్థితి చేయి దాటిపోయేలా ఉందని అర్థమై "క్షమించాలి దొరా! మీరే కోపగించుకుంటే మాకు దిక్కెవరు? మా కష్టాలు చెప్పుకోడానికి వచ్చాం దొరా! మీరే మమ్మల్ని రక్షించాలి. మీరే ప్రభుత్వంతో మాట్లాడి జరిగిన నష్టాన్ని పూడ్చాలి" అన్నాడు సర్పంచ్. కులకర్ణివైపు తిరిగి "అయ్యగారితో మాట్లాడాల్సిన పద్ధతి ఇదేనా? మనం వచ్చింది పోట్లాడటానికి కాదు.. మన గోడు వెళ్ళబోసుకోడాని కొచ్చాం" అన్నాడు.

"అంతేగాక మరేమవుతుంది? మనం దరం వానపాములం కదా! మోకాళ్ళ మధ్య తలపెట్టి 'దేహీ' అని అడుక్కోవడం తప్ప బుస కొట్టిందెప్పుడని" అన్నాడు కులకర్ణి వెనక్కి తప్పుకుంటూ.

'పడగవిప్పి బుసకొట్టే పాముల తలలు నరకడం ఎలాగో మాకు బాగా తెలుసు కాబట్టే వానపాములు మాత్రమే మా మా నియోజకవర్గాల్లో బతికి ఉన్నాయి' అనుకున్నాడు మనసులో వంజారి.

పైకి మాత్రం తను "ముంబాయి వెళ్ళి ముఖ్యమంత్రితోనూ అటవీశాఖ మంత్రితోనూ మాట్లాడి న్యాయం జరిగేలా చేస్తా" అని వాళ్ళకు మాటిచ్చి పంపించాడు.

ఏనుగు తొక్కడం వల్ల చనిపోయిన రెండు ఎద్దుల్ని వూరి పొలిమేరల్లో పడేశాడు వాటి యజమాని. రెండ్రోజులు తర్వాత చూస్తే వాటి మాంసాన్ని ఏదో జంతువు తినేసిన ఆనవాళ్లు కన్పించాయి. బహుశా కుక్కలో, నక్కలో ఆ పని చేసి ఉంటాయని అనుకున్నారు గ్రామప్రజలు. అంతగా ప్రాధాన్యం ఉన్న విషయంగా వాళ్ళకు అనిపించక పోవటం వల్ల కొన్ని రోజులకే ఆ విషయాన్ని మర్చిపోయారు.

★ ★ ★

గుంజన్‌కి పులిని చంపే మరోబేరం తగిలింది. ఈసారి బేరం లక్షన్నరకు కుదిరింది. మొదట పులి ఎక్కడెక్కడ తిరుగాడుతుందో దాన్ని కనిపెట్టాలి. ఆ తర్వాత దాన్ని ఏవిధంగా చంపాలో ప్లాన్ చేయాలి.

పులి పాదముద్రల్ని గుర్తించడానికి అవసరమైన సరంజామాతో పాటు ఆత్మరక్షణ కోసం గొడ్డలిని భుజాన వేసుకుని అడవికి బయల్దేరాడు గుంజన్. ఉదయం ఎనిమిది గంటల సమయం. ఎండ నడినెత్తికొచ్చేలోపల అడవిలో కొంత భాగమైనా గాలించాలన్నది అతడి ఆలోచన. ఇలాంటి నాలు గైదు బేరాలు తగిల్తే చాలు తన కూతురు శ్రద్ధ పెళ్ళి ఘనంగా జరిపించొచ్చు. శ్రద్ధకు అనుమానం రాకుండా ఉండేందుకు, ఉదయం వచ్చేముందు గొడ్డలికి పదును

కూడా పెట్టలేదు. శ్రద్ధకు కన్పించకుండా బైటపడ్డాడు. చాలా తెలివిగల పిల్ల.. చూసిందంటే ఇట్టే పట్టేస్తుంది. ఎన్ని అబద్ధాలు చెప్పినా తప్పించుకునే వీలుండదు.

ఆలోచిస్తూ నడుస్తున్న గుంజన్ తన వెనక ఎవరో పరుగెత్తుకుంటూ వస్తున్నట్టనిపించి వెనక్కి తిరిగి చూశాడు. శ్రద్ధ.. ఆయాసంతో రొప్పుతూ పరుగెత్తుతోంది. క్షణకాలం అతనికి తన కూతురలా ఎందుకు పరుగెత్తుకుంటూ వస్తోందో అర్థం కాలేదు. ఇంట్లో ఏమైనా జరక్కూడనిది జరిగిందా? తను ఇంటి నుంచి బయల్దేరి పావుగంట కూడా కాలేదే..! ఇంతలో జరిగిపోయే అనర్థమేముంటుంది?

శ్రద్ధ గుంజన్ని సమీపించి రొప్పుతూ నిలబడింది.

"ఏం జరిగింది? ఎందుకు పరుగెత్తుకుంటూ వచ్చావు? చూడెలా రొప్పుతున్నావో? " అన్నాడు గుంజన్.

"నువ్వు నాకు చెప్పకుండా వచ్చేశావు కదా! మరి నిన్ను అందుకోవాలంటే పరుగెత్తాలి కదా!" నవ్వుతూ సమాధానమిచ్చింది శ్రద్ధ.

"అదే, ఎందుకని? "

"నేను కూడా నీతోపాటే అడవిలోకి వద్దామన్న ఆలోచన!"

"అడవిలోకా? ఎందుకు? "

"నువ్వెందుకెళ్తున్నావో అందుకే! పులిని చంపి తేవడానికి! తాత ఏ పనిచేశాడో అదే నువ్వు చేస్తున్నావు. నీ కూతురిగా నేనూ అదే పనిచేసి పొట్టపోసుకోవాలిగా!"

"అర్థం లేకుండా మాట్లాడకు. నీకేం ఖర్మ పట్టింది? హాయిగా చదువుకుంటున్నావు. నీ కోరిక ప్రకారం పెద్ద డాక్టర్ అవుతావు"

"లేదు. నీకు చెప్పాగా.. నువ్వు మళ్ళా వేటకెళ్తే నా చదువు మానేస్తానని! నువ్విప్పుడు ఎందుకెళ్తున్నావో నాకు తెలుసు. ఇక నేనూ నీతోపాటే. ఫారెస్టు గార్డులకిపుడు పోచర్లు కన్పిస్తేచాలు కాల్చేసే అధికారాలిచ్చారుగా! నిన్ను కాల్చేస్తే నీతోపాటు నన్నూ కాల్చేస్తారు. అమ్మ దిక్కులేనిదవుతుంది. నువ్వు కోరుకుంటున్నది అదేగా!"

"నోర్మూసుకో! లక్షన్నర బేరం! ఎలా వదులుకోమంటావు? " కోపంగా అన్నాడు గుంజన్.

"లక్షన్నర కాదు పదిలక్షలయినా మన ప్రాణంతో సమానమా నాన్నా? నువ్వంటే అమ్మకూ నాకూ ఎంతిష్టమో నీకు తెలుసుగా నాన్నా! నిన్ను పోగొట్టుకుని మేం బతకలేం. లక్షలు లేకున్నా ఫర్లేదు. గంజినీళ్ళు తాగి బతుకుదాం! నువ్వు మాత్రం క్షేమంగా ఉంటే చాలు నాన్నా!" అప్పటివరకూ ధైర్యంగా మాట్లాడిన శ్రద్ధ ఒక్కసారి బేలగా మారిపోయి గుంజన్ని చుట్టుకుని పెద్దగా ఏడ్చింది.

"వెనక్కెళదాం రా నాన్నా! మనకీ రక్తపు కూడు వద్దు. ఈ పాపపు సొమ్ము వద్దు నాన్నా!" అంది అతన్నుంచి దూరంగా జరుగుతూ..

"అది కాదు బేటీ! లక్షలకు లక్షలొచ్చే ఈ పని మానుకుంటే.."

అతన్ని మధ్యలోనే ఆపుతూ చెప్పింది "మాట్లాడితే చాలు లక్షలకు లక్షలంటావేమిటి? ఆర్నెల్లకో, యేడాదికో వస్తుందో? రాదో? తెలీని లక్షకన్నా నెలకు పదివేలు వస్తుంటే చాలుకదా! జీవితం ప్రశాంతంగా గడిచిపోతుంది కదా నాన్నా! నేను నీకంటే చిన్నదాన్నయినా జీవితం గురించి ఓ మాట చెప్పగలను. అన్నిటికంటే ముఖ్యం మనశ్శాంతి. అది లేని జీవితంలో మిగతావి ఎన్ని ఉన్నా వృథా నాన్నా!"

"సరే తల్లీ! మానేస్తాను. ఈ ఒక్కసారికి వెళ్ళనీ. కుదిరిన బేరం కదా! ఆళ్ళకి మాటిచ్చాను, వారం పది రోజుల్లోపల వాళ్ళడిగింది తెచ్చిస్తానని. నీ మీద ప్రమాణం చేసి చెప్తున్నా, ఇదే ఆఖరుసారి. ఆ తర్వాత అడవి మొహం చూడమన్నా

చూడను. సరేనా..! నా మాటిని ఇంటికెళ్ళు. కాలేజీకి ఇప్పటికే ఆలస్యమైపో యింది" అనునయిస్తున్నట్టు శ్రద్ధ గడ్డం పట్టుకుని బతిమాలుతూ అన్నాడు గుంజన్.

"పోయినసారి కూడా నువ్విలానే అన్నావు నాన్నా. నా మీద ప్రమాణం కూడా చేశావు. సరే నాన్నా.. నీ ఇష్టం.. వెళ్ళు! కానీ ఈ రోజు నుంచి నేను యింట్లో ఉండను. బెదిరిస్తున్నాననుకు నేవు. తప్పకుండా చేసి చూపెడతాను. నువ్వు తెచ్చే డబ్బుల్తో తినే తిండి నాకొద్దు. ప్రభుత్వం నడిపే హాస్ట ళ్ళున్నాయని మా లెక్చరర్‌గారు చెప్పారు. వెళ్ళి వాటిలో జాయిన్ అయిపోతా" శ్రద్ధ వెనక్కి తిరిగి మెల్లగా నడవసాగింది.

గుంజన్ ఆలోచనలో పడ్డాడు. శ్రద్ధ ఎంత మొండిదో తనకు తెలుసు. పట్టుద లకెళ్ళిందంటే బ్రహ్మరుద్రాదులు దిగివ చ్చినా మాట వినదు. తన కూతురు అనా థలా వెళ్ళి ఏ హాస్టల్లోనో ఉండేట్టయితే తనెన్ని డబ్బులు సంపాయించినా ప్రయో జనమేముంటుంది? బాగా చదువుకుం టున్న పిల్ల.. దాని మనసు గాయపరిచి తనేం సాధించినట్టు..? దానివల్ల చదువు మీద శ్రద్ధ తగ్గిపోయి తన కూతురు డాక్టర్ కాకపోతే జీవితంలో తన్ను తాను క్షమించుకోలేడు. అందుకే వెనుదిరిగాడు గుంజన్.

అప్పటివరకూ ఏడుస్తున్న శ్రద్ధ ము హంలో నవ్వు విచ్చుకుంది. తండ్రిని కౌగి లించుకుని "థాంక్యూ నాన్నా!" అంది. అతడి చేతిలోని గొడ్డలిని తీసుకుని దూ రంగా ఉన్న చెట్లపొదల్లోకి విసిరేసింది.

"అయ్యో..! చిన్నప్పటి నుంచీ నాకు తోడుగా ఉన్న గొడ్డలి" అన్నాడు గుంజన్.

"ఇపుడు దాంతో మనకు ఇక అవసరం లేదు" అంది శ్రద్ధ.

"పులిని చంపడానికి అవసరం లేదనుకో! కట్టెలు కొట్టటానికయినా పనికొచ్చేదిగా!" అన్నాడు

"నాన్నా..! అదంతా నీ చిన్నప్పుడు. ఇపుడు మనింట్లో ఉన్నది కిరోసిన్ పొయ్యి కదా!" అంది మనసారా నవ్వుతూ శ్రద్ధ.

"అవును కదూ! మరిచేపోయాను. నా బాల్యపు జ్ఞాపకాలతో ముడిపడిన వస్తువు కదా! అలా విసిరేస్తే గుండెల్లో ఎక్కడో కలుక్కుమందమ్మా! దానివల్ల బుర్ర కూడా పన్చేయటం మానేసి ఉంటుంది" కూతురి నవ్వులో శ్రుతి కలుపుతూ అన్నాడు గుంజన్.




**గుం**జన్ ఏడాదిన్నరగా 'వైల్డ్‌లైఫ్ ట్రస్ట్' అనే స్వచ్ఛంద సంస్థలో పన్చేస్తు న్నాడు. అందులో చేరాక అతనికి పులు లకు సంబంధించిన చాలా విషయాలు తెలిశాయి. పులుల్ని రక్షించడం కోసం, వాటి సంఖ్యని పెంచడం కోసం ప్రభు త్వంతో పాటు అనేక స్వచ్ఛంద సంస్థలు చేస్తున్న కృషి తెలిసేకొద్దీ తమ పర్ధితెగ వల్ల వాటికి జరిగిన నష్టం అవగతం కాసా గింది. ఇన్నాళ్ళూ కూతురు నెత్తీనోరు బాదుకుంటూ చెప్పినా తలకెక్కని విష యాలు, ఇప్పుడు ప్రత్యక్షంగా పులుల్ని, మిగతా అడవి జంతువుల్ని సంరక్షించే క్రమంలో అర్థమవుతున్నాయి.

'వైల్డ్‌లైఫ్ ట్రస్ట్'లో చేరిన రెండో నెల లోనే గుంజన్‌కి ఓ ముఖ్యమైన పని

అప్పగించారు. చంద్రపూర్ అడవిలో ఓ పులి మనుషుల్ని తినడానికి అలవాటు పడిందనీ, ఏడాది కాలంలో నలుగురు మనుషుల్ని పొట్టన పెట్టుకుందనీ, దాన్ని చంపడానికి షూటింగ్ ఆర్డర్ ఇమ్మని కొన్ని గ్రామాల ప్రజలు అక్కడి చీఫ్ వైల్డ్ లైఫ్ వార్డెన్ మీద వత్తిడి తీసుకురాసాగారు. గత్యంతరం లేని పరిస్థితుల్లో చీఫ్ వార్డెన్ అటువంటి ఉత్తర్వులివ్వడానికి సిద్ధపడ్తున్న సమయంలో ట్రస్ట్ సభ్యులు అడ్డుపడ్డారు. పులుల్ని చంపడం క్రూరత్వం కిందికి వస్తుందనీ, చాలా ప్రత్యేకమైన పరిస్థితుల్లో తప్ప షూటింగ్ ఆర్డర్లు ఇవ్వకూడదని వార్డెన్‌కు విన్నవించుకున్నారు. తమ ట్రస్ట్‌కో అవకాశం ఇస్తే అటువంటి ప్రత్యేక పరిస్థితులు ఉన్నా యో? లేవో? పరిశీలించి నివేదిక సమర్పిస్తుందనీ, దాని ఆధారంగా తదుపరి చర్య లు తీసుకోవచ్చనీ చెప్పారు. అది సబబుగా తోచి చీఫ్ వైల్డ్ లైఫ్ వార్డెన్ దానికి పర్మిషన్ ఇచ్చారు. అయితే ట్రస్ట్ సభ్యులు ఏం చేసినా అటవీ శాఖ అధికారులతో కలిసి జాయింట్ వెంచర్‌లా చేయాలనీ, ఆ పులి ని పట్టుకోవడం లాంటి చర్యలేమైనా ఉంటే అవి కేవలం అటవీ సిబ్బంది మాత్రమే చేపట్టాలని ఉత్తర్వుల్లో పేర్కొన్నారు.

ట్రస్ట్ నుంచి గుంజన్ ఒక్కణ్ణే పంపారు. ఆ రోజు అటవీ సిబ్బందితో కలిసి గుంజన్ అడవిలో ఆ పులి తిరిగే ప్రదేశాల్ని గుర్తుపట్టడానికి ప్రయత్నించాడు. అటవీ సిబ్బంది తమకు నేల మీద కన్పించిన అడుగు జాడల్ని పేపర్ మీద ట్రేస్ తీశారు. వాటిని చూడగానే గుంజన్ వెంటనే గుర్తుపట్టాడు.

అందులో రెండు జంతువుల పాదముద్రలున్నాయి. ఒకరకం పాదముద్రల్లో పాదం గుర్తు కొద్దిచిన్నగా ఉండి, దాని ముందు నాలుగు వేళ్ళ గుర్తులు స్పష్టంగా ఉన్నాయి. వేళ్ళకున్న గోళ్ళ గుర్తులు కూడా కన్పిస్తున్నాయి. అది అడవికుక్కకి సంబంధించిందైనా కావొచ్చు లేదా తోడేలు పాదాల గుర్తులు కూడా కావచ్చనుకున్నాడు గుంజన్. మరోరకం పాదముద్రల్లో పాదం గుర్తుకన్నా వేళ్ళ గుర్తులు పెద్దగా ఉన్నాయి. గోళ్ళ గుర్తులు పడలేదు. అది తప్పకుండా పులి పాదాల గుర్తులని అర్థం చేసుకున్నాడు. మధ్య రెండువేళ్ళు దాదాపు సమానంగా ఉండటంతో అవి ముందు పాదాల గుర్తులని, పాదాల గుర్తుల వెడల్పు, వాటి పొడవు కన్నా తక్కువ ఉండటంతో అవి ఆడపులికి సంబంధించిన పాదాలని నిర్ధారణకు వచ్చాడు.

జంతువుల పాదాల గుర్తుల్ని విశ్లేషించడంలో శిక్షణ పొందిన అటవీ సిబ్బంది కూడా గుంజన్ వేగంగానూ ఖచ్చితంగానూ చేస్తున్న విశ్లేషణకు విస్తుపోయారు.

పులి కచ్చితంగా ఆ దరిదాపుల్లో ఉండే అవకాశముందని నిర్ధారణకు వచ్చాక అక్కడ కాపు కాయడానికి నిర్ణయించుకున్నారు. తమతో తెచ్చిన మేకపిల్లని చెట్టుకి కట్టేసి, నాలుగువైపులా ట్రాప్‌లని ఏర్పాటు చేసి, పక్కనే ఉన్న చెట్లమీద సర్దుకుని కూచున్నారు.

వాళ్ళు ఎక్కువ సమయం వేచి చూడాల్సిన అవసరం రాలేదు. అరగంట గడవకముందే పులి మెల్లగా మేకపిల్లను సమీపించింది. దాని నడకలోనే తేడా కన్పిస్తోంది. అది ఓ కాలిని ఈడుస్తూ నడుస్తోంది. సరైన ఆహారం లేక దాని శరీరం శుష్కించి ఉంది. గుంజన్‌కి వాళ్ళ నాన్న పోచగొ చెప్పిన విషయాలు గుర్తుకొచ్చాయి. పులి ఆహారం లేకుండా వారం పది రోజులు ఉండగలదు. అది వేటాడిన ప్రతిసారీ ఏదైనా జంతువు నోటికి చిక్కాలని లేదు. చిక్కిన రోజు మాత్రం ఒకేసారి పాతిక ముప్పయి కేజీల ఆహారాన్ని తినేస్తుంది. మనిషి మాత్రం ఆహారం లేకుండా నలభై ఏభై రోజులు బతగ్గలడు.

కానీ పులి దాని భారీ శరీరం వల్ల ఆహారం లేకపోతే మూడు వారాల్లోనే మృత్యువుకు దగ్గరవడం ఖాయం.

పులి మేకపిల్ల మీదకి ఎగిరి దూకలేదు. మెల్లగా సమీపించింది. మేక మరోవైపుకు తిరిగింది. పులి కూడా అటు వైపుకి నడుస్తూ ట్రాప్‌లో చిక్కుకుపోయింది. అది బాధతో అరిచిన అరుపులో కూడా ఏదో తేడాని గమనించాడు గుంజన్. అది పూర్తిగా నోరు తెరవలేకపోతోంది. మత్తు కలిగించే డార్ట్‌లను రెండింటిని పులివైపుకు గురిపెట్టి వదిలారు. అందులో ఒకటి సూటిగా దాని డొక్కలో గుచ్చుకుంది. పులి కొద్దిసేపు గిలగిలా తన్నుకొని స్పృహ తప్పి పడిపోయింది.

గుంజన్తో పాటు చెట్టుమీద ఉన్న మిగతా అటవీ సిబ్బంది అచేతనంగా పడి ఉన్న పులిని సమీపించారు. దాదాపు ఏడ డుగుల పొడవున్న పులి.. దాని వయసు నాలుగైదేళ్ళకు మించి ఉండదని అంచనా వేశాడు గుంజన్. పులి జీవితకాలం పాతి కేళ్ళు. అంటే ఈ పులి యవ్వనంలో ఉన్నట్టే లెక్క. మరెందుకు చలాకీగా వేట చేయలేకపోతోందో తెలుసుకోవడం కోసం దాని పాదాల్ని పరిశీలించాడు. ముందరి రెండు పాదాల్లో ముళ్ళ పందికి సంబంధించిన ముళ్ళు గుచ్చుకుని ఉన్నాయి. అక్కడ గాయమై రసి కారుతోంది. దాని శరీరంలో మిగతా చోట్ల కూడా ముళ్ళున్నాయి. ముళ్ళ పందితో జరిగిన పోరాటంలో ఆ ముళ్లు గుచ్చుకుని ఉంటాయనుకున్నాడు గుంజన్.

అతనికిప్పటికీ ఓ విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. పులి చాలా తెలివైన జంతువు. దాని మెదడు మిగతా అన్ని జంతువుల కన్నా పెద్దది. దాదాపు చింపాంజీలకు ఉండేంత సైజు మెదడు ఉంటుంది. అది పోరాడేటప్పుడు ప్రత్యర్థిని

# చతుర ప్రవేశిక

## ఆగస్టు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. గుంజన్ ఏ తెగకు చెందినవాడు? | 6. సునీతను చంపింది? |
| జ. | జ. |
| 2. గుంజన్ కూతురు? | 7. భోలే తమ్ముడు? |
| జ. | జ. |
| 3. శ్రద్ధకు ఇష్టమైన మాస్టారు? | 8. చీఫ్ వైల్డ్ లైఫ్ వార్డెన్? |
| జ. | జ. |
| 4. అటవీ శాఖ మంత్రి కావాలనుకున్నది? | 9. రీనాను మోసగించింది? |
| జ. | జ. |
| 5. వంజారికి వ్యతిరేకంగా మాట్లాడిన జర్నలిస్టు? | 10. 'మినువాక' రచయిత? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ---------------------------------------- వయసు (   )

చిరునామా: ----------------------------------------------------

------------------------- పిన్‌కోడ్ : ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

బట్టి తన శైలి మార్చుకుంటుంది. జింకనో, అడవిపందినో వేటాడేటప్పుడు దాని మెడ దగ్గర రక్తం సరఫరా చేసే నరాల్ని కొరికి చంపేస్తుంది.. లేదా మెడ గట్టిగా పట్టు కుని అది గింజుకుంటున్నా విడవకుండా, వూపిరాడకుండా చేసి చంపేస్తుంది. అదే ఎలుగుబంటితో తలపడినపుడు తన పంజా దెబ్బతో దాని తలని బద్దలు కొడుతుంది లేదా దాని వెన్నెముకని విరిచే స్తుంది. నీళ్ళలో ఈదేటపుడు ఎప్పుడైనా మొసలిని ఎదుర్కోవాల్సి వస్తే దాని తల మీద కొట్టదు. మొసలి తలంతా బలమైన పొలుసులతో కప్పి ఉంటుందని దానికి తెలుసు. అందుకే మొసలిని వెల్లకిలా తిప్పి మెత్తగా ఉండే దాని పొట్టని చీల్చేస్తుంది. మరి ముళ్ళపంది విష యంలో ఎందుకిలా గాయపడుతుందో? ఏమో? అనుకున్నాడు గుంజన్.

దాని నోరు తెరిచి చూశాడు. రెండు ముళ్ళు దవడ లోపల గుచ్చుకుని ఉన్నాయి. నోటి లోపలంతా ఎర్రగా కంది పోయి ఉంది. మాంసాన్ని చీల్చడానికి ఉపయోగపడే పళ్ళలో ఒక పన్ను సగానికి విరిగిపోయి ఉంది. అది ఎటువంటి అస హాయ స్థితిలో మనుషుల్ని వేటాడటానికి అలవాటు పడిందో అతనికర్థమై చాలా జాలేసింది. తమతో పాటున్న వెటర్నరీ సిబ్బంది సాయంతో దాని శరీరంలో ఉన్న ముళ్ళని తీయించేసి ప్రథమచికిత్స చేసి దాన్ని జూ అధికారులకు అందజేయడం పూర్తయ్యాక అతని మనసు శాంతించింది. అసహాయ స్థితిలో ఉన్న ఓ పులి ప్రాణాన్ని కాపాడిన సంతృప్తి ఎంత గొప్పదో తొలిసారిగా అతనికి అనుభవ మైంది.

అతను ట్రస్ట్ సభ్యత్వం తీసుకున్నాక అపరాధ భావంతో కుంగిపోయాడు. తమ జాతి వల్ల జరిగిన నష్టాన్ని ఎలా

పూడ్చాలా అని తీవ్రంగా ఆలోచించి, చివరికో నిర్ణయానికొచ్చాడు. అది తనకూ తన కుటుంబానికి ప్రమాదమని తెలిసినా దాన్ని ఆచరణలో పెట్టడానికే నిర్ణయించుకున్నాడు.

పర్దితెగకు చెందిన సాహిల్- గుంజన్‌కి మేనమామ వరసవుతాడు. అతడెప్పుడూ నేరుగా అడవికెళ్లి వేటాడింది లేదు. కానీ జంతుచర్మాల వ్యాపారం చేయడంలో ఆరితేరాడు. పులి చర్మాలు, జింక చర్మాలు, చిరుత చర్మాలు.. ఏదడిగినా అతడి దగ్గర దొరికి తీర్సాలిందే. పైకి మాత్రం ఎండు గడ్డి, పచ్చిగడ్డి వ్యాపారం చేస్తాడు. ఎండుగడ్డి లోపల చర్మాల్ని దాచిపెట్టి అమ్ముతుంటాడు. అతడి దగ్గర నలుగురైదుగురు పోచర్లు పనిచేస్తున్నారు. వాళ్ళు అడవిలోకెళ్ళి జంతువుల్ని చంపి చర్మాలు తెచ్చిస్తారు. వాటిని అవసరమైన వాళ్ళకు అధిక ధరలకు అమ్మి అందులో సగం డబ్బులు తన కమీషన్ కింద తీసుకుని మిగతా సగం వాళ్ళకిస్తుంటాడు.

ఆ రోజు చిరుత చర్మాల కోసం నలుగురు పోచర్లని సాహిల్ అడవికి పంపుతున్నాడని గుంజన్‌కి సమాచారం అందింది. గుంజన్ వైల్డ్‌లైఫ్ ట్రస్ట్‌లో చేరాక, చాలా సార్లు ఆ వ్యాపారం మానుకోమని సాహిల్‌కి చెప్పి చూశాడు. అతని మాటల్ని సాహిల్ పట్టించుకోకుండా తన వ్యాపారాన్ని కొనసాగిస్తున్నాడు. ఈసారి ఎలాగైనా సాహిల్‌కి గుణపాఠం నేర్పాలని తీర్మానించుకున్నాడు గుంజన్. తనకు తెలిసిన సమాచారాన్ని మొదట ట్రస్ట్ సభ్యుల దృష్టికి తీసుకెళ్ళాడు. వాళ్ళు అటవీశాఖాధికారులను అప్రమత్తం చేశారు.

డివిజనల్ ఫారెస్టు ఆఫీసర్ ఆదేశాల మేరకు ఇద్దరు అసిస్టెంట్ రేంజర్లు, నలుగురు గార్డులు, ఇద్దరు ట్రస్ట్ సభ్యులతో ఓ టీమ్‌ని ఏర్పాటుచేశాడు రేంజ్ ఆఫీసర్. ట్రస్ట్ నుంచి ఎన్నుకున్నవాళ్ళలో గుంజన్ కూడా ఉన్నాడు.

చిరుత పులుల కోసం పోచర్లు అడవిలోని ఏ ప్రాంతంలో వేటాడతారో గుంజన్‌కి తెలుసు. అతడు దారి చూపిస్తుంటే మిగతావాళ్ళు అతన్ని అనుసరించారు. గార్డుల చేతుల్లో తుపాకులున్నాయి. పోచర్ అని అనుమానమొస్తే చాలు కాల్చేయమని వాళ్ళకు ఆదేశాలిచ్చారు.

దూరంగా గుబురుగా ఉన్న పొదల మధ్య అతని సుశిక్షితమైన కళ్ళకి ఏదో కదలిక కన్పించింది. ఆ కదలిక చాలా నెమ్మదిగా ఉంది. గాలివల్లనా? లేక అక్కడ ఏమైనా జంతువుందా? లేక పోచర్లు అక్కడ నక్కి చిరుతపులుల కోసం ఎదురుచూస్తున్నారా? అని గుంజన్ ఆలోచించాడు. తమ పర్దితెగవాళ్ళు అలాంటి చాటు ప్రదేశాలనే ఎన్నుకుంటారని అతడికి తెలుసు. చిరుతపులిని వేటాడేటప్పుడు వాళ్ళు చెట్టుమీద కూచుని కాపుకాయరు.. చిరుతపులి సునాయాసంగా చెట్లని ఎక్కుతుంది కాబట్టి. ట్రాప్ కన్పించేలా దూరంగా ఏ పొదల మాటునో కూచుని ఎదురుచూస్తారు.

అతడి సైగల్ని గమనించి మిగతావాళ్ళు నిశ్శబ్దంగా ఆ పొదవైపు కదిలారు. చిరుత పులి కోసం వేచి చూస్తున్న పోచర్లు తమ వెనక అలికిడైతే వెనక్కి తిరిగి, తుపాకీలు పట్టుకుని ఉన్న గార్డుల్ని చూసి నిశ్చేష్టులయ్యారు. నలుగురూ లేచి నిలబడి చేతులు పైకెత్తారు.

"ట్రాప్‌లు ఎక్కడ అమర్చారో చూపించండి" ఓ గార్డ్ హూంకరించాడు.

"ట్రాప్‌లేంటి సార్? కట్టెల కోసమని అడవిలోకొచ్చి దారి తప్పిపోయాం. క్రూర మృగాలకు భయపడి పొదల్లో నక్కి కూచున్నాం. బైటికెళ్ళే దారి చెప్పండి.. వెళ్ళిపోతాం!" అన్నాడు అందులో ఒకడు.

గార్డుల వెనక నిలబడి ఉన్న గుంజన్ వాళ్ళ ముందుకొచ్చి "మళ్ళా చెప్పు.. నువ్వే

మంటున్నావో విన్పించలేదు" అన్నాడు.

గుంజన్ని చూడంగానే అతడు నీళ్ళు నమిలాడు.

"ఎలాంటి ట్రాప్ పెట్టారో? ఎక్కడెక్కడ పెట్టారో? మర్యాదగా చూపించండి. ప్రాణాలతో ఉంటారు. లేదా మిమ్మల్ని పిట్టల్ని కాల్చినట్టు కాల్చేసి శవాల్ని పోస్ట్‌మార్టానికి పంపుతారు వీళ్ళు" గార్డుల్ని చూపిస్తూ అన్నాడు గుంజన్.

"అలాగే చూపిస్తాం! మమ్మల్నేమీ చేయొద్దని చెప్పు" అన్నాడొక పోచరు.

వాళ్ళు ముందు నడుస్తుంటే, వెనగ్గా మిగతావాళ్ళు నడిచారు. చెట్ల మధ్యలో ఆరడుగుల లోతు గొయ్యి తవ్వి ఉంది. దానిమీద పల్చటి గుడ్డకప్పి, దానిపైన ఆకులూ, ఎండిన కొమ్మలూ వేసి ఉన్నాయి. గొయ్యి లోపల విషం పూసిన ఇనుప ముళ్ళున్న నాలుగంగుళాల వెడల్పున్న పలకలు అన్నివైపులా పెట్టి ఉన్నాయి. చిరుత పొరపాటున గొయ్యిలోకి జారిపడటం అంటూ జరిగితే విషం పూసి ఉన్న ముళ్ళు గుచ్చుకుని కొన్ని నిముషాల్లోనే చావడం ఖాయం.

"ఇలాంటి గోతులు ఎన్ని తవ్వారు? " గుంజన్ ప్రశ్నించాడు.

"మూడు" ఓ పోచరు సమాధానమిచ్చాడు.

"మిగతా రెండు కూడా చూపించండి" అన్నాడు గుంజన్.

వాళ్ళు చూపించేటపుడే సాక్ష్యాల కింద వాటిని ఫొటోలు తీశారు గార్డులు. ఆ నలుగురినీ అరెస్టు చేసి ఇంటరాగేషన్ కోసం పిల్చుకెళ్ళారు.

వాళ్ల స్టేట్‌మెంట్ ఆధారంగా, గుంజన్ ఇచ్చిన సమాచారం ఆధారంగా 'వైల్డ్‌లైఫ్ క్రయిమ్ కంట్రోల్ బ్యూరో' అధికారులు సాహిల్ ఇంటి మీద దాడి చేశారు. అతడింట్లో రకరకాల జంతుచర్మాలు దొరికాయి. అతన్ని కూడా అరెస్టు చేశారు.

సాహిల్‌నీ, నలుగురు పోచర్లనీ అరెస్టు చేయించడం ద్వారా అడవి జంతువుల్ని కాపాడానన్న తృప్తితో ఆ రోజు ప్రశాంతంగా నిద్రపోయాడు గుంజన్. కానీ అప్పటి నుంచి పర్ధితెగవాళ్లకి ప్రశాంతత కరువైంది. తమ తెగవాడైన గుంజన్ అందరికీ బద్ధశత్రువులా మారిపోయాడు. బంధువులందరూ అతడి కుటుంబంతో సంబంధాల్ని తెగతెంపులు చేసుకున్నారు. అతడ్నీ, అతని కుటుంబాన్నీ తమ తెగ నుంచి బహిష్కరించారు.

★ ★ ★

జొన్నచేను కోత కొచ్చింది.. ఐదెకరాల్లో వేసిన పంట. జొన్న కంకులు పరువంతో మిడిసిపడ్తున్న పడుచుపిల్లలా నవనవలాడ్తున్నాయి. నీలావర్ సంతృప్తిగా తన చేనువైపు చూసుకున్నాడు. మరునాడు పదిమంది కూలీల్ని వెంటపెట్టుకుని వచ్చాడు. నలుగురు ఆడ కూలీలు, ఆరుగురు మగ కూలీలు. బాగా పదును పెట్టించి తెచ్చిన కొడవళ్ళతో చకచకా కంకుల్ని కోసి గోనెసంచుల్లో వేస్తున్నారు. చేనంతా కలియతిరుగుతూ వాళ్ళు చేస్తున్న పనిని జాగ్రత్తగా పర్యవేక్షిస్తున్నాడు నీలావర్. ఎవరైనా పనిచేయడం ఆపి కబుర్లలో పడితే చాలు "మాటలాపి మొదట పనిచేయండి. ఎండ నడినెత్తికొచ్చేవరకు సగం చేను పని పూర్తికావాలి" అంటూ అదిలిస్తున్నాడు. అతనిలో తనిచ్చే కూలీకి సరిపడా పని రాబట్టుకోవాలన్న ఆరాటం.. కూలీల మనసులో ఒక్కరోజులో పూర్తయ్యే పనిని రెండు మూడు రోజులకు సరిపడేలా ఎలా లాగిద్దామా అన్న ఆలోచన..!

పన్లోకి దిగిన మొదటి గంట వరకు వేగంగా పన్చేసిన కూలీలిప్పుడు నింపాదిగా కంకుల్ని కోయడం గమనించాడు నీలావర్. వాళ్ళ మేస్త్రీని సమీపించి "నీకు చెప్పాను కదా! పనంతా ఒక్కరోజులో పూర్తికావాలి. మీరందరూ కావాలనే పని

మెల్లగా చేస్తున్నారు. నీవాళ్ళకు చెప్పు చక చకా కంకులు కోయమని" అన్నాడు.

మేస్త్రీకి యాభైకి పైన వయసుంటుంది. జుట్టు చాలామటుకు తెల్లబడటం వల్ల అరవైకి దగ్గరగా ఉన్నట్టు కన్పిస్తున్నాడు. ఒళ్ళు మాత్రం గెడకర్రలా బలంగా ఉంది. అతను దిలాసాగా నవ్వాడు.

"మీకు ముందే చెప్పాగా సామీ! ఐదెకరాల పంటని ఒక్కరోజులో కోత కోయడం సాధ్యం కాదని" అన్నాడు.

"ఎందుకు సాధ్యం కాదు? పోయినేడాది పంటప్పుడు వచ్చిన కూలీలు ఒక్కరోజులోనే పనంతా పూర్తిచేశారు కదా!" అబద్ధాన్ని అలవోకగా పలికాడు.

"ఆళ్ళనే కూలీకి తెచ్చుకోవాల్సింది సామీ! మేం వేరేపనికి ఎళ్ళేవాళ్ళంగా!" అన్నాడు మేస్త్రీ. అతనికి ఇలాంటి మనుషుల్తో, రకరకాల అనుభవాల్తో తల పండిపోయింది.

"వాళ్ళే అందుబాటులో ఉంటే నాకీ కష్టాలు ఎందుకుండేవి? "

"నేను బేరం మాటాడేటపుడే చెప్పాగా సామీ! మొత్తం పని గుత్తగా మాట్లాడుకుందామని. తవరేగా అలాగొద్దని రోజుకూలీకి మాట్లాడారు. మరి రోజుకూలీ అంటే పని ఇలాగే ఉంటది"

"చాల్లే చెప్పొచ్చావు. నీలాంటి వాళ్ళని చాలామందినే చూశాను. మీవాళ్ళకు చెప్పు, పని తొందరగా తెమల్చమని" అంటూ అక్కడి నుంచి ముందుకు కదిలాడు.

మేస్త్రీ పెద్దగా అరిచి చెప్పటం వల్ల కూలీలు కొద్దిసేపు వేగంగా పనిచేశారు. తర్వాత షరా మామూలే! ఈలోపల మధ్యాహ్నమైపోవటం వల్ల కూలీలందరూ భోజనాలకు దిగారు.

నీలావర్‌కి అసహనంగా ఉంది. కూలీలు కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు.

"ఎంతసేపు తింటారు? తొందరగా కానివ్వండి" అన్నాడు ఒకింత కోపంగా.

"ఏందయ్యోయ్! కడుపు నిండా తిండైనా తిననివ్వవా? బలేగుందే నీ యవ్వారం. రోజంతా కట్టపడేది ఈ బువ్వకోసమేగా! పని తొందరగా చెయ్యాలంటావు. దానికి ఒంట్లో శక్తి ఉండాలిగా! మేం ఎక్కడికి పని కెళ్ళినా బువ్వ తినడానికి గంట సమయం తీసుకుంటాం. అంతకు ఎక్కువైతే అప్పుడడుగు సామీ!" అన్నాడు మేస్త్రీ.

"గంటనా? అన్నం తినడానికి పావు గంట చాలు"

"మాకు చాలదు. కట్టపడిన ఒళ్ళు కదా! బువ్వ తిన్నాక కొద్దిసేపైనా ఇస్రాంతి తీసు

## జులై - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **వక్కలంక విజయలక్ష్మి** - విజయనగరం
2. **మాచన్న** - కళ్యాణదుర్గం, అనంతపురం జిల్లా
3. **ఎన్. విజయలక్ష్మి** - ఒంగోలు, ప్రకాశం జిల్లా
4. **మాడభూషి శేషమ్మ** - శివంరోడ్, హైదరాబాద్
5. **జి. రాజేంద్ర** - కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. మోహన్ | 6. షుగర్ |
| 2. రేవతి | 7. ప్రియదర్శిని పార్క్ |
| 3. త్రినాథ్ | 8. నిరోషా |
| 4. వెంకటేశ్వర్లు | 9. మురళి |
| 5. చారి | 10. అధరాపురపు తేజోవతి |

కోకుండా పన్లోకి దిగలేం"

మేస్త్రీ అంత కచ్చితంగా చెప్పేటప్పటికి ఏమనాలో తెలీక "సరేసరే.. తొందరగా పన్లోకి రండి" అంటూ నీలావర్ పొలంలోకి వెళ్ళాడు. కంకుల్తో నింపిన బస్తాల్ని సరిగా కట్టారో, లేదోనని పరీక్షిస్తున్న సమయంలో వెనక అలికిడయింది. వెనక్కి తిరిగి చూశాడు. ఏమీ కన్పించలేదు. మళ్ళా తన పనిలో నిమగ్నమయ్యాడు. మరోసారి మొక్కల్లోపల ఎవరో కదుల్తున్న శబ్దం విన్పించింది. ఎవరైనా మనిషా? లేక మొక్కల్ని తినడానికొచ్చిన పశువా?

శబ్దం వినవచ్చిన వైపు నీలావర్ నాలు గడుగులు వేసి, చుట్టూ పరిశీలనగా చూశాడు. మొక్కల మధ్యలో నిలబడి

**కొత్తగాలి...**

**కుదిరితే**
**కప్పుకాఫీ అన్నాడు**
**తిక్క కుదిరింది.. నాకు**
**రోజూ నేను కాఫీకప్పు**
**అందించాల్సి వస్తోంది!!**

– జి.వి.యస్. ప్రియంవద, శ్రీకాకుళం

ఉందది. దాన్ని చూడగానే అతని కాళ్లు గజగజ వణికాయి. వెన్నులోంచి భయం తన్నుకొచ్చింది. పులి సూటిగా అతనివైపు చూస్తోంది. అతనికి వెంటనే ఓ విషయం గుర్తొచ్చింది. పులి ఎప్పుడూ హఠాత్తుగా దాడి చేస్తుంది. చాటునుంచి దాడి చేసి విభ్రమానికి గురిచేస్తుంది. దాని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ నిలబడ్డాడు. పులి కూడా తనున్న స్థలంలోంచి కదలకుండా అతని వైపే చూస్తోంది.

రెండు నిముషాలు గడిచాయి. అతనికి రెండు గంటలకు పైగా నిల్చున్నంత నిస్సత్తువగా అన్పించింది. ఏ క్షణంలోనయినా కూలబడేలా ఉన్నాడు. కూలీలు భోజనాలు చేస్తున్నవైపు పరుగెత్తికెళ్ళగలిగితే చాలు. గుంపుగా ఉన్నప్పుడు పులి దాడి చేయదు. పులి కళ్ళల్లోకి చూస్తూనే వెనక్కి రెండడుగులు వేశాడు. పులి కూడా ముందుకి రెండడుగులు వేసింది. అతనిలో భయం రెండింతలైంది. తను వెనక్కి తిరిగి పరుగెత్తితే వెంటపడి తనని చీల్చి చెండాడడం ఖాయం అనుకున్నాడు. మెల్లగా మరో రెండడుగులు వెనక్కి వేశాడు. పులి కూడా మెల్లగా ముందుకు కదిలింది.

పావుగంట గడిచేప్పటికి నీలావర్ తన అడుగులు పొలం బైటకు పడ్డట్టు గమనించాడు. భోజనాలు పూర్తయి బాతాఖానీలో ఉన్న కూలీలు మాటలాపి ఆశ్చర్యంగా నీలావర్ వైపు చూశారు. అతనెందుకు అలా వెనక్కి నడుస్తున్నాడో వాళ్ళకేమాత్రం అర్థం కాలేదు.

"ఏటయంది సామీ? ఎందుకలా ఎనక్కెనక్కి నడుస్తున్నావు? " అంటూ ప్రశ్నించాడు మేస్త్రీ.

నీలావర్ నుంచి సమాధానం రాలేదు.

మేస్త్రీ మనసు కీడుని శంకించింది. లేచి నిలబడ్డాడు. అతన్తోపాటు మిగతా కూలీలు కూడా లేచి నిలబడ్డారు.

"పామేమైనా కన్పించిందా సామీ? " మళ్ళా అడిగాడు.

నీలావర్ కనీసం తల కూడా తిప్పకుండా ఉండటంతో అతని అనుమానం బలపడింది. కింద పడేసిన కొడవళ్ళలోంచి వంగి ఓ కొడవలి చేతిలోకి తీసుకుని నాలుగడుగులు ముందుకేశాడు. మిగతా కూలీలు కూడా కొడవళ్ళు చేతపట్టి అతని వెనకే కదిలారు. నీలావర్ మరో రెండడుగులు వెనక్కి వేశాడు. అప్పటికే కూలీలందరూ అతన్ని సమీపించారు. పొలంలోపల నీలావర్ చూపు నిలిపిన దానివైపు వాళ్ళందరూ చూసి, అది పులి అని గుర్తించడం.. నీలావర్ "పులీ.. పులీ" అని అర

వడం ఒకేసారి జరిగాయి. అందరూ పెద్దగా అరుస్తూ వెనక్కి తిరిగి పరుగు లంకించుకున్నారు.

పులికి ఓ క్షణం ఏం చేయాలో అర్థం కాక, ఉన్నచోటనే నిలబడి పోయింది. ఒక్కసారిగా అంతమందిని చూడగానే అది బిత్తరపోయింది. ఆరుబయటకు రావడం కన్నా పొలం చాటున ఉండటమే దానికి సురక్షితమనిపించి, అక్కడి నుంచి పారిపో తున్న గుంపుని చూసింది. వాళ్ళు కొంత దూరం వెళ్ళాక నిలబడిపోయి తమ చేతుల్లో ఉన్న కొడవళ్ళతో శబ్దాలు చేయడం ప్రారంభించారు. దాంతో పులి కొద్దిసేపు వాళ్ళ వైపు చూసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

పులి వెళ్ళటం గమనించని కూలీలు శబ్దాలు చేస్తూ, పెద్దగా అరుస్తూ నిలబ డ్డారు. ఈలోపల నీలావర్ వూళ్ళోకి పరు గెత్తుకెళ్ళి అందరికీ సమాచారం చేరవే శాడు. వూళ్ళోని మగాళ్ళు ఓ యాభైమంది జమై నీలావర్తోపాటు అతని పొలం వద్దకు చేరుకున్నారు. తప్పెట్లు మోగించుకుంటూ అడవిలోకి కొంతదూరం వరకు వెళ్ళారు.

"పులి అడవి మధ్యలోకి పారిపోయి ఉంటుంది. మనం భయపడాల్సిందేమీ లేదు. వెనక్కి వెళ్ళిపోదాం" అన్నాడు ఊరి పెద్ద.

అందరూ వెనుదిరిగి వచ్చేశారు. అప్ప టికే పొద్దు పడమరకి వాలింది. పులి రావడం వల్ల పొలంలో కోతపని కుంటుప డినందుకు నీలావర్ దిగులుపడ్డాడు. కూలీలు మరుసటిరోజు పన్లోకి రావడానికి నిరాకరించి, తమ కూలి డబ్బులు తీసు కుని వెళ్లిపోయారు.

★ ★ ★

నిన్నటి నుంచీ భాక్లేకి కంటి మీద కును కులేదు. చీకటి పడకముందే ఇంటికి చేరా ల్సిన రెండు గొడ్లలో ఒక్కటే తిరిగొచ్చింది. దానికోసం మరో గంట ఎదురుచూసి, అది రాకపోయేసరికి ఏమైందోనని భయమేసి వూరంతా వెదికాడు. కన్పించలేదు. కన్పిం చిన ప్రతివాడినీ అడిగాడు. 'పొట్టికొమ్ము లున్న గొడ్డుని ఎక్కడైనా చూశారా?' అని. చీకటిపడ్డాక కూడా తన ఇద్దరు బావమరు దుల్ని తోడు తీసుకుని టార్చిలైటు సాయంతో వూరికి చుట్టుపక్కల వెతికి వచ్చాడు. ఫలితం శూన్యం.

"రేపు ఉదయం అడవిలోకి వెళ్ళి చూద్దాం బావా!" అన్నాడు పెద్ద బావమ రిది ధోలే. అతని వయసు ముప్ఫయికి దగ్గరగా ఉంటుంది. వ్యవసాయకూలీగా పన్చేస్తూ ఉండటం వల్ల కామోసు అతని శరీరం రివటలా ఉన్నా దృఢంగా ఉంది.

"అడవిలోకా..? పులి తిరుగుతోందనీ, అది మనుషుల రక్తం రుచి మరిగిన పులనీ వూరంతా అనుకుంటున్నారు కదన్నా! నేను రాను. నాకు భయం" అన్నాడు చిన్న బావమరిది దత్తు.. పాతి కేళ్ళ యువకుడైనా బూచిని చూసిన పసి పిల్లాడిలా వణికిపోతూ.

"అడవిలోకి అంటే.. మరీ లోపలికెళ్ళం. మన గొడ్డయినా అంత దూరం వెళ్ళి ఉంటుందని అనుకోను. దారి తప్పి అడవి వైపు వెళ్ళి, పచ్చగా ఎదిగిన గడ్డి కన్పిస్తే మరికొంత దూరం వెళ్ళి, దోవ తెలియక అక్కడే తచ్చాడుతూ ఉండొచ్చు. మనం ఒకట్రెండు ఫర్లాంగుల దూరం లోపలికెళ్ళి వెతికితే చాలనుకుంటున్నాను. ఆ తర్వాత అడవి చిక్కబడి ఉంటుంది. పశువులు అంత లోపలికి వెళ్ళే అవకాశం తక్కువ" అన్నాడు ధోలే.

"అక్కడ పులి ఉండదని గ్యారెంటీ ఏమిటి?"

"ఇంకెక్కడి పులిరా? రెండు వారాల క్రితం పులి కన్పించిందని మన వూరి జన మంతా తప్పెట్లతో శబ్దం చేస్తూ అడవి లోకి చాలా దూరం వెళ్లాం కదా! ఆ శబ్దా లకు పులి భయపడి అడవి మధ్యలోకి

పారిపోయి ఉంటుంది. అప్పటి నుంచి పులి కన్పించిన దాఖలాలు లేవు కదా!" అన్నాడు భాక్లే.

"పులెప్పుడూ ఒకచోట స్థిరంగా ఉండదు. మనం పులికెంత భయపడ్తామో అదీ మనుషులకంతగా భయపడుతుంది. అందుకే జనావాసాలకు దూరంగా వెళ్ళిపోతుంది. దానికి అడవిలో కావల్సినంత ఆహారం దొరుకుతున్నప్పుడు అది మనుషుల జోలికి రావాల్సిన అవసరమేముంటుంది? " అన్నాడు ధోలే.

"మనిషి రక్తం రుచి మరిగాక పులి పదే పదే మనుషుల్ని చంపడానికే చూస్తుంటుందని.."

తమ్ముడి మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ అన్నాడు ధోలే "అవన్నీ కట్టుకథలు. ఏ జంతువయినా ఆకలిగా ఉన్నపుడో లేకపోతే దాని జోలికెళ్ళినపుడో మనుషుల మీద దాడి చేస్తుంది అంతే! నీకెందుకు భయం? నేనూ బావా నీ పక్కనే ఉంటాంగా! అదీగాక మనం వెళ్ళేది పగటిపూట కదా! అడవి జంతువులు ఆహారం కోసం బయల్దేరేది చీకటి పడ్డాకే. ఆ లోపల తిరిగి వచ్చేస్తాంగా!"

ఉదయాన్నే ముగ్గురూ పొడవాటి కర్రల్ని తీసుకొని అడవిలోకి బయల్దేరారు. దత్తు మాత్రం కర్రతోపాటు పదునైన కొడవలిని కూడా వెంట తెచ్చుకున్నాడు.

"పులి ఎదురుపడితే కొడవలితో కలియబడాలనా నీ ఉద్దేశం? " అంటూ నవ్వాడు బావమరిదిని ఆటపట్టిస్తూ భాక్లే.

దత్తు కొద్దిగా సిగ్గుపడుతూనే సరైన సమాధానం ఇచ్చాడు.. "మీరిద్దరూ కర్రల్తో దాన్ని కొట్టి చంపేద్దామనా ఇంతింత పొడుగు కర్రలు తెస్తున్నారు? "

భాక్లే పెద్దగా నవ్వాడు "పులి ఎదురుపడితే కర్ర మీద మన చెయ్యి బిగుసుకుంటుంది అనుకున్నావా? భయంతో గుండెతోపాటు చేతిలో ఏ ఆయుధమున్నా జారిపోతుంది. అయినా పులి ఎంత పెద్దగా ఉంటుందనుకుంటున్నావు? ఏడెనిమిది అడుగుల పొడవుంటుంది. మూడున్నర అడుగుల ఎత్తుంటుంది. రెండొందలో మూడొందలో కేజీల బరువుంటుంది. అది ఎగిరి మీద పడిందంటే చెట్టంత మనిషి కూడా కింద పడాల్సిందే. వెంటనే పులి వాడి పీక పట్టుకుని కసుక్కున కొరికేస్తుంది"

దత్తు ఆగిపోయాడు.. అతని కళ్ళలో భయం నిప్పుకణికలా మండుతోంది.

"అలా నిలబడిపోయావేంరా? కదులు!" అన్నాడు ధోలే.

"నేను రావటం లేదన్నా! మీరు పొండి!" అన్నాడు కదలకుండానే దత్తు.

"బావ పరాచికాలాడుతున్నాడులేరా! నువ్వు చిన్నబావమరిదివి కదా! పగటి పూట పులేమీ బైటికి రాదని చెప్పాగా.. రారా!" అంటూ రెండడుగులు వెనక్కి వేసి తమ్ముడి చెయ్యి పట్టుకుని ముందుకి నడిపించాడు ధోలే. అయిష్టంగానే ముందుకు కదిలాడు దత్తు.

అడవిని సమీపించే కొద్దీ గుబురుగా పెరిగి చెట్లు అధికం కాసాగాయి. పల్లెప్రజలకు బాగా అలవాటైన దారే! ఆడా మగా వంటచెరుకోసం అడవిలో ఒకట్రెండు కిలోమీటర్ల దూరం లోపలికి వెళ్ళటం మామూలే. భాక్లే చెట్ల సందుల్లోంచి కన్పించినంత దూరం చూస్తూ తన ఎద్దు కోసం వెతుక్కుంటున్నాడు. తన రెండు ఎద్దులకు ముద్దుగా 'రామ్ లక్షణ్' అని పేర్లు పెట్టుకున్నాడు. అడవి పుణ్యమా అంటూ వాటికి దాణా కొనాల్సిన అవసరం రాలేదెప్పుడూ! రోజంతా కాడికి కట్టి పొలం దున్నినా సాయంత్రానికి కూడా అలసిపోకుండా చురుగ్గా ఉండే ఎద్దులవి.

"లక్షణ్! ఒరే లక్షణ్! ఎక్కడున్నావు? " అంటూ దాన్ని పేరుపెట్టి పెద్దగా పిలుస్తూ ముందుకు వెళ్తున్నాడు భాక్లే.

అక్షరం

ఏదైనా కీడు చేయదలిచినపుడే
నీకు శక్తి అవసరం
కానీ అన్నీ సక్రమంగా చేయడానికి
ప్రేమ ఒక్కటి చాలు!

- చార్లీ చాప్లిన్



"నిశ్శబ్దంగా వెతకొచ్చుగా! బావ అలా పిలుస్తుంటే తప్పిపోయిన ఎద్దుని పిలుస్తున్నట్టు లేదు. ఎక్కడో ఉన్న పులిని 'మేమిక్కడ ఉన్నాం రా! వచ్చి మమ్మల్ని తినేయి!' అని పిలుస్తున్నట్టుంది" అన్నాడు అన్నతో దత్తు.

ధోలే సమాధానం చెప్పకుండా పరిసరాల్ని నిశితంగా పరిశీలిస్తూ "బావా! మనం రెండు కిలోమీటర్లు దాటి వచ్చేసినట్టున్నాం! ఈ దోవ చూశావా? ఎక్కువ నలిగిన దోవ కాదు. ఇంకా ముందుకెళ్ళటం మంచిది కాదనుకుంటా!" అన్నాడు.

భాక్లే కూడా ఆగిపోయి నాలుగువైపులా దృష్టి సారించాడు. "నువ్వు చెప్పింది నిజమేననిపిస్తోంది. కానీ ఇంతదాకా వెదికినా ఎద్దు జాడ తెలీలేదు కదా! ఓవేళ ఏ పులో చంపి ఉన్నా దాని కళేబరమైనా దొరకాలిగా! వెల్తురు పుష్కలంగా వుంది. దారి కూడా నడవడానికి వీలుగానే ఉంది. ఇంకా దట్టమైన అడవిలోకి మనం ప్రవేశించ లేదు. ఇంకొంత దూరం వెళ్ళి చూద్దాం" అన్నాడు.

రకరకాల పక్షుల శబ్దాలు విన్పిస్తున్నాయి. గాలి చెట్లసందుల్లో దూరి చేస్తున్న శబ్దాలు ఏవో జంతువుల అరుపుల్లా ఉన్నాయి.

దత్తుకి భయం నరనరాన పాకుతూ ఉంది.

"ఇంక చాలన్నా! తిరిగెళ్ళిపోదాం!" అన్నాడు ధోలేతో.

"పులొస్తుందంటావా ఏమిటి? ముందే చెప్తున్నా! నేను నీ అక్క మొగుడ్ని. పులొస్తే నీ దగ్గరున్న కొడవలితో దాన్ని చంపి, నన్ను రక్షించాల్సిన బాధ్యత నీదే" అంటూ నవ్వాడు భాక్లే.

"వదిలేయి బావా! వాడసలే భయంతో వణికిపోతున్నాడు. ఇంకా భయపెట్టకు" అన్నాడు ధోలే.

దత్తు ఇవేవీ పట్టించుకోకుండా తనకు కుడిపక్కన దూరంగా ఉన్న పొదల్లోని కదలికల్ని కళ్లు విప్పార్చి చూస్తున్నాడు. చెవులు రిక్కించి అటు నుంచి వచ్చే శబ్దాల్ని వింటున్నాడు. ఎక్కడో దూరం నుంచి మేఘం ఉరిమినట్టు.. సన్నటి శబ్దం.. పొదల్లోంచి రెండు కళ్ళు తమవైపే చూస్తున్నాయి. దత్తు నిలబడిపోయాడు. కళ్ళు మెల్లగా కదిలి పొదల్లోంచి బైటికొస్తున్నాయి. పచ్చటి శరీరం మీద నల్లటి చారల్తో ఉన్న పులిమెడ కన్పించిందతనికి.

నూతిలోంచి మాట్లాడుతున్నట్టు "పులి.. పులి!" అన్నాడు దత్తు.

అతను ఎందుకు ఆగిపోయాడో తెల్సుకుందామని వెనక్కి తిరిగిన ధోలేకి ఆ మాటలు అస్పష్టంగా విన్పించాయి. దత్తు చూపు ఎటువైపుందో అటువైపుకి చూశాడు ధోలే. పులి మెల్ల మెల్లగా ముందుకు కదిలివస్తోంది.

వెంటనే ధోలే అప్రమత్తమయ్యాడు. "బావా! పులి..! పరుగెత్తు!" అంటూనే ముందుకు పరుగెత్తాడు. దత్తు భయంతో గడ్డకట్టుకుపోయి నేలకు మేకుల్తో దిగేసినట్టు, అక్కడే నిలబడిపోయాడు. పులి పొదల్లోంచి ఒక్క గెంతు గెంతి బైటికొ

చ్చింది. ఇప్పుడు పులి శరీరమంతా స్పష్టంగా కన్పిస్తోంది.

ధోలే పరుగు ఆపకుండానే వెనక్కి తిరిగి చూశాడు. దత్తు అక్కడే నిలబడి ఉన్నాడు. "దత్తూ! పరుగెత్తరా! దొరికితే పులి చంపేస్తుందిరా! పరుగెత్తి ఏదైనా చెట్టెక్కి కూచోరా!" అంటూ పెద్దచెట్టు కన్పించగానే గబగబా ఎక్కేశాడు. అతని వెనకే భాక్లే కూడా అదే చెట్టెక్కి కొమ్మల మధ్య నక్కి కూచున్నాడు.

దత్తు అప్పుడు స్పృహలోకొచ్చి తన చేతి లోని కొడవలిని విసిరేసి ప్రాణభయంతో పరుగెత్తాడు. పులి అతని వెంటబడింది. అతను చెట్టుని సమీపించి ఎక్కబోతున్నపుడు పులి అతని పిక్కని గట్టిగా కరిచి పట్టుకుంది. దత్తు పెద్దగా అరిచి కింద పడిపోయాడు. పులి అతని గుండెల మీద ముందరి కాళ్ళేసి కదలకుండా బలంగా నొక్కిపెడుతూ మెడని నోటితో కొరికింది. చెట్టుపైనున్న ధోలే, భాక్లే పెద్దగా కేకలు పెట్టారు.

పులి దత్తు మెడని నోటితో పట్టుకుని అతన్ని ఈడ్చుకుంటూ పొదల్లోకి లాక్కెళ్ళింది.

ధోలే తన దగ్గరున్న సెల్‌ఫోన్లో గ్రామ సర్పంచ్‌కి విషయం తెలియజేశాడు. మరో అరగంట తర్వాత వూళ్లోని జనాలు ఓ వందమందికి పైగా కర్రలు పట్టుకుని తప్పెట్లు మోగించుకుంటూ అడవి లోపలికి ప్రవేశించారు.

వాళ్ళందర్నీ చూశాక ధోలే, భాక్లే ధైర్యంగా చెట్టుదిగి కిందికొచ్చి, జరిగిన ఘోరాన్ని మరోసారి వివరంగా చెప్పారు. అటవీశాఖ ఉద్యోగుల సాయంతో దత్తు కోసం వెతుకులాట ప్రారంభమైంది. మూడు గంటలు వెతికాక పొదల మధ్య పడి ఉన్న దత్తు శరీరం కన్పించింది. పులి అతని మెడ కొరికేసింది. తొడలో సగ భాగం తినేసింది. దత్తు చనిపోయి నాలుగు గంటలయి ఉంటుందని డాక్టర్ ధ్రువీకరించాక, పార్థివ శరీరాన్ని పోస్ట్ మార్టం కోసం పంపించవలసిందిగా ఉత్తర్వు జారీచేశాడు చీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్ సావర్కార్.

పులి తిరుగుతున్న ఆ అడవి ప్రాంతంలోకి గ్రామప్రజలెవరూ రావొద్దని అటవీశాఖాధికారులు హెచ్చరికలు జారీచేశారు. దాంతోపాటే ఓ మనిషి ప్రాణాన్ని హరించిన ఆ క్రూరజంతువు జాడలు కనుక్కునే ఏర్పాట్లు చేయడం మొదలెట్టారు.




"వారం క్రితం నువ్వు తెచ్చిన కట్టెలు ఈ రోజు వరకూ వచ్చాయి. రేపటికి వంట చేయాలంటే కట్టెలు కావల్సిందే. నీ స్నేహితురాళ్ళెవరైనా ఈ రోజు అడవిలోకి వెళ్తున్నారేమో కనుక్కో సునీతా" అంది సునీత వాళ్ళమ్మ.

సునీత ఇంట్లోంచి కాలు బైటికి పెట్టి అప్పటికి మూడ్రోజులయింది. అదీ తన స్నేహితురాలు కావేరీ వాళ్ళింట్లో పేరంటం ఉంటే వెళ్ళొచ్చింది. సునీతకు బైట తిరగాలంటే మహాసరదా! అడవిలోకెళ్ళాలంటే మరీసరదా! రకరకాల చెట్లు.. రకరకాల పక్షులు.. వాటి వింత వింత అరుపులు.. అడవిలో వీచే గాలిలో అదో రకమైన వాసన.. గమ్మత్తుగా.. మత్తుగా.. అడవి పూల పరిమళాల్ని మోసుకొస్తూ..

సునీత ఒక్కంగలో ఇంట్లోంచి వీధిలోకి

గెంతి కావేరి యింటికి చేరుకుంది. "మనం ఈ రోజు అడవికి వెళ్దామే" అంది సునీత.

"మా యింట్లో కట్టెపుల్లలు ఇంకా నాలుగు రోజులు వస్తాయే. అడిగినా అమ్మ పంపదు"

"మనం వెళ్ళేది కట్టెల కోసం కాదే! అది సాకు మాత్రమే! నా మొబైల్‌లో హిందీ పాటలు రికార్డ్ చేసి పెట్టాను. నీ కిష్టమైన 'చికనీ చమేలీ' పాట కూడా ఉంది. తనివి తీరా డ్యాన్స్ చేసి ఎన్నిరోజులైందో! ఇష్టం వచ్చినట్టు గెంతొచ్చు. అడిగేవాడు, అడ్డుచెప్పేవాడు ఉండడు" అంటూ నవ్వింది.

ఆ మాట వినగానే కావేరి మొహం సంతోషంతో వెలిగిపోయింది. మళ్ళా వెంటనే నీరసంగా మొహం పెట్టి "అమ్మకే

## కొత్తగాలి...



**భావనా సంద్రంలో**
**స్నానించా!**
**భాషా సౌందర్యంతో**
**నా ముస్తాబు!!**

– హరితశ్రీ దూసి,
బెంగళూరు

మని చెప్పాలే? " అంది.

"చింతచెట్లకి చింతకాయలు విరగకాసి ఉంటాయి. వాటికోసమని చెబ్దాం. 'చింత కాయ పచ్చడి నూరి, వేడి వేడి అన్నంలో కలుపుకుని ఎండుచేప వేపుడు నంజుకుంటుంటే.. ఓహ్.. ఏం రుచిగా ఉంటుందో!' అంటూ వూరించవే"

"బాగా గుర్తుచేశావే. మా అమ్మకి చింత కాయ పచ్చడంటే చాలా ఇష్టం. ఉండు ఇప్పుడే అమ్మకు చెప్పి వస్తాను" అంటూ వంట గదిలోకి పరుగెత్తింది కావేరి.

వాళ్ళిద్దరూ మరో ఇద్దరు స్నేహితురాళ్ళని కూడా కలుపుకుని అడవిలోకి ప్రయాణమయ్యారు. అడవిలోకి వెళ్ళే కొద్దీ ఎటు చూసినా ఎత్తుగా ఎదిగిన వృక్షాలు కనిపించసాగాయి.

"మొదట ఆటాడుకుందామా? లేక వంట చెరకు ఏరుకుందామా? " అని అడిగింది సునీత.

కావేరి తప్ప మిగతా యిద్దరూ "మొదట కట్టెలు ఏరుకొద్దాం" అన్నారు.

కావేరి "చింతకాయలు కోస్తాం" అంది.

"మాకూ చింతకాయలు కావాలే! అందుకే కట్టెలు ఏరుకున్నాక అందరం కలిసి చింత చెట్టెక్కుదాం! సరేనా!" అంది సునీత.

"అందరూ ఎందుకే? ఇద్దరు చెట్టెక్కి చింతకాయలు కోసి కిందకి వేస్తుంటే ఇద్దరు కింద వుండి ఏరుకుంటే చాలు కదా!" అంది కావేరి.

కట్టెలు ఏరుకున్నాక వాటిని మోపుల్లా తాడుతో కట్టి ఓ చోట పెట్టుకున్నారు. తర్వాత ఇద్దరమ్మాయిలు చెట్టెక్కారు. కావేరీ, సునీత కిందనే ఉండిపోయారు.

కాయలు కింద పడుతుంటే ఏరి ఒక చోట కుప్పగా పెడ్తున్నారు కావేరి, సునీత. అరగంట సేపు కాయలు ఏరేప్పటికి అవి బుట్టెడయ్యాచ్చాయి.

"ఇంక చాల్లే దిగండే" అంది సునీత.

చెట్టుపైనున్న అమ్మాయిలు కొమ్మలపై నుంచి దిగుతూ సగం దాకా వచ్చి ఆగిపోయారు.

"ఏమైందే ఆగిపోయారు? త్వరగా దిగండి. ఇప్పటికే ఆలస్యమైపోయింది. ఇంటి దగ్గర అమ్మ కంగారు పండ్తా ఉంటుంది" అంది కావేరి.

ఆమెకు వాళ్ళ కళ్ళలో భయం స్పష్టంగా కన్పించింది. మళ్ళా పైకొమ్మలపైకి పాకటం మొదలెట్టారు.

"ఏమైందే? పాముని చూసినట్టు భయపడ్తున్నారు? " అంది కావేరి.

"పులొస్తోందే..! పెద్దపులి!" ఓ అమ్మా

యి చెట్టుపై నుంచే పెద్దగా అరిచింది.

కావేరి తల తిప్పి చూసింది. సునీతకు సమీపంలోనే ఉంది ఆ పులి. మరో ఆలోచన లేకుండా కంగారుగా పరుగెత్తటం మొదలెట్టింది కావేరి.

సునీత కొంచెం ఆలస్యంగా స్పందించింది. కావేరి వెనకే తనూ పరుగెత్తసాగింది. పులి ఒక్క గెంతు గెంతి సునీత తొడని కరిచి పట్టుకుంది. సునీత పెద్దగా అరుస్తూ కింద పడిపోయింది. పులి సునీత మెడ మీద దాడి చేసి, శరీరాన్ని ఈడ్చుకుంటూ చెట్ల మధ్యలోకి లాక్కెళ్ళిపోయింది.

★ ★ ★

ఎదురుగ్గా వంద మందికి పైగా ఉన్న జనాలు.. ముంచెత్తడానికి ఉప్పెనేదో కదిలివస్తున్నట్టు ముందుకు కదులుతూ. వంజారి కళ్ళు విప్పార్చి భయం భయంగా చూశాడు. తన మీదకి దాడికి వస్తున్న జనాలు కాదు. తన నియోజకవర్గంలోని ప్రజలే. డోంగర్ హల్ది వూరి సర్పంచ్‌ని గుర్తుపట్టి లేచి వాళ్ళకెదురెళ్ళి "ఏంటీ? అందరూ కట్టకట్టుకు వచ్చారూ? ఏమైనా సమస్యనా? " అని అడిగాడు.

"ఈ రోజు మావూరి పిల్లని పులి పొట్టన పెట్టుకుంది. ఈ ఆరేడు నెలల్లో మా వూరి వాళ్ళతో పాటు చుట్టుపక్కల ఉన్న ఊళ్ళలో మొత్తం ఏడుగుర్ని ఆ పులి పొట్టన పెట్టుకుందన్న విషయం మీకూ తెలుసు. ఆ పులి మొదటిసారి మా వూరి దత్తుని చంపినపుడే మీకు విన్నవించుకున్నాం. ఆ పులిని చంపేలా ఆర్డర్ వేయించమని.. విన్నారు కాదు. విని ఉంటే మరో ఆరు ప్రాణాలు గాల్లో కలవకుండా కాపాడిన వాళ్ళయ్యేవారు. అయ్యా! ఇక మేం వూరుకునేది లేదు. మీరు దాన్ని కాల్చిపడేయడానికి ఆర్డర్ వేయించేవరకు మేం కదిలేది లేదు. మీ ఇంటి ముందే ధర్నా చేస్తాం" అన్నాడు.

వెనక్కి తిరిగి అందరికీ చేత్తో సైగచేశాడు. అంతే అందరూ ఎక్కడివారు అక్కడ నేల మీద బైఠాయించారు.

"మీ మాట కాదంటే కదా మీరు ఇంటి ముందు ధర్నా చేయాలి. ఎన్నిసార్లు ఆ చీఫ్ వైల్డ్‌లైఫ్ వార్డెన్‌కి చెప్పినా పులిని చంపడానికి రూల్స్ అడ్డొస్తాయంటాడు తప్ప మనుషుల ప్రాణాలు పోతుంటే పట్టించుకోడే" అన్నాడు వంజారి.

"ఈసారి గమ్మునుండే ప్రసక్తే లేదు. ఆ పులిని చంపమని ప్రభుత్వం ఆర్డర్ వేసేవరకు మేం ఉద్యమాన్ని ఆపం" అన్నాడు సర్పంచ్.

"మీరు ఉద్యమించాల్సింది నా మీద కాదయ్యా! ఫారెస్టు అధికారుల మీద. ఇంతకూ అసలు పులి మీ వూరి పిల్లని చంపిన విషయాన్ని అటవీ సిబ్బంది దృష్టికి తెచ్చారా? "

"వాళ్ళకు చెప్పగానే కొంతమంది సిబ్బంది వచ్చారు. శవాన్ని పోస్ట్‌మార్టం కోసం తరలించడానికి ప్రయత్నిస్తే వూరి వాళ్ళమందరం అడ్డుకున్నాం. సగం మందిని శవానికి కాపలాగా ఉంచి మేమందరం మీ దగ్గరకు వచ్చాం"

"సరే! పదండి! కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్టుని పిలిచి గట్టిగా అడుగుదాం" అన్నాడు వంజారి.

అతను ముందు నడుస్తుంటే అతని వెనక మిగతావాళ్ళందరూ కదిలారు.

★ ★ ★

శవం చుట్టూ మనుషులు దడి కట్టినట్టు కూచుని ఉన్నారు. డివిజనల్ ఫారెస్టు ఆఫీసర్ అసహనంగా తన రేంజర్లతో మాట్లాడుతున్నాడు.

"మన డ్యూటీ మనం చేయకుండా అడ్డపడ్తున్నారు కాబట్టి వీళ్ళందరి మీదా కేసు పెట్టి కటకటాల వెనక్కి పంపితే కానీ బుద్ధి రాదు" అన్నాడు ఫారెస్టు ఆఫీసర్.

"మనం తొందరపడటం మంచిది కాదు

సార్! ఈ అమ్మాయితో కలిపి ఈ చుట్టు పక్కల గ్రామాల్లో ఏడుగురు పులివాత పడ్డారు. ఈ గ్రామం నుంచి ఇది నాలుగో కేసు. అందరూ ఆవేశంతో వూగిపోతున్నారు. మనం ఎమ్మెల్యే వంజారిగారు వచ్చేవరకు వేచి ఉండటమే ఉత్తమం" అన్నాడు సీనియర్ రేంజర్.

"ఓ రెణ్ణెల్ల క్రితం పులివాత పడిన జర్నలిస్టు విషయంలో ఈ ఎమ్మెల్యే వంజారి పేరు పేపర్లలో వచ్చింది కదూ!" అన్నాడు ఫారెస్టు ఆఫీసర్. అతను నెల క్రితమే ట్రాన్స్‌ఫర్ మీద ఇక్కడ డ్యూటీలో జాయినయిన అధికారి.

"అవును సార్! కొన్నినెలల క్రితం ఏనుగు దాడిలో ఈ వూరి మనిషొకతను

కొత్తగాలి...

**కృషి ఉంటే**
**పాడీ పంటా**
**లేకపోతే..**
**తిండికి తంటా!**

*- దాశరెడ్డి చిరంజీవిరావు,*
*శ్రీకాకుళం*

చనిపోయాడు. దానిక్కారణం వంజారి గారు 'సూర్య ఇండస్ట్రీస్'కి రెండొందల ఇరవై ఎకరాల అటవీ భూమిని ప్రభుత్వం నించి ఇప్పించడమేనని కులకర్ణి పేపర్లలో రాశాడు. అందరి ఎదుట నేరుగా వంజారితో తలపడ్డాడని కూడా అనుకున్నారు. అది మనసులో పెట్టుకుని వంజారిగారే కులకర్ణిని హత్య చేయించి ఉంటాడని కొంత మంది అనుమానం సార్! దానికి తగిన ఆధారాలు మాత్రం ఏమీ లేవు"

"కులకర్ణి ఎలా చనిపోయాడు? పులి చంపేసిందని ఎలా నిర్ధారణకు వచ్చారు? "

"అడవిలో ఓ మనిషి శవం పడి ఉందని అప్పటి ఫారెస్టు ఆఫీసర్‌గారికి కబురందింది. వారి ఆజ్ఞ మేరకు నేను, ఇద్దరు అసిస్టెంట్ రేంజర్లని, నలుగురు గార్డ్‌లని వెంట తీసుకుని శవం ఉన్న ప్రదేశానికి వెళ్లాను. శవం ఒంటి మీద చాలా గాయాలు కన్పించాయి. అవన్నీ పులిగోళ్ళతో రక్కటం వల్ల ఏర్పడిన గాయాలే. తొడలో సగభాగం ఏ జంతువో తినేసింది. మెడ కొరికేసి ఉంది. పంచనామా చేసి శవాన్ని పోస్ట్‌మార్టానికి పంపించాం"

"రిపోర్ట్‌లో ఏమని వచ్చింది? "

"జుగ్లర్ వీన్ తెగడం వల్ల మరణం సంభవించిందని రిపోర్ట్ వచ్చింది. ఒంటి మీదున్న గాయాలు వాడిగా ఉన్న గోళ్ళ వల్ల సంభవించి ఉంటాయనీ, శరీరభాగాల్ని ఏవో జంతువులు తినేసినట్టు ఆనవాళ్ళు కన్పిస్తున్నాయని చెప్పారు"

"మరి ఇందులో వంజారి ప్రమేయం ఉండొచ్చన్న అనుమానం ఎందుకొచ్చింది? "

"ఆ రోజు ఏదో వార్తని లోక్‌మత్ పత్రిక్కి ఫాక్స్‌ద్వారా పంపించాలని కులకర్ణి పట్నం బయల్దేరాడట. పట్నానికని ఉదయం పదింటికి బస్సెక్కి వెళ్ళిన వ్యక్తి మరునాడు మధ్యాహ్నానికల్లా అడవి మధ్యలో శవమై ఎలా తేలాడనే విషయం ఎవ్వరికీ అంతుబట్టలేదు. జుగ్లర్ వీన్ తెగడం వల్ల మరణం సంభవించిందని రిపోర్ట్ వచ్చింది తప్ప పులి అతని మెడ కొరకటం వల్ల అలా జరిగి ఉంటుందని ఎవ్వరూ చెప్పలేదు"

"మరి శరీరం మీద ఉన్న గాయాలు పులి గోళ్ళ వల్ల ఏర్పడి ఉంటాయని మీరు చెప్పారుగా"

"నిజమే! ఆ గాయాలు మాత్రం పులి గోళ్ళతో రక్కటం వల్ల ఏర్పడినవే"

"కాబట్టి పులి చంపే అవకాశం కూడా ఉందిగా"

"అతని మెడ నరాన్ని కోసేసి, చనిపో

యాక పులి గోళ్ళతో చేసిన గ్లోవ్స్ వేసుకుని వాటితో ఒళ్ళంతా గాయాలు చేసి, రాత్రికి రాత్రి అడవి మధ్యలో శరీరాన్ని విసిరేసి ఉంటారని అనుకున్నారు. ఏవో జంతువులు శరీరంలోని కొన్నిభాగాల్ని తినేసి ఉండొచ్చని, ఆ జంతువు పులే కావాల్సిన అవసరం లేదని కొంతమంది వాదన. కొన్నిరోజులు పేపర్ల వాళ్ళు దుమారం లేపారు. కానీ బలమైన సాక్ష్యాధారాలు లేక చల్లబడిపోయారు"

ఈసారి ఎన్నికల తర్వాత వంజారికే అటవీశాఖ మంత్రి పదవి దక్కుతుందని అనుకుంటున్నారు. దుర్మార్గులతో జాగ్రత్తగా ఉండటమే మంచిది. మీరు చెప్పినట్లు వంజారిగారు వచ్చాకే మనం ఏదైనా నిర్ణయం తీసుకుందాం. అప్పటివరకు నేను నా జీపులో విశ్రాంతి తీసుకుంటాను. ఎమ్మెల్యేగారు రాగానే నాకు తెలియజేయండి" అంటూ ఫారెస్ట్ ఆఫీసర్ దూరంగా నిలిపి ఉన్న తన జీపువైపు నడుచుకుంటూ వెళ్లాడు.

మరో గంటన్నరకు వంజారి మందీమార్బలంతో దిగాడు. రావడం రావడం అటవీశాఖ అధికారుల మీద విరుచుకుపడ్డాడు. "మీ వాళ్ళందరూ ఏమనుకుంటున్నారు? చెట్లనీ, అడవి జంతువుల్నీ రక్షిస్తే చాలనుకుంటున్నారా? మనిషి ప్రాణాలంటే లెక్క లేదా? ఒక్కరా? ఇద్దరా? ఇప్పటికి ఏడుగుర్ని ఆ పులి పొట్టన పెట్టుకుంది. ఈ పిల్లని చూశారా? పసిపిల్ల.. పదహారేళ్ళు కూడా పూర్తిగా నిండక ముందే పులికి ఫలహారమైపోయింది. ఈ పాపం ఎవరిది? మీదే! దీనికి సమాధానం చెప్పాల్సింది మీ అధికార్లే. ఏరీ ఒక్కరూ లేరే ఇక్కడ. పిలవండి వాళ్ళని" అంటూ పెద్దపెద్దగా అరిచాడు వంజారి.

ఎమ్మెల్యేగారు వచ్చారన్న కబురు విన్న వెంటనే ఫారెస్టు ఆఫీసర్ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు.

"మనుషుల్ని చంపడానికి అలవాటుపడిన పులి అది. మాన్ ఈటర్‌గా మారిన పులి. దాన్ని కాల్చి చంపమని ఇప్పటికైనా ఉత్తర్వులు జారీ చేయండి. మీరు మీ పైఅధికార్లతో మాట్లాడండి. అలాంటి ఉత్తర్వులు నా కళ్ళతో చూసేవరకు మేమెవ్వరం ఇక్కడి నుండి కదలమని చెప్పండి" అన్నాడు వంజారి.

"పులిని కాల్చి చంపడం రూల్స్‌కి విరుద్ధం సార్! మేం దాన్ని పట్టుకునే ప్రయత్నం చేస్తున్నాం. తొందర్లోనే దాన్ని పట్టుకుని ఏదైనా జూకి అప్పగిస్తాం" అన్నాడు ఫారెస్టు ఆఫీసర్.

"ఈ మాట వినీ వినీ అలసిపోయాను. ఇంకా ఎప్పుడు పట్టుకుంటారండీ? ఈ వూరివాడైన దత్తు పులివాత పడ్డప్పుడు చెప్పారు. ఏమీ చేయలేకపోయారు. మీ చేతకానితనానికి శిక్షగా మరో ఆరుగురు ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇంకెంతమందిని చంపాక పట్టుకుంటారండి పులిని? "

"మా ప్రయత్న లోపమేమీ లేదు సార్! ఎక్కడెక్కడ పులి తిరుగుతుందన్న అనుమానముందో అక్కడల్లా కెమెరా ట్రాప్స్ పెట్టించాం. అది నడిచే దారిలో ప్రెషర్ ఇంప్రెషన్ ప్యాడ్స్ పెట్టించి పాదముద్రల్ని బట్టి ఆ పులిని గుర్తించే ప్రయత్నాలు చేస్తున్నాం. చివరికి ఆటోమాటిగ్గా మూసుకుపోయి జంతువుని బంధించే స్టీల్‌ట్రాప్స్ కూడా వాడి చూశాం. ఆ పులి చాలా తెలివైందిగా తోస్తోంది. ట్రాప్స్ పెట్టిన స్థలం పక్కనుంచి వెళ్తోంది తప్ప అందులో ఇరుక్కోవడం లేదు"

"పోయినసారి కలిసినపుడు స్క్వాడ్‌ని పంపి దాన్ని బంధించే ప్రయత్నం చేస్తున్నామని చెప్పాడే మీ కన్జర్వేటర్. ఆ ప్రయత్నాలేవీ చేయలేదా? "

"అవీ చేశాం సార్! మా గార్డులు, పోలీసు సిబ్బంది, వెటర్నరీ అధికార్లు

కలిసి మత్తు ఇంజక్షన్లు పట్టుకుని అడి వంతా గాలించారు. ఆ పులి వాళ్ళ కళ్ళబ డలేదు. చెప్పాగా ఆ పులి చాలా తెలివైందని. మా ప్రతి ప్రయత్నాన్నీ అది తిప్పికొడుతోంది సార్!"

"చాల్లెండి! మీ అసమర్థతని కప్పి పుచ్చు కోవడానికి పులి తెలివైనదని ఎందుకు చెప్తారు? అది జంతువు. దాన్ని సరిగ్గా గుర్తించలేకపోవడం, దాన్ని పట్టుకోకపో వడం మీ తెలివితక్కువతనానికి నిదర్శ నం. అందుకే చెప్తున్నాను. దాన్ని కాల్చేసే ఆర్డర్ వేయండి"

అటవీ అధికారులను తెలివితక్కువ వాళ్ళన్నందుకు ఫారెస్టు ఆఫీసర్‌కు కోప

కొత్తగాలి... 

**పూర్వం చిత్తశుద్ధి**
**ప్రస్తుతం**
**చెత్తశుద్ధి కూడాను!**

*- గుడిమెట్ల గోపాలకృష్ణ,*
అరసవల్లి

మొచ్చినా తమాయించుకున్నాడు. ఇంత మంది ఎదురుగ్గా ఏమైనా నోరు జారితే అతని అహం దెబ్బతిని ఆ జర్నలిస్టుని చంపినట్టు తనని కూడా చంపేయగల దుర్మార్గుడని గుర్తొచ్చి గాయపడిన తన అహాన్ని బుజ్జగించుకున్నాడు. గొంతులో కోప ఛాయలేవీ లేకుండా జాగ్రత్త పడ్తూ "జాతీయ పులుల సంరక్షణ సంస్థ మార్గద ర్శకాల ప్రకారం ఎట్టి పరిస్థితుల్లోనూ పులుల్ని చంపకూడదు సార్! పులి మన జాతీయ జంతువు" అన్నాడు.

"అవునా నాకు తెలియదే!" అన్నాడు వ్యంగ్యంగా వంజారి. "మరి మన జాతీయ జంతువు మన జాతిని చంపొచ్చని చెప్పారా సదరు సంస్థవాళ్ళు? ఇవన్నీ నాకు తెలీవనుకోకండి. మీరు ఆ పులిని కాల్చి చంపే ఉత్తర్వులు తొందరగా తెప్పిం చండి. లేకపోతే నేను ఇక్కడే ఈ అడవి మధ్యలో నిరాహారదీక్షకు కూచుంటాను"

"మనిషి మాంసం రుచి మరిగిన పులి తిరుగుతోందని తెలిసీ ఈ అడవి మధ్యలో కూచోవటం ఎంత ప్రమాదమో ఆలోచిం చారా సార్ మీరు?" వంజారితో పాటు వచ్చిన మందీమార్బలంలోంచి ఒకడు గుర్తుచేశాడు.

"అందుకేగా ఇక్కడే బైఠాయిస్తాన న్నాను. నన్ను సంరక్షించాల్సిన బాధ్యత ఈ ఫారెస్టు ఆఫీసర్‌దే. నాకేమైనా నష్టం జరిగితే విదర్భ మొత్తం విధ్వంసం అయి పోతుందని తెలియనంత అమాయకు డంటావా ఈ ఆఫీసర్?" అన్నాడు వంజారి.

ఫారెస్టు ఆఫీసర్‌కి చెమటలు పట్టాయి. వెంటనే చీఫ్ వైల్డ్‌లైఫ్ వార్డెన్తో ఫోన్లో మాట్లాడి విషయం వివరించాడు. అతడి ఆదేశాల్ని అందుకుని వంజారితో "మా సార్ మిమల్ని రమ్మంటున్నారు. షూటింగ్ ఆర్డర్ ఇచ్చే అధికారం వారిదే కాబట్టి తమరెళ్ళి వారితో ముఖాముఖి మాట్లాడితే బావుంటుంది సార్!" అన్నాడు.

"నేనెందుకు అతని ఆఫీస్‌కి వెళ్ళాలి? అతన్నే ఇక్కడకు రమ్మనండి. ఇక్కడే అందరి సమక్షంలో మాటలు జరగాలి. ఇంతకుముందు రెండుసార్లు వెళ్ళి ఆయన్ని కలిసి వచ్చాను కదా! ప్రయోజనమేముం దని? అందుకే అతనేం చెప్పాలనుకున్నా నా ప్రజల ముందు చెప్పమనండి" అన్నాడు వంజారి.

ఈ లోపల అతని అనుచరుల్లో ఒకడు నేలమీద కండువా పరిచాడు. వంజారి దాని మీద బాసింపట్టు వేసుకుని కూచు న్నాడు. అతని వెనకే అనుచరులందరూ

# వేలెంటైన్స్ డే నిజాలు




ఏటా ఫిబ్రవరి 14ను వేలంటైన్స్ డేగా జరుపుకోవడం యూరప్‌లో మొదలైంది. నేడది మన దేశంలో కూడా ప్రేమికుల దినోత్సవంగా విస్తరించింది. వేలంటైన్స్ డేకు సంబంధించిన కొన్ని నిజాలు..

★ ఏటా 100 కోట్లకు పైగా వేలంటైన్స్ గ్రీటింగ్ కార్డులు ప్రపంచవ్యాప్తంగా పంపించుకుంటున్నారు. క్రిస్టమస్ తర్వాత గ్రీటింగ్ కార్డులు అధికంగా పంపించుకునే సందర్భం ఇదే.

★ వీటిలో 45 కోట్ల గ్రీటింగ్ కార్డులను ఒక్క అమెరికన్లే పంపుతున్నారు.

★ అమెరికాలో వేలంటైన్స్ డే రోజు ఎర్రటి ఒకే గులాబీని ఇచ్చే ఆచారం ఉంది. దీనికి సిగ్నేచర్ రోజ్ అని పేరు.

★ ఎర్ర గులాబీని వేలంటైన్స్ డేకి బహుమతిగా ఎన్నుకోవడానికి కారణాలు:

1. శృంగారభావాలకు ఎరుపు రంగు ప్రతీక.

2. రోమన్ ప్రణయదేవత వీనస్‌కి ఇష్టమైన పువ్వు ఎర్ర గులాబీ.

★ వేల్స్ నగరవాసులు వేలంటైన్స్ డే బహుమతిగా చెక్క చెంచాలను ఇస్తారు.

★ హృదయాకారంలో చేసిన చాక్లెట్లు, లేస్ అల్లిక చేతి రుమాళ్లు.. వేలంటైన్స్ డే బహుమతులుగా తర్వాతి స్థానాలను ఆక్రమిస్తాయి.

★ వేలంటైన్స్ డే ఐదో శతాబ్దంలో రోమ్‌లో నివసించిన సెయింట్ వేలంటైన్స్ అనే కేథలిక్ బిషప్ పేరున ప్రాచుర్యంలోకి వచ్చింది.



★ వేలంటైన్స్ డేని ప్రపంచవ్యాప్తంగా 34 దేశాల్లో జరుపుకుంటారు.

★ హాల్‌మార్క్ గ్రీటింగ్ కార్డు కంపెనీ ఆ రోజు కోసం 1330 రకాల గ్రీటింగ్ కార్డులను రూపొందించింది.

★ సర్ అలెగ్జాండర్ ఫ్లెమింగ్ ఫిబ్రవరి 14, 1929న సుఖరోగాలకు ఓ మందుగా పనిచేసే పెన్సిలిన్‌ను కనుగొన్నాడు.

కర్చీఫ్‌లూ, కండువాలూ కింద పర్చుకుని కూచుండిపోయారు.

ఫారెస్టు ఆఫీసర్‌కి కంగారు ఎక్కువైంది. ఛీఫ్‌వార్డెన్తో మళ్ళా ఫోన్లో మాట్లాడాడు "మీరు ఫోన్ ఎమ్మెల్యేగారికివ్వండి. నేను నచ్చచెప్తాను" అన్నాడు ఛీఫ్.

"సార్ మీతో మాట్లాడతారట! మాట్లాడండి!" అంటూ ఫోన్ని వంజారికి అందివ్వబోయాడు.

"నేను మాట్లాడనని చెప్పండి. ఆయనిక్కడికి వచ్చాకే ఏం మాట్లాడాలో మాట్లాడ్తానని చెప్పండి" అన్నాడు వంజారి.

"ప్లీజ్ సార్! ఒక్కసారి వారేం చెప్తారో వినండి. తర్వాత మీ ఇష్టం" అన్నాడు ఫారెస్టు ఆఫీసర్.

అయిష్టంగానే ఫోన్ అందుకుని "చెప్పండి" అన్నాడు వంజారి.

"జనాల ముందు మనం ఏం మాట్లాడుకున్నా రేపు మీడియాలో దానికి కొద్దిగా మసాలా దట్టించి మరీ ప్రత్యక్షమవుతుంది. ఎలక్షన్లు అతి సమీపంగా ఉన్నాయి. ఈ సమయంలో మనం బైట కలవడం అవసరమంటారా? మీరే ఆలోచించండి. నా ఆఫీస్‌లో అయితే మనిద్దరమే ఉంటాం. ఏది పత్రికల వాళ్ళకు చేరవేయాలో అదే చెప్పొచ్చు. ఏమంటారు? "

అన్నాడు ఛీఫ్‌వార్డెన్.

ఆ ఆలోచన వంజారికి బాగా నచ్చింది. పైకి మాత్రం అనుయాయుల్తో "ఛీఫ్‌వార్డెన్ బాగా బతిమాలుతున్నాడు ఈ ఒక్క సారికి వెళ్ళేసి వస్తాను. నేను ఫోన్ చేసి చెప్పేవరకు శవాన్ని కదిలించకండి" అనేసి బయల్దేరాడు.

మరికొన్ని గంటల తరువాత వంజారి ఛీఫ్‌వార్డెన్ ఆఫీసుకు చేరుకున్నాడు. "మీకేం సార్ ప్రజా ప్రతినిధులు! ఏం మాట్లాడినా చెల్లుబాటవుతుంది. మేం ఉద్యోగులం కదా! మాక్కొన్ని నియమాలూ నిబంధనలూ ఉంటాయి. పులిని పట్టుకునే ప్రయత్నాలు ఇంకా జరుగుతూనే ఉన్నాయిగా. కొద్దిగా ఓపిక పట్టండి. మావాళ్ళు

**కొత్తగాలి...**

**యువత తప్పిరిగి**
**కనులు తెరిచేసరికి**
**నిరాదరణకు గురైన పెద్దలు**
**కన్ను మూసేస్తారు**

**- తటవర్తి రామకృష్ణ,**
**తాళ్లగడ్డ, హైదరాబాద్**

దాన్ని సజీవంగా బంధించి తీరుతారు" అన్నాడు బాంగ్డియా.

"ప్రజల సహనానికీ కొన్ని పరిమితులుంటాయి ఆఫీసర్‌గారూ! ఆ పులి మనుషుల్ని ఇలా వరసగా పొట్టన పెట్టుకుంటుంటే చూస్తూ ఎలా ఉండమంటారు? మీవాళ్ళు దాన్ని సజీవంగా పట్టుకోవడానికి ఇన్ని రోజులుగా ప్రయత్నించి విఫలమయ్యారుగా. ఆ కారణం చాలనుకుంటాను దాన్ని షూట్‌చేయమని ఆర్డర్ వేయడానికి"

"దాన్ని సజీవంగా పట్టుకోవడం సాధ్యం కావడం లేదని రిపోర్టు ఇస్తే తప్ప, నేనా నిర్ణయాన్ని తీసుకోలేను"

"మీ సిబ్బందికి చెప్పండి అలా ఓ రిపోర్టు తయారుచేసి ఇమ్మని"

"అలా చెప్తే నా కింద పన్చేసే ఉద్యోగులకు నేను పలచనైపోనా? నా హోదా దానికి అడ్డొస్తోంది సార్! సారీ అలా చేయలేను"

"మీరలా అంటే ఎలా చెప్పండి? ఏదో ఒక పరిష్కారం చూపిస్తారన్న ఆశతో కదా వచ్చాను. వచ్చే ఎన్నికల్లో నేను తప్పకుండా గెలవాలి కదా! తర్వాత అటవీశాఖకు మంత్రినై మీలాంటి వాళ్ళు చేసిన సాయానికి రుణం తీర్చుకోవాలి కదా! ప్రజలందరూ ఆ పులిని కాల్చి చంపే ఉత్తర్వులు తెస్తానని వేయికళ్ళతో ఎదురు చూస్తున్నారు. నేనిపుడు ఉత్త చేతుల్తో తిరిగి వెళ్తే నాకు ఓట్లు వేస్తారా వాళ్ళు? మొహం మీద ఉమ్మేస్తారు కానీ.."

వంజారి విసిరిన గాలానికి బాంగ్డియా అతుక్కుపోయాడు. వంజారి ఎన్నికల్లో గెలిచి అటవీశాఖకు మంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తే ఐదేళ్ళ వరకు తన పబ్బం గడుపుకోవచ్చు. ఇపుడు తను చేసే సాయాన్ని అడ్డుపెట్టుకుని ప్రమోషన్లు కొట్టేయవచ్చు. తనక్కావల్సిన చోటికి ట్రాన్స్‌ఫర్లు చేయించుకోవచ్చు. మంత్రిగారు తనకు సన్నిహితుడని తెలిస్తే డిపార్ట్‌మెంట్లో తన పలుకుబడి పెరుగుతుంది. ఇటువంటి మహదవకాశాన్ని వదులుకోదల్చుకోలేదు ఆయన. అందుకే బాగా ఆలోచించి వంజారికో పరిష్కారమార్గాన్ని సూచించాడు.

"ఈ రోజు పులివాత పడ్డ అమ్మాయితో కలిపి ఏడుగుర్ని ఆ పులి చంపేసింది కాబట్టి ఓ వారం లోపల పులిని సజీవంగా పట్టుకునే ప్రయత్నం చేయాలనీ, ఒకవేళ వారం లోపల అది సాధ్యపడకపోతే దాన్ని షూట్ చేసేయమని ఆర్డర్ వేస్తాను. ఉభయతారకంగా పనిచేస్తుంది. ఏమంటారు? " అన్నాడు బాంగ్డియా.

"బావుంది! ఈ వారంలో ఓవేళ పులిని పట్టుకునే అవకాశం వచ్చినా వదిలేయమని చెప్పండి. వారం తర్వాత దాన్ని కాల్చేసి, దాని వెనక నిలబడి మీ సిబ్బందిని ఫొటో దిగమనండి. బ్రిటీష్ హయాంలో దొరలు వేటకెళ్ళి పులిని చంపాక దానివెనక తుపాకీ పట్టుకుని ఫోజులిచ్చి నిలబడేవారు గుర్తుందా? " అంటూ నవ్వాడు వంజారి.

"పులిని చంపడమే తప్పంటుంటే అదేదో ఘనకార్యంలా ఫొటోలు కూడా దిగాలా? మరీ తప్పవుతుంది కదా సార్!" అన్నాడు బాంగ్డియా.

"మొన్న పేపర్లో మీరు చూళ్ళేదా? తమిళనాడులో మాన్ ఈటర్‌గా మారిన పులిని చంపి ఆ టీం అంతా దానివెనక ఫోజులిచ్చి నిలబడ్డారు"

బాంగ్డియా కూడా పేపర్లో ఆ వార్తని చూశాడు. వాళ్ళు చేసింది తప్పని తెలిసినా తన తోటి అటవీ అధికార్లని వేలెత్తి చూపడం ఇష్టంలేక దాని విషయంలో గమ్మునుండిపోయాడు.

తర్వాత "సార్! ఇప్పటికైనా మీ వాళ్ళకు ఫోన్‌చేసి చెప్పండి. శవాన్ని మార్చురీకి తరలించే విషయంలో అడ్డుపడొద్దని చెప్పండి ప్లీజ్! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. మా సిబ్బంది కూడా నా అనుమతి కోసం ఎదురుచూస్తున్నారు" అన్నాడు.

వంజారి ఫోన్ చేసి అడవిలో ఉన్న తన అనుయాయుల్తో మాట్లాడాడు.

★ ★ ★

వారం లోపల పులిని పట్టుకుని తీరాలనీ, ఆ పనిలో సాయపడాల్సిందిగా వైల్డ్ లైఫ్ ట్రస్ట్ సభ్యుల సహకారాన్ని కోరుతున్నామనీ అటవీశాఖ నుంచి ఉత్తరం అందడంతో గుంజన్ని ఆ పనికి పురమాయించారు.

వారం లోపల పులిని బంధించలేకపోతే దాన్ని షూట్ చేయమని ఉత్తర్వులున్న సంగతి తెలిసిన క్షణం నుంచీ గుంజన్ వ్యాకులపాటుకు లోనవుతున్నాడు. వైల్డ్ లైఫ్ ట్రస్ట్‌లో పనిచేయడం ప్రారంభించినప్పటి నుంచి అతడి దృక్పథంలో సమూలమైన మార్పువచ్చింది. మనుషుల్ని వేటాడ్డం పులుల స్వాభావిక లక్షణం కాదు. మనుషుల రక్తం రుచి మరిగిన పులి మనుషుల్ని తప్ప జంతువుల్ని వేటాడ్డంలో ఆసక్తి చూపదనే మాట కూడా అపోహ మాత్రమే.

రెండు సందర్భాలలో మాత్రమే పులి మాన్ ఈటర్‌గా మారుతుంది. అది జంతువుని వేటాడాలంటే ఆ జంతువుకన్నా వేగంగా పరుగుత్తాలి. దాంతో కలబడి దాని గొంతుని దొరకబుచ్చుకోవాలి. దాన్ని చంపాక నోటితో పట్టుకుని ఈడ్చుకుపోవాల్సి వస్తుంది. ఈ చర్యలన్నిటికీ బలం అవసరం. పులి ముసలిదైపోయాక ఇవన్నీ చేయడానికి సరిపడా శక్తి ఉండదు. దంతాలు కూడా బలహీనపడి ఉంటాయి. అటువంటప్పుడు పులి మనుషుల్ని చంపడానికి అలవాటు పడుతుంది. ఒంటరిగా ఉండే మనుషుల మీద దాడి చేస్తుంది. చాటున పొంచి ఉండి ఒక్కసారిగా దాడి చేయడం వల్ల మనిషి సులభంగా దొరికిపోతాడు.

కొన్ని కారణాల వల్ల పులి గాయపడి వేటాడటానికి పనికి రాకుండా పోతుంది. ప్రమాదవశాత్తు దాని కోరలు విరిగిపోవచ్చు. దాని పంజాలకు గాయాలు కావొచ్చు. ముఖ్యంగా ముళ్ళపందితో తలపడినప్పుడు పులి నోట్లో దాని ముళ్ళు గుచ్చుకునిపోయి పుండ్లుగా మారటం వల్ల అది అశక్తురాలై మనుషులను వేటాడుతుంది. అంటే గత్యంతరం లేని పరిస్థితుల్లో మాత్రమే పులి మనిషి మీద దాడి చేస్తుంది తప్ప మనిషి మాంసం రుచి మరిగి కాదు.

ఇప్పుడీ పులి కూడా ఏవో కారణాలతో మాన్ ఈటర్‌గా మారి ఉంటుంది కాబట్టి, దాన్ని వారం లోపల పట్టుకుని అటవీశాఖ అధికార్లకు అప్పగించాలని బలంగా నిర్ణ యించుకున్నాడు గుంజన్.

★ ★ ★

నవంబరు నెల.. రాత్రి పది గంటలస మయం.. చలి మెలమెల్లగా తన ప్రతా పాన్ని చూపించడం మొదలెట్టింది. దట్టంగా ఉన్న చెట్ల ఆకుల్ని దుప్పటిగా కప్పుకుని ముడుచుకుని కూచున్నాడు గుంజన్. అతనికి తోడుగా మరో నలు గురు మనుషులు వేర్వేరు కొమ్మల మీద కాచుకుని కూచున్నారు. ఆ చెట్టుకి పదడు గుల దూరంలో ఉన్న మరో చెట్టుకి కట్టే సిన మేకపిల్ల భయంతో అరుస్తున్న అరు పులు తప్ప మరే శబ్దమూ విన్పించడం లేదు. ఆ చెట్టుకి చుట్టూ వృత్తాకారంలో స్టీల్ ట్రాప్స్‌ని అమర్చి వాటి మీద ఆకులు కప్పి ఉంచారు. పులి మేకపిల్లని సమీపిం చాలంటే స్టీల్ ట్రాప్స్‌ని దాటుకుని వెళ్ళా ల్సిందే. ఆ ట్రాప్స్ అన్నీ కాలితోపాటు శరీ రాన్ని కూడా కదలకుండా బంధించే రకానివి.

మరో గంట ఎదురుచూశాక ఆకులు నలుగుతున్న శబ్దం మంద్రంగా విన్పించి అందరూ అప్రమత్తమై కూచున్నారు. పులి ట్రాప్‌లో పడగానే తమ చేతుల్లో ఉన్న గన్స్‌తో మత్తు కలిగించే ఇంజక్షన్లు విసర డానికి ఇద్దరు తయారుగా ఉన్నారు. ఏదో జంతువు సమీపిస్తున్న శబ్దం ఇపుడు స్పష్టంగా విన్పిస్తోంది. రాబోతున్న ప్రమా దాన్ని పసిగట్టిందో ఏమో మేకపిల్ల, ప్రాణ భయంతో అరుస్తూ గింజుకోసాగింది.

వెన్నెల జలపాతంలా నేల మీదకు ఉరు కుతున్నట్లు మురిపిస్తోంది.. స్పష్టంగా అన్నీ కన్పిస్తున్నా గుంజన్ కళ్ళని విప్పార్చి పొదల్లోకి చూస్తున్నాడు. వస్తున్న జంతువు పులేనా? ఒకవేళ పులే అయితే తాము వెతుకుతున్న మాన్ ఈటర్ ఈ పులేనా? అనే ఆలోచన..

పులి బాగా ధైర్యమున్న జంతువు. చిరు తలా పిరికిది కాదు. అందుకే మాము లుగా పగటిపూట కానీ సాయంత్రాల్లో గానీ వేటాడుతుంది. దాని కనుగుడ్లు పిల్లి కనుగుడ్లలా చీలి ఉండవు. గుండ్రంగా ఉంటాయి. అయినా చీకట్లో అది మనిషి కన్నా ఆరింతలు స్పష్టంగా చూడగలు గుతుంది. అందుకే అందరూ శబ్దం చేయ కుండా వూపిరి బిగపట్టి కూచున్నారు.

ఇప్పుడు పులి పొదల్లోంచి బైటికొచ్చి కన్పిస్తోంది. అది మేకని కట్టి ఉన్న చెట్టు వైపుకి మెల్లగా నడుస్తోంది. నడుస్తూనే తన ఇరువైపులా పరిసరాల్ని జాగ్రత్తగా చూసుకుంటూ అడుగులు వేస్తోంది. ట్రాప్స్ ఉన్న చోటుకు నాలుగడుగుల దూరంలో నిలబడి మేకపిల్లవైపు చూసి, మరో అడుగు ముందుకేసింది.

గుంజన్ ఆ పులిని జాగ్రత్తగా పరిశీలిం చాడు. రెండూ రెండున్నరేళ్ళ వయసున్న మగ పులి. దాని పాదముద్రల్ని చూసి పులి గురించి తను ఏం చెప్పాడో అది అలాగే ఉంది. దాదాపు తను వూహించి నంత బరువే ఉంటుందనుకున్నాడు. గుంజన్ ఏ పులిని చూసినా దాని చారల్ని బాగా గుర్తుపెట్టుకుంటాడు. చారల అమ రికను బట్టే పులిని మరో పులి నుంచి వేరుగా గుర్తిస్తారు. ఆ చారల్ని చూడగానే తను ఈ పులిని ఇంతకు ముందు కూడా చూసినట్టు అతడికి గుర్తొచ్చింది.. చూశాడు. తనకు బాగా గుర్తు ఆ చారలు.. ఎక్కడ చూశాడు? ఎప్పుడు చూశాడు? తీవ్రంగా ఆలోచిస్తూనే పులి కదలికల్ని గమనిస్తున్నాడు.

పులి మరో అడుగు ముందుకేయటం ఆలస్యం మత్తుసూదుల్ని షూట్ చేయడా నికి తయారుగా ఉన్న అటవీ సిబ్బంది ఇద్దరిలోంచి ఒకతను కదిలాడు. దాంతో

అతను కూచున్న కొమ్మ చిన్నశబ్దం చేస్తూ కదిలింది.

పులి ఆగిపోయింది. తల తిప్పి రెండు వైపులా పరికించి చూసింది. మళ్ళా మేక పిల్లవైపు ఆకలిగా చూసింది. ముందుకెళ్ళాలా? వద్దా? అనే సందిగ్ధంలో ఓ నిమిషం అక్కడే నిలబడిపోయింది. చెట్టు మీద కూచుని ఉన్న వాళ్ళకు ఏం చేయాలో అర్థం కావటంలేదు. అది ముందుకు కదిలేవరకు ఆగాలా? లేక అది స్థిరంగా నిలబడి ఉంది కాబట్టి తమ చేతుల్లో ఉన్న గన్స్‌తో మత్తు సూదుల్ని షూట్ చేయాలా? పులి తల తిప్పి తను వచ్చిన పొదవైపు చూసింది. మరుక్షణం వెనక్కి తిరిగి పొదవైపుకి పరుగెత్తడం మొదలెట్టింది.

"షూట్!" అని అరిచాడు అటవీ సిబ్బందిలోంచి ఒకతను.

మత్తు కలిగించే డార్ట్‌లను ఇద్దరూ ఒకేసారి వదిలారు. ఒకటి పులి వీపుని రాసు



కుంటూ వెళ్ళి కింద పడింది. మరొకటి దాని కాళ్ళకు కొద్ది దూరంలో పడింది. పులి మరింత వేగంగా పరుగు లంకించుకుంది. కళ్ళు మూసి తెరిచే లోపల పులి పొదల్లో మాయమైపోయింది.

"ఇప్పుడేం చేద్దాం? " అని అడిగాడొకడు.

"మనం ఆ పొదల్లోకి వెళ్ళి వెదుకుదాం. అది ఎక్కువ దూరం వెళ్ళి ఉండదు. సులభంగా దొరుకుతుంది" అన్నాడు మరొకడు.

"వద్దు! అది చాలా ప్రమాదం. మనకు దాన్ని చంపే అధికారం లేదు. మనం దానికి మత్తు కలిగేలా చేసేలోపల అది మనమీద దాడి చేయవచ్చు అది పొదల్లో మన కోసం కాచుకుని ఉంటుందని నా ఉద్దేశం. ఈ సమయంలో మనం చెట్టు దిగడం మంచిది కాదు. ఉదయం మరికొంత మందిని తోడు తీసుకుని దాని కోసం వెదుకుదాం" అన్నాడు గుంజన్. అందరికీ ఆ సలహా సరైందని తోచి మిగతా రాత్రిని చెట్టుమీద గడపడానికే నిర్ణయించుకున్నారు.

ఉదయం పదింటికి మరికొంత మందిని కలుపుకుని మొత్తం ఓ డజను మంది పులిని వెదుకుతూ బయల్దేరారు. పొదల దగ్గర జాగ్రత్తగా మసలుతూ ఆ బృందం ముందుకు కదుల్తోంది. గుంజన్ షికారీలా పులి పాదముద్రల్ని గమనిస్తూ దారిచూపుతున్నాడు. రాత్రి నిద్ర లేనందువల్ల కళ్ళు మండుతున్నాయి. మనసు మాత్రం ఆ పులిని ఎక్కడ చూశాననే విషయం గురించే ఆలోచిస్తోంది.

ఫారెస్టు గార్డులలో ఒకడు ఉదయం నుంచీ చిరాకు పడ్తూ విసుక్కుంటూనే ఉన్నాడు.

"ఏమిటి నీ సమస్య? అంత కష్టంగా ఉంటే పన్లోకి రాలేనని ఆఫీసర్ గారికి చెప్పి ఉండొచ్చుగా" అన్నాడు అసిస్టెంట్ రేంజర్.

"మన కష్టాలు ఆఫీసర్లకేం పడతాయి? వాళ్ళక్కావల్సింది పని జరగటం. మనం ఎలా చస్తే వాళ్ళకేంటి? సెలవు కావాలి మొర్రో అన్నా విన్పించుకోలేదు"

"ఆరోగ్యం బాగోలేదా? "

"నాకేమైంది? దుక్కలా ఉన్నాను. మా పాపకు జ్వరం. పుట్టి వారం కూడా కాలేదు. దాన్ని డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాలా? వద్దా? నేనేదో సాకు చెప్తున్నాననుకున్నాడు. మా పాపకు ఎలా ఉందో? ఏంటో? అన్న ఆలోచన తప్ప పులి గురించిన ధ్యాసే రావడం లేదంటే నమ్మండి" అన్నాడతడు.

గుంజన్‌కి వెంటనే తను ఆ పులిని ఎప్పుడు, ఎక్కడ చూశాడో గుర్తొచ్చింది. తను చంపిన ఆడ పులి.. దాన్ని దూరంగా నిలబడి చూసిన దాని రెండు పిల్లలు.. వాటి చారలు చూసి తను ఆశ్చర్యపోయాడు. మనిషి వేలిముద్రల్లా ఏ పులి చారలూ, మరో పులి చారల్తో కలవవు. కానీ ఆ రెండు పులిపిల్లల చారలు ఒకేలా ఉండటంతో మరింత పరిశీలనగా చూశాడు. ఒక పులిపిల్లకు ముందటి కాళ్ళలో కుడి తొడ మీద అంగుళం పొడవున బొట్టు పెట్టినట్టు ఓ నల్లచార ఉంది. అలాంటి చార మరో పులిపిల్లకు లేదు. అంతే తేడా! అది తప్ప మిగితా చారలన్నీ అచ్చుగుద్దినట్టు కవల పిల్లల ముఖ కవళికల్లా ఒకేలా ఉన్నాయి.

ఈ పులి, ఆ పులిపిల్లల్లో ఒకటి. దీనికి కుడితొడ మీద పుట్టుమచ్చలా నల్లటి చార ఉంది. దీంతో పాటు తప్పకుండా మరో పులి కూడా ఈ అడవిలో తిరుగాడుతూ ఉండాలి. రెండు మగ పులులు ఒకేచోట ఉండే అవకాశం లేదు. మగపులి తన స్థావరాన్ని విస్తరించుకునే క్రమంలో మరో మగపులి కన్పిస్తే దాంతో పోరాడి తరిమికొడ్తుంది. లేదా తనైనా వేరే స్థావరాన్ని వెతుక్కుంటూ పారిపోతుంది.

# రంగులకి కారణాలు

చతుర సమాచారం

కొన్ని వస్తువులు ఆయా రంగుల్లోనే ఉండడానికి కారణాలు..

★ సాకర్(ఫుట్ బాల్) బాల్ నలుపు తెలుపు రంగులోనే ఉంటుంది. 1970లో మెక్సికో నించి వరల్డ్ కప్ ఫుట్ బాల్ గేమ్‌ని మొదటిసారి టెలికాస్ట్ చేసేప్పుడు అడిడాస్ కంపెనీ, నలుపు తెలుపు బంతులను తయారుచేసింది. ఒకేరంగు కంటె నలుపు తెలుపుల్లో బంతి టీవీ స్క్రీన్‌పై స్పష్టంగా కనిపిస్తుందని బంతులని ఆ రంగుల్లో తయారు చేసేది.



★ యుద్ధంలో లొంగిపోయినప్పుడు వాడే జెండా తెలుపు. ఇది శాంతి చిహ్నమని నమ్ముతారంతా. కానీ తెల్లజెండా ఏ బ్యాక్‌గ్రౌండ్‌లోనైనా స్పష్టంగా కనిపిస్తుంది. సైనికులు, సివిలియన్స్ దగ్గర ఈ రంగు రుమాళ్లు తప్పనిసరిగా ఉంటాయి.

★ ట్యాక్సీ పసుపు రంగులో ఉండటానికి కారణం, రాక్‌వెల్ కేబ్ కంపెనీ 1907లో ఆల్బర్ట్ రాక్‌వెల్, కనెక్టికట్‌లో ట్యాక్సీల కంపెనీని ప్రారంభించినప్పుడు అతని భార్య వాటికి పసుపుపచ్చ రంగు వేయమని సూచించింది. దాన్నే అంతా ఈ రోజుకీ వాడుతున్నారు.

★ బబుల్‌గమ్ పింక్ రంగులోనే ఉండడానికి కారణం, ఫ్లేర్ చూయింగ్‌గమ్ కంపెనీ అందుబాటులో ఉన్న పింక్ రంగునే వాడటం. అదే కొనసాగుతోంది.

★ అమెరికన్ డాలర్స్ ఆకుపచ్చ రంగులోనే ఉంటాయి. కారణం ఆ రంగు వెలవదని అనుకుంటారు. కానీ అప్పట్లో ఆకుపచ్చరంగే దొరకటంతో వాడారు. మొదటగా 1929లో ఆకుపచ్చ రంగులో డాలర్ నోట్లని యు.ఎస్ బ్యూరో ఆఫ్ ఎన్‌గ్రేవింగ్ అండ్ ప్రింటింగ్ అచ్చువేసింది.

★ కరాటేలో బ్లాక్‌బెల్ట్ ఎందుకు చివరిది? అంటే విద్యార్థి ఒక్కో క్లాస్ ఉత్తీర్ణుడైనప్పుడల్లా అతని బెల్ట్‌కి ముదురు రంగు వేయడమే కారణం. తెలుపు, పసుపు, ఆరెంజ్, ఆకుపచ్చ, నీలం, పర్పుల్, బ్రౌన్, ఎరుపు చివరగా నలుపు ఒకదానిమీద ఒకటి తేలిగ్గా పట్టుకుంటాయి కాబట్టి తొమ్మిది రంగుల బెల్ట్‌లు ఆ క్రమంలో వాడారు.

★ బుల్ ఫైటర్స్ ఎర్ర బట్టని వాడడానికి కారణం ఎద్దు ఆ రంగుని గుర్తుపడుతుందని అనుకుంటారు.. అసలు కారణం రక్తం చిందినా కనబడదని.

తను ఆడపులిని నరికి చంపినపుడు ఆ రెండు పులిపిల్లలు తన వైపు కోపంగా చూసినట్టు గుర్తుకొచ్చింది. అందులో ఒకటి ఇప్పుడు మాన్ ఈటర్‌గా మారింది. పులి పగబడ్తుందా? పులికంత జ్ఞాపక శక్తి ఉంటుందా? నిన్న రాత్రి పులి ఎందుకు వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది? ట్రాప్‌లు ఉన్న విషయం పసిగట్టిందా? లేదు. అటువంటి అవకాశం లేదు. తన ఇన్నాళ్ళ అనుభవంలో పులి ట్రాప్‌ని పసిగట్టడం అనేది జరగలేదు. మరి ఎందుకది పొదల్లోకి పారిపోయింది?

గుంజన్‌కి తన అయ్యా పోచగె చెప్పిన విషయాలు గుర్తొచ్చాయి. పులికి మనిషి కన్నా జ్ఞాపకశక్తి ముప్ఫయిరెట్లు ఎక్కువ. వేటాడేటప్పుడు గొడ్లమందలో ఒకే ఒక గొడ్డుని ఎన్నుకుంటుంది పులి. ఆ గొడ్డు కోసమే ప్రయత్నిస్తుంది. అది తప్పించుకునిపోయాక మరోగొడ్డు తనకు సమీపంగా ఉన్నా దాని జోలికి పోదు. తను ఎన్నుకున్న గొడ్డుని గాయపర్చాక అది పారిపోతే దాన్ని వెతుక్కుంటూ జనావాసాల్లోకి దూరి అదే గొడ్డుమీద దాడి చేసిన సంఘటనలు కూడా ఉన్నాయి.

గుంజన్ మనసులో సన్నటి అనుమానమేదో బయల్దేరి అది బలపడసాగింది.

పులి తన వాసన పసిగట్టి, ప్రమాదం శంకించి పారిపోయిందా? కుక్కలకు మల్లే పులులు కుడా వాసనల్ని బట్టి మనుషుల్ని గుర్తిస్తాయా? ఇప్పుడా పులి తనని చంప డానికి ప్రయత్నిస్తుందా?

అప్పటికి రెండున్నర గంటల నుంచి పులికోసం వెతుకుతున్నా, దాని జాడ తెలి యడం లేదు. ముందుకు నడుస్తున్న గుంజన్‌కి మనసులో మరో ఆలోచన మెది లింది. బహుశా ఆ పులి ఏ పొదల చాటునో ఉండి తమని గమనిస్తూ ఉందే మోనని..

గుంజన్ వెనక్కి తిరిగి చూసుకుంటూ ముందుకు నడుస్తున్నాడు. ఇపుడు పాద ముద్రలేవీ కన్పించడం లేదు. అందుకే రెండు గ్రూపులుగా విడిపోయి వెతకడం మొదలెట్టారు. గుంజన్‌కి తన వెనక ఎవరో నడుస్తున్నట్టు.. తనని నీడలా వెంటాడుతున్నట్టు అన్పించింది. ఆ పులి తన మీద దాడి చేయడానికి అనువైన సమయం కోసం కాచుకుని ఉందా?

గుంజన్ మళ్ళా వెనక్కి తిరిగి చూశాడు. ఎక్కడో పొదల్లో చిన్న కదలిక.. ఆగి పోయి రెండడుగులు వెనక్కి వేశాడు. అత న్తోపాటు మిగతావాళ్ళు కూడా అతన్ని అనుసరించారు. మళ్ళా పొదలో కదలిక..

“అక్కడ పులి ఉన్నట్టుంది” అన్నాడు గుంజన్ అటవీ సిబ్బందితో.

డార్ట్‌గన్స్ పట్టుకుని ఉన్న సిబ్బంది మరికొంత ముందుకెళ్ళి పొదని టార్గెట్ చేస్తూ గన్స్ పేల్చారు. పొదలోంచి పులి ఓ గెంతు గెంతి వెనక ఉన్న చెట్లలోకి పారిపోయింది. గుంజన్తోపాటు మిగతా వాళ్ళు దాని వెంటపడి కొంతదూరం వెళ్ళాక పులి ఎటువైపుకెళ్ళిందో కన్పించక ఆగిపోయారు.

“మనం దాన్ని వెంటాడుతున్నట్టు తెలిసి పోయింది కాబట్టి ఇప్పుడు దాన్ని వెతకడం కష్టం. రేపు మళ్ళా ప్రయత్నిద్దాం” అన్నాడు గుంజన్.

వాళ్ళతో అలా అన్నాడే కాని మనసులో మాత్రం ‘మనం దాన్ని వెంటాడటం కాదు.. అదే మనల్ని వెంటాడుతోంది’ అనుకున్నాడు.




పులిని సజీవంగా పట్టుకోడానికి విధిం చిన గడువులో అదే ఆఖరిరోజు. ఆ రోజు రెండు గ్రూపులుగా చీలిపోయి వెతకడానికి నిర్ణయించుకున్నారు. ఒక్కో గ్రూపులో ఇద్ద రేసి అసిస్టెంట్ రేంజర్లు, నలుగురు గార్డులు, ఇద్దరు వెటర్నరీ సిబ్బంది ఉన్నారు. గుంజన్‌కి పట్టుదల పెరిగింది. తన అనుభవంలో పులిని పట్టుకోడానికి ఎప్పుడూ ఇంత శ్రమపడలేదు. పగతో రగి లిపోయే పులి మరింత ప్రమాదకరమని తెలుసు. అయినప్పటికీ దాన్ని కాల్చి చంపడం అతనికి సుతరామూ ఇష్టంలేదు. అందుకే ఎలాగైనాసరే ఆ రోజు పులిని పట్టుకుని తీరాలని నిర్ణయించుకున్నాడు.

పులి విశ్రమించడానికి అనుకూలంగా ఉన్న ప్రదేశాల్ని ఒకటొకటిగా వెతు క్కుంటూ ముందుకెళ్తున్నాడు గుంజన్. ప్రతిచోట దాని పాద ముద్రల కోసం నిశి తంగా పరిశీలిస్తున్నాడు. అది రాత్రుళ్ళు ఏ పొదలో పడుకుంటుందో తెలిస్తే చాలు దాన్ని పట్టడం సులభమైపోతుంది. ఎంత వెతికినా దాని జాడలు తెలియలేదు.

వాళ్ళాక నీటి చెలమని సమీపించారు.

అక్షరం

ఎదుటివారిని చూసి
ప్రేమ పూర్వకంగా నవ్వగలిగితే
అదే వారికి నువ్విచ్చే
అందమైన బహుమతి

– మదర్ థెరిసా



పులి ఒక చెరువులో నీళ్ళు తాగడానికి అల వాటుపడితే ప్రతిరోజూ తప్పకుండా అక్కడికే వచ్చి నీళ్ళు తాగుతుంది.

"దీని చుట్టూతా వెదుకుదాం. పులి కాలి గుర్తులు కన్పిస్తాయేమో చూద్దాం" అన్నాడు గుంజన్, మిగతావాళ్ళని ఉద్దేశించి.

అందరూ చెరువు చుట్టూ వెదకడం మొదలెట్టారు. ఒక అసిస్టెంట్ రేంజర్ "ఇక్కడున్నాయి" అంటూ పెద్దగా అరిచాడు.

అందరూ గుంపుగా చేరి అతను చూపిస్తున్నవైపు చూశారు. చెరువు గట్టున బురదలో స్పష్టంగా జంతువు పాదముద్రలు కన్పిస్తున్నాయి. అవి అలా సాగి పలచబడి కన్పించకుండా పోయాయి.

గుంజన్ ఇంకొంత ముందుకెళ్ళి చూశాడు. దూరంగా, దట్టంగా పెరిగిన పొదలు కన్పిస్తున్నాయి. బహుశా పులి అటువైపు నుంచి వచ్చి ఈ చెరువులో నీళ్ళు తాగి, మళ్ళా వెనక్కి పొదల్లోకి వెళ్తూ ఉండొచ్చని వూహించాడు. ఎందుకైనా మంచిదని తన దగ్గరున్న పులి కాలి గుర్తులు ట్రేస్ గీసిన కాగితం బైటకు తీసి, వాటితో నేల మీద కన్పిస్తున్న కాలి గుర్తుల్ని పోల్చిచూశాడు. అవి రెండూ కచ్చితంగా సరిపోలి ఉండటంతో తాము వెతుకుతున్న పులికి సంబంధించిన కాలిగుర్తులు ఇవేనని నిర్ధారణకు వచ్చాడు.

"ఇక్కడ చూశారా? గడ్డి రెండు మూడు చోట్ల నలిగిపోయి ఉంది. పులి ఈ దోవనే వచ్చే అవకాశం ఎక్కువ. మనం ఈ గడ్డిలో ట్రాప్‌లు అమర్చుదాం. చీకటి పడే లోపల ఆ పులి తప్పకుండా నీళ్ళు తాగడానికి ఇటువైపు నుంచి వస్తుంది. చెరువుకు ఆ వైపున పెద్ద పెద్ద చెట్లు కన్పిస్తున్నాయి చూశారా? మనం వాటిలో దాక్కుని పొంచి ఉందాం. పులి ఒకవేళ ట్రాప్‌లను తప్పించుకుని వచ్చి నీళ్ళు తాగుతుంటే మత్తుమందు కలిపిన డార్ట్‌లను వాడి దాన్ని స్పృహ తప్పేలా చేద్దాం! ఏమంటారు? " అన్నాడు గుంజన్.

అందరూ అతని ఆలోచన బాగుందని ఒప్పుకున్నారు.

గడ్డి నలిగి ఉన్నచోటులో మూడు ట్రాప్‌లను అమర్చి వాటిని పచ్చగడ్డితో కప్పేశారు. చెరువుకు మరోవైపున్న చెట్లలో గుబురుగా ఉన్న రెంటిని ఎన్నుకుని వాటి కొమ్మల్లో నక్కికూచున్నారు. రెండు గంటలు.. మూడు గంటలు.. నాలుగు గంటలు.. పులి జాడ కన్పించలేదు. మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. ఆకలి పులిలా పేగుల్ని తినేస్తోంది. ఆహారం కోసం దిగితే పులి అదే సమయంలో వస్తే తమ పథకం మొత్తం వృథా అవుతుందన్న భయం.. పులిని పట్టుకోడానికి అవసరమైన ఓపికా సహనం వాళ్ళందరిలో ఉండబట్టి విసుగుచెందకుండా ఎదురుచూస్తూ కూచున్నారు.

మధ్యాహ్నం మూడు గంటల సమయం.. ఎండ విపరీతంగా ఉంది. ఆకలి వల్ల నిస్సత్తువ అవరిస్తోంది. తినే పదార్థాలేవీ వెంట తెచ్చుకోకుండా పొరపాటు చేశామని గ్రహించారు. దిగిపోతే చాలు రకరకాల పళ్ళు సమృద్ధిగా దొరికే చెట్లున్నాయి కాబట్టి కోసుకు తినొచ్చు.

మరో గంట చూసి దిగిపోదామని చెప్పాడు గుంజన్. కళ్ళని చెరువుకవతల కన్పిస్తున్న పొదలకు అతికించి కూచున్నారు. పావుగంట సమయం భారంగా గడిచింది.

దూరంగా పులి వస్తూ కన్పించింది. అందరూ అప్రమత్తమయ్యారు. పులి మెల్లగా నడుస్తూ వస్తోంది. దాని నడకలో రాజసం.. అడుగుల్లో హుందాతనం.. కళ్ళు వజ్రాల్లా మెరుస్తున్నాయి. అది ఇరువైపులా చూసుకుంటూ జాగ్రత్తగా అడుగు లేస్తోంది.

అందరూ వూపిరి బిగపట్టి చూస్తున్నారు. పులి ట్రాప్ ఉన్నవైపుకే నడుస్తోంది. ఇంకో నాలుగడుగులు.. అంతే దాని కాళ్ళకు ట్రాప్ చుట్టుకుపోయి కదలకుండా బంధించడం ఖాయం. ఒకడుగు.. రెండడుగులు.. మూడో అడుగు పడింది. ఇంక ఒకే ఒక్క అడుగు.. మత్తుమందున్న డార్ట్‌లను పులివైపు గురిపెట్టి ట్రిగ్గర్ మీద వేలు బిగించారు.

పులి అడుగు ముందుకేసింది. అది ట్రాప్‌ని దాటుకుని ఓ అంగుళం అవతలకు పడింది. అందరిలో నిరాశ! వెంటనే మళ్ళా ఉత్కంఠ! వెనక కాళ్ళలో ఏదైనా ట్రాప్‌లో చిక్కుకోవచ్చన్న ఆశ! పులి ట్రాప్‌కి చిక్కకుండా చెరువుని సమీపించింది. ముందటి రెండు కాళ్ళని నీళ్ళలో పెట్టి నీళ్ళు తాగుతున్నప్పుడు డార్ట్‌లు ప్రయోగించారు. ఒకటి పులికి కొద్దిదూరంలో శబ్దం చేస్తూ నీళ్ళలో పడిపోయింది. మరో డార్ట్ అవతల పడింది. పులి వెంటనే వెనక్కి తిరిగి ట్రాప్‌లున్న దారిలో కాకుండా మరోవైపుకు పరుగు లంకించుకుంది.

"ఇపుడేం చేద్దాం? " కిందికి దిగాక ఓ అసిస్టెంట్ రేంజర్ అడిగాడు.

"ఇపుడు దాని వెంటపడటం వల్ల పెద్దగా ప్రయోజనం ఉంటుందనుకోను. రేపటి నుంచి దాన్ని షూట్ చేయొచ్చని కదా ఆర్డర్. ఇలా సజీవంగా పట్టుకోడానికి ప్రయత్నించడం కన్నా కాల్చిచంపడం సులభం. ఇపుడు ఇళ్ళకెళ్ళిపోదాం. రేపు షూటర్లతోపాటు వద్దాం" అన్నాడు మరో అసిస్టెంట్ రేంజర్.

"చీకటి పడడానికింకా సమయం ఉందిగా! చివరిసారిగా మరో ప్రయత్నం చేద్దాం" అన్నాడు గుంజన్.

"ఇంకా చేయడానికేముంది? "

"ఈ సీజన్‌లోనేగా పులులు సంగమించేది. మనం వేటాడుతోంది మగపులిని కాబట్టి ఆడపులి పిలుపుని అనుకరిస్తూ శబ్దం చేస్తే ఆ పులి మనకు దొరకొచ్చు"

"ఆడపులి మగతోడు కోసం చేసే శబ్దాలు మనం అనుకరించాల్సిన అవసరం లేదు. నా టేప్‌రికార్డర్లో రికార్డుచేసి పెట్టాను" అంటూ ఆ అసిస్టెంట్ రేంజర్ తన ప్యాంట్ జేబులోంచి పాకెట్ సైజులో ఉన్న టేప్‌రికార్డర్ తీసి చూపించాడు. "ఇందులో అన్నిరకాల జంతువుల అరుపులు, పక్షుల అరుపులు రికార్డయి ఉన్నాయి" అంటూ ఆడపులి మైథునవాంఛతో చేసే అరుపుని విన్పించాడు.

"ఇదే మన ఆయుధం ఇప్పుడు. మొదట ఏదైనా తిందాం. తర్వాత ఆ పులిని బైటికి రప్పించడానికి దీని సాయంతో ప్రయత్నిద్దాం" అన్నాడు గుంజన్.

"మనందరం ఒకేచోట గుమికూడి ఈ శబ్దాలు విన్పించడం వల్ల ప్రయోజనం ఉండకపోవచ్చు. ఈ టేప్‌రికార్డర్లోంచి వచ్చే శబ్దం ఎక్కువ దూరం విన్పించదు. ఆ పులి ఈ దరిదాపుల్లో ఉంటే తప్ప మనవైపుకి రాదు. అందుకే మీ వద్ద ఉన్న సెల్‌ఫోన్లలో దీన్ని రికార్డ్ చేసుకోండి. మనం విడిపోయి వేర్వేరుచోట్ల ఈ శబ్దాన్ని విన్పిద్దాం. మగపులి సమీపించే ముందు తప్పకుండా శబ్దాలు చేస్తుంది. కాబట్టి సెల్‌ఫోన్లో సమాచారం అందుకో

గానే మిగతావాళ్లు కూడా అక్కడికి చేరుకో వచ్చు. ఇందులో కొద్దిగా రిస్క్ ఉన్నా తప్పదు, ఏమంటారు? " అన్నాడు గుంజన్.

మిగతావాళ్లు అతని అభిప్రాయంతో ఏకీ భవించారు. టేప్‌రికార్డర్లో ఉన్న శబ్దాన్ని తమ తమ సెల్‌ఫోన్లలోకి ఎక్కించుకు న్నారు. తరువాత చుట్టుపక్కల దొరికిన పళ్ళతో కడుపు నింపుకుని ఇద్దరేసి చొప్పున వేర్వేరు దిశల్లో పులి వెళ్ళిన వైపుకి బయల్దేరారు.

★ ★ ★

సెల్‌ఫోన్లో ఉన్న శబ్దాన్ని పదే పదే విన్పిస్తూ రెండు గంటల నుంచి తిరుగు తున్నా పులి బైటికి రాకపోవటంతో నిస్పృ హకు లోనవుతున్నాడు గుంజన్. ఈ రోజె ట్లాగన్నా దాన్ని సజీవంగా పట్టుకోవాలన్న పట్టుదల అతడిలో.

"ఎందుకలా బాధపడ్తావు? ఈ రోజు పులి దొరకలేదనుకో.. దానిఖర్మ. రేపో, ఎల్లుండో మనం దాన్ని కాల్చిపడేయొచ్చు నాకైతే ఎంత కసిగా ఉందో తెలుసా? మనల్ని ఎన్ని ముప్పుతిప్పలు పెట్టిందో ఆ పులి" అన్నాడు గుంజన్‌కి తోడుగా వచ్చిన అసిస్టెంట్ రేంజర్ గర్గే.

అతని వయసు పాతిక్కీ, ముప్ఫయికీ మధ్యలో ఉండొచ్చనుకున్నాడు గుంజన్. పులుల్ని చంపటానికి తను బద్ధవ్యతిరేకి నని అతనికి ఎలా చెప్పాలో అర్థం కాలేదు. నిన్న మొన్నటి వరకు తను పులుల్ని చంపి, వాటి శరీర భాగాల్ని అమ్ముకున్నానన్న విషయం ఫారెస్టు డిపా ర్ట్‌మెంట్లో చాలామందికి తెలుసు. తనిలా చెప్పినా వాళ్ళు నమ్మకపోగా 'వెయ్యి ఎలు కల్ని చంపి తిన్న పిల్లి కాశీయాత్రకు బయ ల్దేరినట్టుందని' నవ్వుకుంటారనీ తెలుసు.

అందుకే అతను సమాధానం చెప్ప కుండా మరింత చిక్కగా ఉన్న పొదల్లోకి చొరబడ్డాడు.

"అంత లోపలికెళ్ళడం ప్రమాదం. ఆ పులి ఇక్కడెక్కడైనా ఉంటే అదే బైటికొ స్తుంది కదా" అన్నాడు గర్గే. అతను గుంజన్తోపాటు రాకుండా దూరంగా నిలబ డిపోయాడు.

గుంజన్ మరికొంత లోపలికెళ్ళాడు. పొదలు దట్టంగానే కాకుండా ఎత్తుగా కూడా ఉండటం వల్ల ఇపుడు గర్గే అతనికి కన్పించడంలేదు.

తన దగ్గరున్న సెల్‌ఫోన్లో చార్జ్ తక్కువ ఉన్నట్టు తెలుస్తోంది. మహా అయితే మరో పావుగంట వరకు పన్చే యొచ్చు. ఆ తర్వాత ఏం చేయాలో అత నికి అర్థం కాలేదు. పులి ఎందుకు బైటికి రావడం లేదు? మిగతావాళ్ళ నుంచి ఫోన్ రాలేదు కాబట్టి ఎవ్వరికీ కన్పించలే దనేగా అర్థం. ఎటువంటి పరిస్థితుల్లో ఉన్నా ఈ సీజన్లో ఆడపులి గొంతు వింటే మగపులి తప్పకుండా స్పందిస్తుంది. మరి ఈ పులి ఎందుకు బదులివ్వడం లేదు? నిజమైన ఆడపులి గొంతు కాదని దానికి తెలిసిపోయిందా? అలా అనుకోడానికి మనసొప్పడంలేదు. కోరికతో జ్వలించే మగపులి, ఆడపులి గొంతు వినగానే పరిస రాల్ని మరిచిపోయి పరుగెత్తుకుంటూ రాకుండా ఉంటుందా?

ఓ పొదని తొలగించుకుని ముందుకెళ్ళ బోతున్న గుంజన్ ఆగిపోయాడు. తన

## కొత్తగాలి...

**కార్‌బైడ్‌తో**
**పండని కాయ**
**పోలతిన్ కవరు లేని పొట్లం**
**మచ్చుకైనా లేదు!**

– వి.యం. కృష్ణ,
హైదరాబాద్

వెనక పులి ఉన్నట్టు అతనికెందుకో అను మానమొచ్చింది. వెనక కదలిక ఏమీలేదు. కానీ దాని శరీరంలోంచి వచ్చే వాసన.. పర్ధితెగలో పుట్టిన ప్రతి మగవాడికీ బాగా తెలిసిన పులి వాసన.. వెనక్కి తిరిగి చూడాలా? వద్దా? అనే మీమాంసలో ఓ లిప్తపాటు నిలబడిపోయాడు.

భుజం మీద వెయ్యి టన్నుల బరువున్న కొండచరియ విరిగిపడ్డట్టు దబ్బున కింద పడిపోయాడు. పులెప్పుడూ చాటు నుంచి అధాట్టుగా దాడి చేస్తుందని పర్ధితెగలో అందరికీ తెలుసు. అందుకే ముందుకు బోర్లా పడ్తున్న సమయంలో వెల్లకిలా తిరిగిపోవడాన్ని చిన్నప్పటి నుంచీ సాధన చేయిస్తారు. ఆ సాధన ఇపుడు గుంజన్‌కి అక్కరకు వచ్చింది. శరీరం నేలను తాకే లోపల అతను రెండు చేతులూ నేలకు ఆన్చి వెల్లకిలా తిరిగిపడ్డాడు. పులి ముందు కురికి తన రెండు కాళ్ళను అతని గుండెల మీద ఆనించి మెడను కొరకడానికి ప్రయత్నిస్తోంది.

గుంజన్ తన శక్తినంతా ఉపయోగించి మోకాళ్ళు మడిచి దాని డొక్కల్లో తన్నాడు. పులి రెండడుగులు వెనక్కి జరిగింది. అదే అదనుగా లేచి నిలబడ్డాడు. పులి కోరలు సాచి అతనివైపు క్రూరంగా చూసింది. దాని కళ్ళలో నిప్పుకణికలా మండుతూ పగ.. చేతిలోని సెల్ ఫోన్ ఎక్కడో దూరంగా పడిపోయింది. పెద్దగా అరిచి గర్గేని పిలుద్దామన్న ఆలోచనని మానుకున్నాడు. ఆ శబ్దానికి పులి మరింత రెచ్చిపోయే ప్రమాదముంది.

దాన్ని ఉత్త చేతులతో ఎలా ఎదుర్కోవాలో అర్థం కాలేదు. ఇపుడు దాన్ని ప్రాణాలతో పట్టుకోవాలన్న ఆలోచన లేదు. దాన్ని చంపకపోతే అది తనని చంపేయడం ఖాయం. అది ఎగిరి తన మీదకు దూకితే ఎలా నిలదొక్కుకోవాలా? అని ఆలోచిస్తూనే దాని కళ్ళలోకి సూటిగా చూశాడు. భుజం మీద పంజాదెబ్బ పడటం వల్ల రక్తం కారుతోంది. గాయం సలుపుతోంది.

పులి మరోసారి దాడికి సన్నద్ధమవుతున్నట్టు దాని శరీర కదలికల్ని బట్టి తెలుస్తోంది. ప్రజల్లో ఉన్న నమ్మకమేమంటే పులి దాడిచేసే ముందు భయంకరంగా గాండ్రిస్తుందని. కానీ అలాంటి శబ్దాలేవీ చేయకుండానే పులి గాల్లోకి ఎగిరింది.

పులి గుంజన్ గుండెల మీద తన ముందరి రెండు కాళ్ళతో దాడిచేసింది. గుంజన్ కింద పడిపోయాడు. పులి తన నోటితో దొరికిన చోటల్లా కొరుకుతోంది. పదునైన పళ్ళతో కండను పట్టిలాగుతోంది. గుంజన్ నొప్పిని పళ్ళబిగువున భరిస్తూ, తన మెడ దానికి దొరక్కుండా కాపాడుకుంటూ చేతులడ్డం పెడ్తున్నాడు.

గుంజన్ కోసం గర్గే కొద్దిసేపు ఎదురుచూసి, ఎంతకూ రాకపోవడంతో అతన్ని వెదుక్కుంటూ పొదల్లోకి వచ్చాడు. ఎదురుగా కన్పించిన దృశ్యం చూసి మ్రాన్పడిపోయాడు. గుంజన్ నిరాయుధుడిగా పులితో పోరాడుతున్నాడని గమనించి "గుంజన్! ఇదిగో కత్తి" అని పెద్దగా అరుస్తూ తన మొలలో ఉన్న కత్తిని గుంజన్ కుడిచేతికి దగ్గరగా పడేలా విసిరేశాడు. దాంతోపాటు మిగతావాళ్ళకు సెల్ ఫోన్లో సమాచారం చేరవేశాడు.

గుంజన్ ఎడంచేత్తో పులి ప్రయత్నాల్ని అడ్డుకుంటూ కుడిచేత్తో కత్తిని అందుకునే ప్రయత్నం చేశాడు. కత్తి చేతికందటం లేదు. మరో అంగుళం చేయిచాపితే కానీ అందేలా లేదు.

తను విసిరేసిన కత్తివల్ల ఉపయోగం లేకపోవడం చూసిన గర్గే పులి దృష్టిని తనవైపు తిప్పుకునే ప్రయత్నంలో రకరకాల శబ్దాలు చేస్తూ పులికి దగ్గరగా వెళ్ళాడు. పులి అతన్ని పట్టించుకోలేదు. దాని ధ్యాసంతా గుంజన్ని గాయపర్చడంలోనే

## రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# ప్రేమకు చక్కని నిర్వచనం!




ప్రేమ అనేది యవ్వనంలో కలిగే ఒక మనోవికారం. 'నువ్వెవరినైనా ఇష్టపడు. మరెవరైనా నిన్నిష్టపడనీ. అది మనసులో ఉంచుకోవాల్సిన విషయం. అంతేగానీ పెళ్లికి ప్రేమకు ఎలాటి లింకూ పెట్టగూడదు. నీవు ప్రేమించిన యువతి ఇరవైఏళ్ల తరువాత నీకు గుర్తొస్తే నీ నరాలు జివ్వుమనాలి. తను నీకు కనిపిస్తే నీ గుండె జిల్లుమనాలి. అదే నిజమైన ప్రేమకు మొక్కవోని నిదర్శనం. అంతేగానీ ప్రేమించానంటూ అమ్మాయిల వెంటబడి వేధించడం, ఆసిడ్ చల్లడం, కిడ్నాప్ చేయడం, రేప్ చేయడంలాంటి అనుచిత చర్యలవల్ల జైలుపాలై జీవితాలు నాశనం చేసుకోవడం తప్ప, ఒరిగేదేమీ లేదు' అనే చక్కని సందేశం ఇస్తోందీ నవల. అన్నీ అనుకూలిస్తే పెళ్లిచేసుకోవడం తప్పుకాదు. ప్రేమించుకున్నామంటూ లేచిపోయి పెళ్లి చేసుకోవడం వల్ల అనర్థాలేగానీ మేలు జరగడంలేదు. అరేంజ్‌డ్ మారేజీలతో పోలిస్తే ప్రేమ వివాహాలు పెద్దగొప్పగా ఏమీలేవు. అందుకు కారణం బంధువుల ఆదరణ, సమాజం సానుభూతి లేకపోవడం. అంతేగాక ఏకాకులమయ్యామనే మానసిక క్షోభ మరింత కుంగదీస్తుంది. దీనికి- లేచిపోయి కోట్లు సంపాదించినా, మానసిక ప్రశాంతత లేక అమెరికా నుండి తిరిగి వచ్చి భర్తకు క్షమాపణ చెప్పి, ఆస్తి కూతురికి అప్పజెప్పి, భర్తకు మళ్లీ వివాహం జరిపించిన రేవతి జీవితం మంచి ఉదాహరణ. మెంటల్లీ రిటార్డెడ్ చైల్డ్ కలగడం, ఆమెకు క్యాన్సర్ రావడం ఆమెను అశాంతితో వేధించాయనొచ్చు. ఈ ప్రపంచంలో డబ్బు, హోదా, అంతస్తు, గౌరవం ఇవ్వలేని సుఖాన్ని ఆమె కూతురి తలను ఒడిలో పెట్టుకుని ఓదార్చడం ద్వారా పొందగలిగింది. స్వప్న తండ్రి, మోహన్ తల్లి యాభై ఏళ్ల వయసులో తోడుకోసం పరితపిస్తున్నారని తెలిసి తమ ప్రేమను త్యాగం చేసి, వారి పెళ్లి చేసిన విధానం శ్లాఘనీయం గదా!

చతురకత 'మా అత్త బంగారం'లో కొసమెరుపు కడుపుబ్బా నవ్వించింది. 'నవలావలోకనం' నవలా పాఠకులకు కరదీపిక. 'యతి'ని చూసి కూడా ఎడ్ ఫొటో తీయకపోవడం వెనుక మానవీయత మనసును కరిగించింది. 'కన్నొకటి లేదుగానీ కంతుడవయ్యా' అనే పద్యపాదాన్ని 'కనొ్నక్కటి లేదుగానీ కాంతుడుగాడే' అని సామెతలాగా వాడుతుండేవారు. 'కంతుడని' చమత్'కారం'లో తెలిసింది. ఇలా ఎన్నోవిశేషాలతో 15 రూపాయలకే మంచి నవలలను అందిస్తున్న 'చతుర'కు సాహితీ ప్రియులందరి తరపున అభినందనలు.



– తిప్పావఝుల
వెంకట్రామయ్య,
దగదర్తి, నెల్లూరు జిల్లా

ఉంది. చుట్టుపక్కల చూశాడు. పొడవాటి ఎండిన కొమ్మ ఒకటి కన్పించింది. వెంటనే దాన్ని తీసుకుని కత్తిని గుంజన్ వైపుకి నెట్టాడు.

అప్పటికే పులి గుంజన్ ఎడమ భుజాన్ని నములుతోంది. గుంజన్ కుడి చేత్తో కత్తిని అందుకుని దాని ఎడం కాలి తొడలో బలంగా గుచ్చాడు. కస్సున పిడి వరకూ దిగిపోయింది కత్తి. పులి సన్నగా మూలిగి, పట్టు సడలించింది. అదే అద నుగా కత్తిని బైటికి లాగి దాని డొక్కలో దింపాడు. పులి పెద్దగా మూలిగింది. కుడి చేత్తో గొడ్డలి పట్టుకుని తన తల్లి మెడని ఒకే వేటుతో తెగనరికిన విషయం పులికి గుర్తొచ్చిందో? ఏమో? అంత బాధలోనూ

కొత్తగాలి...

**మొదటి సినిమా**
**హిట్టయితే కారులో**
**రెండో సినిమా**
**ఫట్టయితే బారులో**

*- డి. శ్రీనివాస దీక్షితులు,*
*నరసరావుపేట, గుంటూరు జిల్లా*

కసిగా అతని కుడిచేతిని మణికట్టు వరకు కొరికేసింది. ఇపుడు గుంజన్ రెండు చేతులూ పనిచేయడం లేదు. పులి అతని మెడని దొరకబుచ్చుకోడానికి ప్రయత్ని స్తోంది. అడ్డుపెట్టడానికి చేతులు లేక నిస్స హాయంగా ఉండిపోయాడు గుంజన్.

అప్పటికే టీంలోని మిగతావాళ్ళు అక్క డికి చేరుకున్నారు. మత్తుడార్ట్‌లను ప్రయో గించడానికి సన్నద్ధమయ్యేలోపల.. అంత మందిని చూడగానే గుంజన్ మెడని కొర కబోతున్న పులి అతన్ని వదిలేసి పొదల్లోకి పారిపోయింది. అప్పటికే గుంజన్ ఒంటి నిండా గాయాల్తో స్పృహ తప్పిపోయేలా ఉన్నాడు. వెంటనే అతన్ని ఆస్పత్రికి చేర్చే పనిలో మునిగిపోయారందరూ.

★ ★ ★

గుంజన్ కుడిచేతికి, ఎడమకాలికి ఆపరే షన్ చేశారు. పులి కొరికిన చోట్లలో కుట్లు వేశారు. రెండు రోజులు ఐసీయూలో ఉంచాక జనరల్ వార్డ్‌కి బదిలీచేశారు. శ్వాస తీసుకోవడం కష్టంగా ఉండటం వల్ల వెంటిలేటర్ అమర్చారు.

గుంజన్‌కి మగతగా ఉంది. కళ్ళ ముందు కదలాడుతున్న దృశ్యాలు కలలో జరుగుతున్నాయో? లేక నిజంగానే కన్పి స్తున్నాయో? తెలీనిస్థితి. ఒళ్ళంతా సలప రంగా ఉంది. జ్వరం విడవకుండా పీడి స్తోంది. ఒంట్లోని నీరంతా ఎవరో పీల్చేసి నట్టు నిస్త్రాణ.

పులి.. చాలా పెద్దపులి.. పదేళ్ళ కుర్రాడు చేతిలో పదునైన గొడ్డలితో చెట్టుపై నుంచి అమాంతం కిందికి దూకాడు. దూకుతూనే గొడ్డలితో పులి తలని ఒకే వేటుతో నరికేశాడు. ఒక్కసా రిగా అతని చుట్టూతా నిశ్శబ్దం అలుము కుంది. ఆ వెంటనే జయజయధ్వానాలు మిన్నుముట్టాయి. నలుగురైదుగురు ఆ కుర్రాడిని గాల్లోకి ఎత్తారు. శత్రుదేశాన్ని జయించిన రాజు విజయచిహ్నంగా కత్తిని ఎత్తి పట్టుకున్నట్టు ఆ కుర్రాడు తన గొడ్డ లిని ఆకాశంకేసి చూపిస్తూ చిరునవ్వు నవ్వాడు.

రెండు పులిపిల్లలు.. పసికూనలు.. చారలు ఒకేలా కన్పిస్తూ.. కవల పిల్లలకు మల్లే! ఇరువైపులా పిల్లల్ని వెంటేసుకుని మెల్లగా కదులుతూ ఆడపులి. అదుగో ట్రాప్. పులి మరికొంత ముందుకు కది లింది. ట్రాప్ అమాంతం దాన్ని కదల కుండా బంధించింది. రాక్షసుడిలా ఉన్న వ్యక్తి చెట్టుదిగాడు. అతని చేతిలో మెరుస్తూ గొడ్డలి. జాలిగా చూస్తూ పులి కూనలు.. వాటి కళ్ళముందే ఆడపులిని

నరుకుతూ అతడు..

పగతో రగిలిపోతూ ఎదిగిన పులి కూన.. రెండున్నరేళ్ళ నిరీక్షణ తర్వాత కంటపడిన రాక్షసుడు.. ఏ చేత్తోనైతే తల్లి తలని నరికాడో ఆ చేతిని కసిదీరా నమిలి తినేస్తూ పులి.. నొప్పి.. మంట.. భరించ లేనంత బాధ..

చప్పున కళ్ళు తెరిచి చూశాడు. పులి లేదు. తను హాస్పిటల్ మంచం మీద ఉన్నానని గుర్తించాడు. మంచం మీద కాళ్ళవైపున తన కూతురు శ్రద్ధ కూచుని ఉంది. ఏడ్చి ఏడ్చి ఎర్రబడిన కళ్ళు.. తన భార్య మొహం కూడా అలానే ఉంది.. శోక సముద్రంలా...

"నాన్నా! నా వల్లనే కదా ఇదంతా జరిగింది. నిన్ను ఆ ట్రస్ట్‌లో చేర్పించకుండా ఉండి ఉంటే ఈ రోజు నీకీ కష్టం ఉండేది కాదు. నా చేతులారా నా తండ్రిని పులినోట్లోకి నెట్టానన్న దిగులు నన్ను తినేస్తోంది నాన్నా!" అంటూ రోదించింది శ్రద్ధ.

అంత బాధలోనూ గుంజన్ మెల్లగా నవ్వాడు. "పిచ్చితల్లీ! ఇందులో నీ ప్రమేయం ఏమీ లేదమ్మా! మన పర్దితెగ వాళ్ళ చావులు ఇలానేగా రాసిపెట్టి ఉండేది. మన తెగలో ఎంతోమంది ఇలా పులివాత పడో, క్రూరజంతువుల బారిన పడో చనిపోయారు. బతుకులు అడవితో ముడిపడినట్లే చావులు కూడా అడవిలోనే రాసిపెట్టి ఉంటాయి తల్లీ!" అన్నాడు.

"నువ్వు పులుల్ని చంపి వాటితో వ్యాపారం చేసిన రోజుల్లో బాగానే ఉన్నావు. నా మాట విని అవన్నీ మానేసి, మంచివాడిగా మారాక ఇలా జరగడమే గుండెల్ని పిండేస్తోంది నాన్నా! నువ్వు దాన్ని ప్రాణాలతో పట్టుకోవాలని ఎంతగా తపించావో నాకు తెలుసు. నువ్వు దాని ప్రాణాలు కాపాడటానికి ప్రయత్నిస్తుంటే అది నీ మీద దాడిచేసి ఇలా గాయపర్చడం దుర్మార్గం కదా! క్రూరజంతువు ఎప్పటికైనా క్రూరజంతువే నాన్నా! దానిమీద జాలిపడి తప్పుచేశామని ఇపుడనిపిస్తోంది నాన్నా!" శ్రద్ధ వెక్కివెక్కి ఏడుస్తోంది.

"లేదమ్మా! మీ అయ్యని పులి గాయపర్చింది కాబట్టి నువ్వలా మాట్లాడటం సహజమే. కానీ నువ్వు మొదట్లో నాతో పోట్లాడి నామీద అలిగి, పులుల్ని వేటాడకుండా ఆపావు చూడు.. అదే సరైన నిర్ణయం. మీ నాన్న ఆ పులికి ద్రోహం చేశాడు కదమ్మా! దాని కళ్ళముందే వాళ్ళ అమ్మను నరికేస్తే దాని గుండె మండదా చెప్పు? అది మీ నాన్న మీద దాడిచేసి దాని పగను చల్లార్చుకుంది. అది చేసింది న్యాయమే కదమ్మా!" అంటూ నవ్వడానికి ప్రయత్నించి దవడల దగ్గర విపరీతమైన నొప్పి రావడం వల్ల ఆగిపోయాడు.

అతనికి ఆయాసం ఎక్కువైంది. గుండెల్లో బరువుగా అన్పించసాగింది. నొప్పితో మెలికలు తిరిగి పోతున్నాడు.

నర్సు పరుగెత్తుకుంటూ వచ్చింది "ఎక్కువగా మాట్లాడించవద్దని మీకు చెప్పానా? చెప్తే అర్థం కాదా? " అంటూనే డాక్టర్ కోసం పరుగెత్తింది.

అతన్ని స్ట్రెచర్ మీద పడుకోబెట్టి ఐసీయూలోకి తీసుకెళ్తున్నప్పుడు, శ్రద్ధను దగ్గరకు పిలిచి, లేని ఓపికంతా కూడగట్టుకుని "నేను ఒకవేళ ఇపుడు చనిపోతే, అక్కడ ఆ లోకంలో నేను చంపిన పులులన్నిటినీ కలుసుకుని నన్ను క్షమించమని వేడుకుంటాను తల్లీ! నీకు సంతోషమేగా!" అన్నాడు.

అతన్ని మాట్లాడవద్దని వారిస్తున్న డాక్టర్‌తో "సార్! సార్! నా కూతురితో మాట్లాడనివ్వండి. ఇవే నా చివరి మాటలు కావొచ్చు" అన్నాడు.

శ్రద్ధవైపు తిరిగి "నాకో సాయం చేస్తావా తల్లీ!" అన్నాడు.

"చెప్పు నాన్నా!"

"ఆ పులిని చంపొద్దని నా చివరి కోరిగ్గా



ఛీఫ్‌వార్డెన్‌కి చెబుతావా? అది ఇప్పటికే బాగా గాయపడింది. దాని శరీరంలో దిగబడిన కత్తి ఇంకా అక్కడే ఉండి ఉంటుంది. దాన్ని పట్టుకుని వైద్యసాయం అందించి బతికించమని చెప్పు. ఇపుడు దాన్ని పట్టుకోవడం సులభం. ఇది నా విన్నపమని చెప్పు తల్లీ!" అన్నాడు.

దగ్గుతెరవచ్చి మాట ఆగిపోయింది. అదే అదనుగా స్ట్రెచర్ని లోపలికి తోసుకెళ్ళిపోయారు.

గుంజన్ మాట్లాడిన మాటలకు తట్టుకోలేక శ్రద్ధ నేలమీద కూలబడిపోయి వాళ్ళమ్మ కాళ్ళను చుట్టుకుని భోరున ఏడ్చింది.

ఆ రాత్రంతా తల్లీకూతుళ్ళకు కంటి మీద కునుకు లేదు.

మరునాడు మధ్యాహ్నానికి గుంజన్ చివరిశ్వాస విడిచాడు.

★ ★ ★

పులిని సజీవంగా పట్టుకోవాలని తాపత్రయపడిన గుంజన్ని అదే పులి పొట్టన పెట్టుకున్నందుకు ఆ బృందంలోని మిగతావాళ్ళందరూ కోపంతో రగిలిపోతున్నారు. అది కన్పిస్తే చాలు కాల్చిపడేయాలని అడవిని జల్లెడ పడ్తున్నారు. ఎంత వెదికినా ఆ పులి జాడ కన్పించడం లేదు. ఏమైపోయిందో ఎవ్వరికీ అంతుబట్టడం లేదు. అడవి గర్భంలోని ఏ చీకటి కుహరాల్లో అయినా దాక్కుని ఉండిపోయిందా? లేక గాయపడింది కాబట్టి రక్తస్రావంతో చచ్చిపోయి ఉంటుందా? అనే అనుమానం తీరడంలేదు.

రక్తస్రావంతో చావకున్నా గుంజన్ పొడిచిన కత్తి, దాని డొక్కలోనే ఉండిపోయింది కాబట్టి ఆ గాయం ఇన్ఫెక్టయి అది చచ్చిపోవడం ఖాయం అనుకున్నారు.

దాని కదలికలు గుర్తించడం కోసం అడవిలోని వేర్వేరు ప్రాంతాల్లో కెమెరా ట్రాప్‌లు పెట్టి చూశారు. దాని జాడ కన్పించలేదు.

గుంజన్ మరణించిన రెండోరోజు కెమెరాలో పులి కదలికలు కన్పించాయి. దాన్ని వేటాడి కాల్చి చంపడానికి నియమించిన బృందంలోని సభ్యులందరూ సంతోషపడ్డారు. మరునాడు ఎట్టిపరిస్థితులెదురైనా సరే దాని అంతం చూడాల్సిందేనని నిర్ణయించుకున్నారు.



కెమెరాలో కన్పిస్తున్న పులివైపు పదేపదే చూస్తున్న గర్గేవైపు అసహనంగా చూశాడు రేంజర్.

"ఎందుకన్నిసార్లు చూస్తావు? అది మనం వెతుకుతున్న పులే. అనుమానం లేదు" అన్నాడు

"కానీ గుంజన్ చేసిన గాయం కానీ, దాని డొక్కలో ఉండాల్సిన కత్తి కానీ కన్పించడం లేదు సార్! నాకెందుకో ఈ పులి మరొక పులై ఉంటుందనిపిస్తోంది" అన్నాడు గర్గే.

మూడేళ్ళ సర్వీస్ కూడా పూర్తికాని గర్గేని అమాయకమైన కుర్రాడిని చూసినట్టు చూసి, ఎగతాళిగా నవ్వుతూ చెప్పాడు రేంజర్ "నీకు అనుభవం తక్కువ కాబట్టి అలా అన్పించడం సహజం మిస్టర్ గర్గే! చెట్టుకొమ్మలకు బిగించిన కెమెరా సాయంతో తీసిన ఫొటోలు స్పష్టంగా ఎలా కన్పిస్తాయి చెప్పు. ఫొటోలు పై నుంచి తీస్తున్నాం కాబట్టి దాని వీపు కన్పిస్తుంది తప్ప డొక్కలో కత్తి ఉందా? లేదా? అన్న విషయం ఎలా తెలుస్తుంది? దాని తొడలో గాయం కూడా ఎదురుగా నిలబడి ఫొటో తీస్తే తప్ప కన్పించే అవకాశం లేదుగా! లాజిక్ చాలా అవసరం మన ఉద్యోగంలో. లాజిక్ లేకపోతే దేనికీ పనికిరావు.. అర్థమైందా? "

గర్గే ఆ ఫొటోల వైపు నిశితంగా చూడటం మానలేదు. రేంజర్తో మాత్రం "మీరు చెప్పిందే కరెక్టనిపిస్తోంది సార్! మన కెమెరాలకు అంత క్వాలిటీ ఎక్కడుంది? " అన్నాడు.

"ఇంకా ఎందుకు చూస్తున్నావు? నీ అనుమానం తీరడం కోసం వాటిని ఎన్లార్జ్ చేయించమంటావా ఏమిటి? " రేంజర్ నవ్వుతూ అడిగాడు.

"నేను చూస్తున్నది అది కాదు సార్! దీని శరీరం మీద ఉన్న చారల్ని మీరు గమనించారా? "

"అవి అచ్చుగుద్దినట్టు సరిపోబట్టే కదా మనం వెతుకుతున్న పులి ఇదేనన్న నిర్థారణకు వచ్చాం మనందరం"

"ఏదో తేడా ఉంది సార్! ఈ పులికి ముందరి కాళ్ళలో కుడితొడ మీద చారలు చూశారా? మనక్కావాల్సిన పులికి కుడి తొడ మీద నల్లటి చార ఒకటుండాలి.

చిన్నచార.. దాదాపు అంగుళం అంగుళం న్నర మేర.. ఈ పులి తొడ మీద అలాంటి చార కనిపించడం లేదు, జాగ్రత్తగా చూడండి సార్!"

రేంజర్ ఆ ఫొటోల్ని మరోసారి పరిశీల నగా చూసి చెప్పాడు.. "ఏమీ తేడా లేదు. ఆ పులికి కూడా అటువంటి నల్లటి చార లేదు. నాకు బాగా గుర్తుంది"

"లేదు సార్! నేను పులిని చాలా దగ్గ రగా చూశాను. అది గుంజన్ని ఎటాక్ చేసిన సమయంలో నేను దానికి అతి సమీపంగా నిలబడి దాని దృష్టి నా వైపు మరలించడానికి ప్రయత్నించాను. నాకు బాగా గుర్తు దాని కుడితొడ మీద పుట్టుమ చ్చలా ఓ నల్లటి చార ఉండింది. ఈ పులికి లేదు కాబట్టి రెండూ వేర్వేరు పులు లని కచ్చితంగా చెప్పగలను"

ఆ మాటలకు రేంజర్ అప్ర మత్తమయ్యాడు. పులి మాన్ ఈటర్‌గా మారాక దాని కదలికల్ని రికార్డ్ చేసిన ఫొటో ట్రాప్‌లు తెప్పించి చూశాడు. ఆ ఫొటోల్లో కొన్నిటిని ఎన్‌లార్జ్ చేయించి కుడితొడ మీద కన్పిస్తున్న చారల్ని గమ నించాడు. గర్గే అనుమానమే నిజమైంది. దాని కుడితొడ మీద నల్లటి చార ఒకటి అదనంగా ఉంది. మిగతా చారలన్నీ అచ్చు గుద్దినట్టు సరిపోలి ఉన్నాయి.

"మనం ఈ విషయాన్ని వెంటనే ఛీఫ్‌వా ర్డెన్ దృష్టికి తీసుకురావడం మంచిది" అన్నాడు రేంజర్. మొదట తన పైఅధికా రికి విశదపరిచి ఛీఫ్‌వార్డెన్‌కి విన్నవించా ల్సిందిగా కోరాడు.

అదేరోజు మధాహ్నం ఛీఫ్‌వార్డెన్ నుంచి టీమ్ సభ్యులందరికీ మెసేజ్ అందింది. కుడితొడ మీద నల్లచార ఉన్న పులి కన్పించేవరకు వెతికి దాన్ని కాల్చి చంపవల్సిందిగా ఉత్తర్వు అది. మరో వారంరోజులు వెతికినా కుడితొడ మీద నల్లచార లేని పులి కంటపడింది తప్ప వాళ్ళు దేనికోసం వెతుకుతున్నారో ఆ పులి కన్పించలేదు. చివరికి కెమెరా ట్రాపుల్లో కూడా ఆ పులి పట్టుబడలేదు.




**వం**జారి ఛీఫ్‌వార్డెన్ ఆఫీసులోకి ప్రభంజనంలా దూసుకొచ్చాడు. అనుమతి కూడా అడక్కుండా ఛాంబర్లోకి వెళ్ళబో తున్న అతన్ని ప్యూన్ ఆపేసి "లోపల మీటింగ్ జరుగుతోంది సార్! కొద్దిసేపు కూచోండి" మర్యాద ఉట్టిపడేలా చెప్పాడు.

"నేనెవరనుకుంటున్నావ్? రూలింగ్ పార్టీ ఎమ్మెల్యేని. నన్నే ఆపుతావా? నీకెంత ధైర్యం? నేను కాబోయే మినిష్టర్ అన్న విషయం తెలుసా? చెప్తా నీ సంగతి! నేను మినిష్టర్ కుర్చీలో కూచున్న తక్షణం నీ ఉద్యోగం వూడబెరుకుతూ ఆర్డర్ పాస్ చేస్తా" కల్లు తాగిన కోతిలా చిందులేస్తున్నాడు వంజారి.

"సార్! మీటింగ్ అయ్యేవరకు ఎవర్నీ లోపలికి పంపొద్దని చెప్పారయ్యా! అందు కనే కొద్దిసేపు వెయిటర్స్‌ని లాంజ్‌లో కూచోమన్నాను" సంజాయిషీ ఇస్తున్నట్టు చెప్పాడతను.

"నేను వెయిట్ చేయాలా? ఏమనుకుం టున్నావు నన్ను? లోపలికెళ్ళి నీ అయ్యగా రితో నేనొచ్చానని చెప్పు"

"లోపల మీటింగ్.."

"బుద్ధుందా నీకు? చెప్తే బుర్రకెక్కదా? లోపలికెళ్ళి నా పేరు చెప్పు.. వంజారి..

వంజారీ అని చెప్పు.. నన్ను పిలవలేద నుకో.. ఏం చేయాలో నాకు తెలుసు.. వెళ్ళు లోపలికి" హూంకరించాడు

ప్యూన్ బెదిరిపోయాడు. లోపలికెళ్తే అయ్యగారు తిడ్తారు. వెళ్ళకపోతే ఈయన తిడుతున్నాడు. తిట్టడం వరకైతే పర్లేదు. పైన పడి కొట్టేలా ఉన్నాడు. దీనికన్నా లోపలికెళ్ళి తిట్టించుకోవడమే శ్రేయస్కర మని ఆలోచించి లోపలికెళ్ళాడు.

వంజారి ఎలాంటివాడో బాగా తెలుసు కాబట్టి మీటింగ్‌ని అసంపూర్తిగానే ముగించి, వంజారీని లోపలికి పంపించ మని ప్యూన్‌తో చెప్పాడు ఛీఫ్‌వార్డెన్.

ప్యూన్ బైటికొచ్చి "అయ్యగారు మిమ్మల్ని రమ్మంటున్నారు" అనడమే ఆలస్యం సుడి గాలిలా ఛాంబర్ లోపలికెళ్ళాడు. "మిస్టర్ బాంగ్డియా! నేనీసారి ఎమ్మెల్యేగా గెలవ కూడదని నా అపోజిషన్‌వాళ్ళతో కుమ్మ క్కయి ఏమైనా కుట్రపన్నుతున్నారా? నా రాజకీయజీవితాన్ని నాశనం చేయాలని మీరు కంకణం కట్టుకున్నారా? దీనివెనుక ఎవరి హస్తముందో నాకు తెలియాలి. ఇప్పుడే ఈ క్షణమే ఆ విషయమేదో తేలి పోవాలి" అన్నాడు.

అతనంత కోపంతో వూగిపోతున్నా బాంగ్డియా పెదవుల మీద చిరునవ్వు చెరి గిపోలేదు. "గౌరవనీయులైన ఎమ్మెల్యేగా రికి ఎదురు నిలబడే గుండె ధైర్యం మన రాష్ట్రంలో ఎవరికైనా ఉందంటారా?" అన్నాడు.

వంజారి కొద్దిగా మెత్తబడ్డాడు.

"మీరు కూచోండి సార్! కూల్‌డ్రింక్ తెప్పిస్తాను. కొద్దిగా చల్లబడండి. మీ కోపా నికి కారణం తెలిస్తే కదా నేనేమైనా చేయ గలను" అన్నాడు బాంగ్డియా.

"మీరేమీ చేయడం లేదనేగా నేను రావా ల్సివచ్చింది. ఓ పులిని చంపడానికి మీ డిపార్ట్‌మెంట్ వాళ్ళకి ఇన్నిరోజులు పడ్తుందా? మీరు పులిని షూట్ చేయ మని ఆర్డర్ ఇచ్చి ఎన్నివారాలైందో గమ నించారా? ఎందుకు చంపలేదు? మీ అధి కారుల చేతకానితనమా? లేక నా తృప్తి కోసం షూటింగ్ ఆర్డర్ యిచ్చి మీ అధికా రులకు దాన్ని చంపొద్దని లోపాయికారిగా చెప్పారా? "

"అయ్యో! ఎంతమాట.. మీతో పరాచి కాలా? " అన్నాడు బాంగ్డియా. మనసులో మాత్రం 'నేనేమీ నీలా రాజకీయనాయకుణ్ణి కాదు. బైటికొకటి మాట్లాడి లోపల్లోపల మరొకటి చేయడానికి' అనుకున్నాడు.

"మరి ఇన్నాళ్ళూ మీవాళ్ళు ఏం చేస్తు న్నట్టు? ఆ పులితో దాగుడుమూతలు ఆడుకుంటున్నారా? మరో రెణ్ణెళ్లలో ఎలక్ష న్లున్నాయి. నా నియోజకవర్గంలోని ప్రజ లకు ఏం సమాధానం చెప్పాలి? ఏ ముఖం పెట్టుకుని వాళ్ళ దగ్గరకు ఓటడగ టానికి వెళ్లాలి? మీరే చెప్పండి"

"మా వాళ్ళు మాత్రం శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు సార్! వాళ్ళ ప్రయత్న లోపమేమీ లేదు. కానీ ఆ పులి ప్రస్తుతం కన్పించడం లేదు"

"మంత్రాలొచ్చిన పులినా అది? అకస్మా త్తుగా మాయమైపోయిందా? "

"మీరెంత వెటకారంగా మాట్లాడినా నిజం మాత్రం అదే. ఆ పులి మా టీంలో ఉన్న గుంజన్ అనే వ్యక్తిమీద దాడి చేసింది. గుంజన్ దాన్ని కత్తితో రెండు చోట్ల గాయపర్చాడు. అప్పటి నుంచీ దాని ఆచూకీ తెలియడం లేదు. బహుశా గాయాల వల్ల ఏ పొదల్లోనో పడి చచ్చి పోయి ఉంటుందని అనుకుంటున్నాం"

"అలాగని చెబితే ప్రజలు నమ్ముతారను కున్నారా? వాళ్ళకు రుజువులు కావా లండీ. కనీసం ఆ పులి కళేబరాన్ని తీసు కొచ్చి చూపించండి"

బాంగ్డియా నీళ్ళు నమిలాడు. "మావాళ్ళు అడవిలోని అంగుళం అంగుళం గాలిస్తున్నారు సార్! కొద్దిగా

ఓపిక పట్టండి. అది బతికుంటే తుపాకీతో కాల్చి మీ కాళ్ళముందు పడేస్తాం. ఇప్పటికే చచ్చిపోయి ఉంటే దాని కళేబరాన్ని చూపిస్తాం"

"ఇంకా ఎంతకాలం ఓపిక పట్టాలండీ? ఎలక్షన్లయిపోయి నేను ఓడిపోయాకనా? మీవాళ్ళకు చేతకాకపోతే చెప్పండి. నాకు తెల్సిన పోచర్లున్నారు. ఒక్కరోజు చాలు. చెప్పిన పని పూర్తిచేసుకుని వస్తారు. మీ ఫారెస్టుగార్డులని ఆ రోజు కళ్ళు మూసుకో మనండి చాలు"

"సార్! ఇది ప్రభుత్వం చేయాల్సిన పని. మా ఫారెస్టు డిపార్ట్‌మెంట్ బాధ్యత"

"అందుకేగా ఈ దేబిరించడం. నేను మీకు ముందే చెప్పాను.. ఈసారి గెలిస్తే మాత్రం అటవీశాఖ మంత్రిని కావడం ఖాయమని. అలా కాకుండా మీరే మోకా లడ్డు పెడ్తున్నారే"

"అయ్యో! ఎంతమాట! మీరు మంత్రిపద వినలంకరిస్తే మాలాంటి వాళ్ళకు శ్రీరామ రక్ష అనుకునే వాళ్ళలో నేను మొదటివా డిని సార్!"

"మాటలొద్దు! చేతల్లో చూపించండి!"

"ఏం చేయాలో మాకూ అర్థం కావడం లేదు సార్! గత రెండువారాలుగా ఓ పులి తిరుగుతున్నట్టు మా కెమెరా ట్రాపుల వల్ల తెలుస్తోంది. మొదట ఆ పులే మేం వెతు కుతున్న పులి అనుకుని మావాళ్ళు కూడా పొరబడ్డారు. కానీ జాగ్రత్తగా గమనించాక ఆ పులి వేరే పులి అని నిర్ధారణకు వచ్చారు"

అప్పటివరకూ కోపంతో రగిలిపోతున్న వంజారి ఒక్కసారిగా చల్లబడిపోయాడు. అతడి భ్రుకుటి ముడిపడింది. "మళ్ళా చెప్పండి మీవాళ్ళు పొరబడ్డారా? ఎందుకు పొరబడ్డారు? ఆ పులి వేరే పులని ఎలా నిర్ధారణకు వచ్చారు? "

"మేం పులుల్ని వాటి చారల్ని బట్టి గుర్తుపడ్తాం. మనిషి చేతుల్లోని గీతల్లా ఒక్కోపులికి ఒక్కోరకంగా ఉంటాయి చారల అమరికలు. ఇప్పుడు అడవిలో తిరుగుతున్న పులి ఒంటిమీది చారలు అచ్చం మాన్ ఈటర్‌గా మారిన పులి చారల్లానే ఉన్నాయి. ఎటొచ్చీ ఆ పులికి కుడితొడ మీద నల్లటి చార ఒకటుంది. అలాంటి చార ఈ పులికి లేదు. అంతే తేడా! అందుకే మా వాళ్ళు మొదట్లో పొర బడ్డారు. బహుశా ఒకే కాన్పులో పుట్టిన పిల్లలయి ఉండొచ్చు"

వంజారి అపుడు హాయిగా నవ్వాడు.. ఆనందంతో పగలబడి నవ్వాడు.. తెరలు తెరలుగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు? "

"సమస్యకు పరిష్కారం ఎదురుగ్గా పెట్టు కుని అడవంతా గాలిస్తుంటేనూ నవ్వు రాక ఏమవుతుంది? "

"పరిష్కారమా? ఏంటది? "

"ఇపుడు కన్పిస్తున్న పులిని చంపే యండి. అనుభవం ఉన్న మీ ఉద్యోగులే గుర్తుపట్టలేకపోయారు కాబట్టి సామాన్య జనానికి అనుమానమే రాదు. పులి చచ్చి పోయిందని నిశ్చింతగా నిద్రపోతారు. నాకు ఓట్లు పడతాయి. నేను మంత్రిన వుతా" అన్నాడు వంజారి.

ఆ మాటలు వినగానే తన ఒడిలో పిడు గుపడ్డట్టు అదిరిపడ్డాడు బాంగ్డియా. "అది చాలా దుర్మార్గం సార్! మాన్ ఈటర్‌గా

**కొత్తగాలి...**

**ఎండ కన్నా వేడిగా**
**నిప్పు కన్నా ఎర్రగా**
**పెట్రోల్, డీజిల్**
**ధరలు**

– *టి.ఎల్.ఆర్. ప్రసాదరావు,*
మచిలీపట్నం

# నీటి కబుర్లు!

నీరు లేనిదే మనిషి జీవనం సాగదు. భవిష్యత్తులో నీటి కోసం యుద్ధాలు కూడా జరుగుతాయని సామాజిక వేత్తలు చెప్తున్నారు.

★ నీటికన్నా రక్తం చిక్కనైనది. మనిషి రక్తం నీళ్లకన్నా ఆరు రెట్లు చిక్కగా ఉంటుంది.



★ ఓ కారు తయారీకి 39వేల గేలన్ల నీరు అవసరం అవుతుంది. ప్రపంచంలోని నదులు అన్నిటిలో ఉన్న నీటి కంటే వాతావరణం లోని నీరు అధికం!

★ ఆవు ఒక గేలన్ పాలు ఇవ్వడానికి, నాలుగు గేలన్ల నీటిని తాగాలి.

★ ప్రపంచంలోని మొత్తం నీటి వనరులలో 3 శాతం మాత్రమే తాగడానికి ఉపయోగిస్తున్నాం. మిగతాదంతా ఉప్పునీరే!

★ ఇంట్లోని నీటివినియోగంలో 35 శాతం బాత్‌రూమ్‌లలో ఉపయోగించేదే.

★ నీటి ద్వారా వ్యాప్తి చెందే వ్యాధులతో ప్రపంచ వ్యాప్తంగా ఏటా 40 లక్షల మంది మరణిస్తున్నారు.




★ వ్యవసాయం 70 శాతం, పరిశ్రమలు 22 శాతం నీటిని వినియోగిస్తున్నాయి. మిగిలిన 8 శాతం ఇళ్లు, బళ్లు, ఆఫీసులు వినియోగిస్తున్నాయి.

★ ఆఫ్రికాలోని దేశాల్లో యుద్ధం కన్నా, నీటి ద్వారా వ్యాపించే డయేరియాతో ఏడు రెట్ల మంది మరణిస్తున్నారు.

★ మనిషి శరీరంలోని 70 శాతం నీరే! అందులో 2 శాతం నీరు తగ్గినా మెదడు, శరీర పనితీరులో 20 శాతం సమర్థత తగ్గుతుంది.

★ పాములు నీళ్లల్లో కాటు వేయవు.

★ సూపర్ బజార్‌లో విక్రయించే ఓ పౌండ్ కాఫీ తయారీకి 11 వేల లీటర్ల నీరు అవసరం అవుతుంది.

మారిన పులిని చంపడానికి ఆర్డర్ వేయడానికే తటపటాయించినవాడిని.. దీనికి ఒప్పుకుంటానని ఎలా అనుకున్నారు? చాలా అన్యాయం సార్! ఈ పులేమీ మనుషుల్ని చంపడంలేదు. అటువంటి పులుల్ని రక్షించడానికేగా మా అందరికీ ప్రభుత్వం జీతాలు ఇస్తోంది. నేనా పని చేయలేను"

"చేయాలి! తప్పదు! నా రాజకీయ భవిష్యత్తంతా దీనిమీద ఆధారపడి ఉంది. గ్రామాల మీద పడి మనుషుల్ని చంపుతున్న పులిని షూట్ చేయిస్తానని బీరాలు పలికి చివరికి అది జరక్కపోతే ప్రజలకు నా మీద నమ్మకం పోదా? ప్రజల ప్రాణాలు కాపాడటానికి ఇంత చిన్నపనిని కూడా సాధించలేని వ్యక్తిని మళ్ళా ఎమ్మెల్యేగా గెలిపించినా మనకేం ఒరగబెడ్తాడు అనుకుని ఛీ కొట్టరా? "

"ఎలక్షన్లో ఎలా గెలవాలనేది మీ సమస్య. ఈ విషయంలో నేనేమీ సాయం చేయలేను. సారీ సార్!" అన్నాడు కృతనిశ్చయంతో బాంగ్డియా.

"అంతేనంటారా? " నవ్వుతూనే అడిగాడు వంజారి.

తనలా చెప్పగానే కోపంతో మండిపడ్తాడనుకున్న వ్యక్తి ఎందుకు నవ్వుతున్నాడో అర్థం కాలేదు బాంగ్డియాకి. "అంతే సార్! ఎట్టి పరిస్థితుల్లోనూ ఓ పులికి బదులు మరో పులిని చంపడమనేది జరగదు. జరగనివ్వను. మీ రాజకీయ పలుకుబడి నాకు తెలుసు. నా ఉద్యోగం వూడిపోయినా నేను సిద్ధమే. అటువంటి దుర్మార్గపు పని మాత్రం చేయను" అన్నాడు.

వంజారి నవ్వుతూనే తన లాల్చి కుడి జేబులోంచి నోట్లకట్ట తీసి బల్లమీద పెడ్తూ "ఇప్పటికైనా చేయరా? " అన్నాడు.

బాంగ్డియా గుటకలు మింగుతూ నోట్ల

కట్ట వైపు చూశాడు. అన్నీ వేయి రూపాయల నోట్లు.

తన పట్టు విడవకుండా "చేయను" అన్నాడు బాంగ్డియా.

అతని స్వరం బలహీనంగా విన్పించింది. అందులో సన్నటి వణుకు ఉండటం గమనించాడు వంజారి.

వంజారి ఎడం జేబులోంచి మరో కట్ట తీసి బల్లమీద పెట్టాడు. "రేపు నేను మంత్రినయ్యాక మీకు ఇప్పించబోయే ప్రమోషన్లకిది బోనస్ మాత్రమే"

బాంగ్డియా కొన్ని సెకన్లు మాత్రమే ఆలోచించాడు. నవ్వుతూ ఆ రెండు కట్టలు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు.

**కొత్తగాలి...**

**రంగు రంగు పూలతో**
**విరబూస్తుంది వనం**
**రకరకాల సంస్కృతులతో**
**మురుస్తుంది జనజీవనం**

*- ముడుంబ సీత,*
*భద్రాచలం, ఖమ్మం జిల్లా*

లేచి నిలబడి షేక్‌హ్యాండ్ ఇస్తూ "మీరు కోరుకున్నట్టే జరుగుతుంది సార్! రెండ్రోజుల సమయం ఇవ్వండి. పులిని చంపి ప్రజల ముందు ప్రదర్శనకు పెడ్తాం" అన్నాడు.

"అది జరిగిన రోజు మా యింట్లో మీకు విందు ఏర్పాటు చేస్తాను" అన్నాడు వంజారి.

★ ★ ★

పులిని వెంటాడి చంపడానికి అరవై మందితో కూడిన స్పెషల్ టీంను ఏర్పాటుచేశారు. అందులో అటవీశాఖకు చెందిన అధికార్లతోపాటు, పోలీసు సిబ్బంది, నలుగురు షార్ప్ షూటర్లు ఉన్న స్పెషల్ టాస్క్‌ఫోర్స్ అది. పులి కదలికల్ని పసిగట్టడానికి షికారీలూ, వైల్డ్‌లైఫ్ ప్రొటెక్షన్‌తో సంబంధమున్న ఎన్జీవో సంస్థల సిబ్బందీ అందులో ఉన్నారు. పులి వాత బడిన గ్రామాల్లోంచి కొంతమంది యువకులు స్వచ్ఛందంగా ముందుకొచ్చారు. దీనికి 'ఆపరేషన్ టైగర్' అని పేరు పెట్టారు.

మొదట కెమెరా ట్రాప్‌ల ఆధారంగా ముందుకు కదిలారు. చేతుల్లోని భూతద్దాలతో షికారీలు నేల మీద పులి అడుగుజాడల కోసం వెతుకుతున్నారు. అడవిలో చాలా లోపలికెళ్ళేంత వరకూ వాళ్ళకు పులి ఆనవాలు దొరకలేదు. మరికొంత ముందు కెళ్ళాక దట్టంగా ఉన్న పొదల మధ్య సగానికి పైగా తినేసిన ఓ జింక కళేబరం కన్పించింది.

పులి తప్పకుండా ఈ దరిదాపుల్లో ఉంటుందన్న నిర్ణయానికొచ్చిన సిబ్బంది పులి కోసం మాటు వేయడానికి అనువైన స్థలం కోసం చుట్టుపక్కల వెతికారు. ఓ అర్ధకిలోమీటర్ దూరంలో ఎత్తుగా గుట్ట కనిపించింది.

భూమికి దాదాపు పదడుగుల ఎత్తున్న గుట్ట. తమతోపాటు తెచ్చిన మేకపోతుని గుట్టకు దిగువనున్న చెట్టుకి కట్టేసి సిబ్బంది మొత్తం గుట్టపైకెక్కి కాచుకుని కూచున్నారు. షార్ప్ షూటర్లు తుపాకుల్ని ఎక్కుపెట్టి గుట్ట అంచున బోర్లాపడుకుని దృష్టిని నలువైపులా సారించారు.

మేక అరుపులు పెద్దవి కాసాగాయి. రాబోతున్న ప్రమాదాన్ని పసిగట్టినట్టు మేక గింజుకోసాగింది. చెట్టుకి కట్టి ఉన్న తాడుని తెంపుకోడానికి శతవిధాలా ప్రయత్నిస్తోంది. షూటర్లు అప్రమత్తమయ్యారు. చెట్లమధ్యలోంచి పులి ప్రత్యక్షమైంది.

మెల్లగా కదుల్తున్న పులివైపు తుపాకులు గురిపెట్టారు. మేక చెట్టుచుట్టూ తిరుగుతూ తాడుని గుంజుకుంటోంది. పులి

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

- ★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య సహా ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.
- ★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర నవల' అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీనికి అనుగుణంగా రచయితలు నవలల్ని రాసి పంపాలి.
- ★ ప్రచురణకు స్వీకరించని నవలలు తిప్పి పంపేందుకు వీలుగా తగినన్ని స్టాంపులు అంటించిన సొంత చిరునామా గల కవరు జతపరచాలి. స్టాంపులు అంటించని నవలలు ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి.
- ★ నవలలపై నిర్ణయం తెలియజేయడానికి 6-8 వారాలు పడుతుంది. ఫోన్/ఎస్సెమ్మెస్/ ఈమెయిల్ ద్వారా మా నిర్ణయాన్ని తెలియజేస్తాం. గడువులోగా సమాచారం అందకపోతే మమ్మల్ని సంప్రదించవచ్చు.
- ★ నవలతోపాటు మీ చిరునామా, ఫోన్ నెంబరు, ఈ మెయిల్ వివరాలు స్పష్టంగా రాయాలి.
- ★ సంపాదకులను ఉద్దేశించి 'హామీ పత్రం' తప్పనిసరిగా పంపాలి. హామీ పత్రం లేని నవలలు పరిశీలించలేమని మనవి.

## నమూనా హామీ పత్రం

సంపాదకులు చతుర!

ఫలానా నవలను 'చతుర'లో ప్రచురణార్థం పంపుతున్నాను. ఈ నవల నా సొంతం. దేనికీ అనువాదం కాదు. ఒకవేళ అనువాదమైతే (అనువాద నవల ఫలానా భాషా రచయితది (రచయిత పేరు). ఫలానా పబ్లిషర్‌నుంచి, ఫలానా భాషలో స్వీకరించి అనువదించాను).

ఈ నవలను ఇంతవరకూ ఏ పత్రికకూ పంపలేదు. ఏ పత్రిక పరిశీలనలోనూ లేదు. ఏ వెబ్‌సైట్, బ్లాగులో కానీ ప్రచురితం కాలేదు. ఈ అనువాద నవలకు మూల రచయిత/రచయిత్రి/ ప్రచురణకర్తల నుంచి అనుమతి పొందాను/ పొందలేదు. ప్రచురణకు స్వీకరించని పక్షంలో తిప్పి పంపటానికి స్టాంపులు అంటించిన కవరు జతపరిచాను/లేదు.

తేదీ:

స్థలం: సంతకం:

**చిరునామా** : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఫోన్ : 23318181, Ext: 6658, 6532 ఈ మెయిల్: vipula.chatura@gmail.com

మేకని కట్టేసిన చెట్టుకి పదడుగుల దూరంలో నిలబడింది. షూటర్లు ఒకరితో మరొకరు సైగల ద్వారా మాట్లాడుకు న్నారు. మేక మీద పులి ఎప్పుడు ఎటాక్ చేస్తుందో తెలియదు. మేక ఏ వైపు ఉన్న ప్పుడు దానిమీదికి దుముకుతుందో వూహించడం కష్టం. అదే సమయంలో తుపాకీ పేలి, తూటా దానికి తగలకుండా మిస్సయితే పులి బెదిరిపోయి పారిపోయే ప్రమాదముంది. ఈసారి ఎవ్వరూ రిస్క్ తీసుకోదల్చుకోలేదు. అందుకే వేచి చూడ టానికే నిర్ణయించుకున్నారు.

పులి మరికొంత ముందుకు జరిగింది. ఒక్కసారిగా ఎగిరి మేక మీద పడింది. దాని బరువుకి మేక నేలకు అతుక్కుపో యింది. పులి దాని మెడను కొరికి పట్టు కుంది. మేక కొద్దిసేపు విలవిల్లాడి ప్రాణాలు వదిలింది. మేక శరీరం మీద ముందరి రెండు కాళ్ళేసి నిలబడిన పులి ఇక ఆహారం తనదేనన్న ధీమాతో చూస్తోంది. అదే అదనుగా షూటర్లు తుపాకీలు పేల్చారు. నాలుగు తుపాకు ల్లోంచి వెలువడిన తూటాలు పులి శరీ రంలో వివిధ భాగాల్లో దిగబడ్డాయి. ఒక తూటా నేరుగా దాని తలలో దిగబడింది. క్షణాల్లో పులి విగతజీవిగా మారింది.

'ఆపరేషన్ టైగర్' సిబ్బంది ఒక్కసారిగా హర్షధ్వానాలు చేశారు. పులిలో చలనం ఆగిపోయిందని నిర్ధారించుకుని గుట్టదిగి పులిని సమీపించారు. కొంతమంది యువ కులు దాని కాళ్ళకు తాళ్ళు కట్టి రెండు కర్ర లకు తాళ్ళను వేలాడదీసి నాలుగువైపులా నలుగురు యువకులు మోసుకుంటూ తమ గ్రామానికి తీసుకెళ్ళారు.

గ్రామంలోని ప్రజలందరూ తిరునాళ్ళలా కదిలివచ్చారు. వాళ్ళ కళ్ళకు పులిని చంపిన షూటర్లు హీరోలుగా కన్పించారు. పులిని షూట్ చేశారన్న వార్త తెలియగానే వంజారి ఆఘమేఘాల మీద అక్కడికి చేరుకున్నాడు. అతన్ని చూడటం ఆలస్యం ప్రజలందరూ ఒక్కపెట్టున 'వంజారీ జిందాబాద్' అంటూ నినాదాలు చేశారు. వంజారి కోరుకున్నదదే. అక్కడ గుమికూ డిన ప్రజలనుద్దేశించి పంజారి ప్రసంగిం చాడు. ఈ పులిని చంపడానికి తను ఎంతగా ప్రయత్నించాడో, అటవీ అధికారు లను ఎన్నిసార్లు కలుసుకోవాల్సి వచ్చిందో వివరంగా చెప్పాడు. చివర్లో "నేనున్నదే మీ క్షేమం కోసం. నా జీవితమంతా మీకే అంకితం. మీ కోసం ప్రాణాలు ఇమ్మన్నా నేను సిద్ధమే. తొందర్లోనే ఎలక్షన్లు రాబో తున్నాయి. కాబట్టి మరో ఐదేళ్ళు మీకు సేవ చేసుకునే భాగ్యాన్ని కలుగచేయవల్సిం దిగా కోరుకుంటున్నాను" అన్నాడు.

'మా నేత వంజారి! కాబోయే మంత్రి వంజారి! వంజారి జిందాబాద్!" అనే నినా దాలు మిన్నుముట్టాయి.

★ ★ ★

ఎమ్మెల్యే వంజారి యింట్లో ఓ ప్రత్యేక మైన గది.. ముఖ్యమైన వ్యక్తులకు విందులూ వినోదాలూ అందించడానికి నిర్దేశించిన విశాలమైన గది. అప్పటికే బాంగ్డియా రెండో పెగ్గులో ఉన్నాడు. బ్లూ లేబుల్ విస్కీ వెచ్చగా గొంతులోకి దిగు తోంది. ఎదురుగా ప్లేట్లో ఉన్న పిట్ట మాంసం కూర నంజుకుని తింటుంటే స్వర్గం బెత్తెడు దూరంలో కన్పిస్తోంది.

"ఎంత రుచిగా ఉందో ఈ కూర! తమరు ఏ పిట్టమాంసం వండించారో సెలవిస్తారా? " మాట తడబడుతూ అడి గాడు బాంగ్డియా.

వంజారి గుంభనంగా నవ్వాడు. "ఏదైతేనేం? మీకు నచ్చింది కదా! అంతేచాలు! మన రాష్ట్రంలో ఉన్న అడవులన్నిటికీ మీరే కదా పెద్ద. అందుకే మీ కోసం స్పెషల్‌గా చేయించిన వంటకమది"

"సస్పెన్స్‌ని నేను తట్టుకోలేను. ఇంత రుచిగా ఉండే మాంసం ఎన్నడూ తిని

# నిరసన ఆత్మహత్యలు

చతుర సమాచారం

నిరసన మనిషి హక్కు. మనదేశంలో నిరసన తెలుపుతూ ప్రజాధనాన్ని ధ్వంసం చేస్తుంటారు. కానీ కొన్ని దేశాల్లో ఏకంగా ఆత్మహత్య చేసుకున్న సందర్భాలున్నాయి. (ఇటీవల మన దేశంలో కూడా పబ్లిక్‌గా ఆత్మహత్య చేసుకుని నిరసనని తెలియచేస్తున్నారు)

★ ఏప్రిల్ 2015లో యు.ఎస్. కేపిటల్ బిల్డింగ్(చట్టసభ)లో సామాజిక అన్యాయానికి నిరసనగా ఒకరు తుపాకీతో కాల్చుకున్నాడు.

★ మార్చి 2015లో పశ్చిమ చైనాలోని టిబెట్‌లో మత గురువు దలైలామాని టిబెట్‌లోకి రానివ్వనందుకు నిరసనగా యెషీకాండో అనే ఆమె నిప్పంటించుకుని మరణించింది.

★ 2013లో ప్యారిస్‌లోని నోట్రడామ్ కెథడ్రిల్‌లో డామ్నిక్ వెర్నర్(75) అనే ఆయన సేమ్ -సెక్స్ వివాహాలకి వ్యతిరేకంగా తుపాకీతో కాల్చుకున్నాడు.

★ 2015లో బీజింగ్‌కి చెందిన యా వైలిన్(73) ప్రభుత్వం మీద నిరసన తెలియజేస్తూ తన ఇంట్లో ఉరి వేసుకుని మరణించాడు. కారణం 1989లో తియానన్మెన్ స్క్వేర్‌లోని విద్యార్థుల మరణకాండలో అతని కొడుకు ప్రాణాలు కోల్పోయాడు. కొడుకు యా ఇగు యో(22) నిజానికి తన గర్ల్‌ఫ్రెండ్‌తో ఆ స్క్వేర్‌కి కొద్దిదూరంలో షాపింగ్ చేస్తుంటే కాల్చిచంపారు.

★ 2014లో టెక్సస్‌లోని గ్రాండ్ సెలైన్ అనే పార్కింగ్ లాట్‌లో చార్లెస్ మూర్(79) అనే ఫాదర్ వర్ణ వివక్షతకి మరణశిక్షకి నిరసనగా కాల్చుకుని మరణించాడు.

★ చెకొస్లొవేకియా మీద రష్యా దాడికి నిరసనగా పోలీస్ పౌరుడు రిస్‌జార్డ్ సివైక్ ఓ స్టేడియంలో లక్షమంది ముందు కాల్చుకుని మరణించాడు. కానీ రష్యన్స్ ఈ వార్తని బయటికి పొక్కనివ్వలేదు.



★ డిసెంబర్ 2010లో టునీషియాలో రోడ్డుమీద అమ్మే వ్యాపారి తారిక్ అల్ తయబ్ మహమ్మద్ పెట్రోల్‌తో కాల్చుకుని మున్సిపల్ ఆఫీస్ ముందు మరణించారు. కారణం అతని వస్తుసామగ్రిని కార్పొరేషన్ అధికారులు జప్తు చేయడమే. టునీషియాలో తిరుగుబాటుకి ఇది ఒక ప్రధానకారణం అయింది.

ఎరుగను. చెప్పండి ఏ పిట్టదో? కౌజు మాంసమా?"

"కాదు. నెమలి పిట్ట మాంసం!"

నోట్లో మరోముక్క పెట్టుకోబోతున్న బాంగ్డియా క్షణకాలం నివ్వెరబోయి, శిలా ప్రతిమలా బిగుసుకుపోయాడు. వెంటనే తేరుకుని బిగ్గరగా నవ్వేస్తూ ఆ ముక్కని నోట్లో పెట్టుకుని దాని రుచిని ఆస్వాదిస్తూ అన్నాడు "చివరికి నాతో మరో నేరం కూడా చేయించారన్నమాట. నెమళ్ళని వేటాడితే జైలుశిక్ష వేయించాల్సిన అధికారితోనే నెమలి మాంసం తినిపిస్తున్నారు. ఏమైనా మీ రాజకీయ నాయకులు అసాధ్యులు సార్!"

"మీరు నా కోసం ఎంతో రిస్క్ చేశారు. మాన్ ఈటర్ కాని పులిని కూడా మాన్ ఈటర్‌గా ముద్రవేసి 'షూట్ ఎట్ సైట్' ఆర్డర్ ఇచ్చి నా పరువు నిలబెట్టారు. మీకీ విందు ఎప్పటికీ గుర్తుండిపోవాలని ఇలాంటి స్పెషల్స్ చాలా చేయించా. భోజనంలోకి దుప్పి మాంసం వేపుడు కూడా ఉంది. ఎలాగూ మీకు మీరు ఇలాంటివి తినలేరు. మీ కాన్షియస్ ఒప్పుకోదు. మా రాజకీయ నాయకులకైతే ఆ కాన్షియసే ఉండదుగా! సమస్యే లేదు" అంటూ నవ్వాడు వంజారి.

"మీ అదుపాజ్ఞల్లో పన్జేసే పోచర్ల ముఠా ఉండనే ఉందిగా! అడవిలోంచి ఏ జంతువుని పట్టుకు రమ్మన్నా క్షణాల్లో తెచ్చి మీ కాళ్ళముందు పడేస్తారు. మీకెదురేముంది? మా డిపార్ట్‌మెంట్‌వాళ్ళు కూడా మీ మనుషులంటే చూసీచూడనట్టు వదిలేస్తారుగా"

"కాబోయే అటవీశాఖ మంత్రికీ, అటవీ శాఖ అధికార్లకీ మధ్య ఆ మాత్రం లోపాయికారి ఒప్పందాలు లేకపోతే మజా ఏముంటుంది చెప్పండి?" మూడో పెగ్‌ని అతని గ్లాస్‌లోకి ఒంపుతూ అన్నాడు వంజారి.

"మీరు త్వరలోనే మంత్రి కావడం ఖాయం. మీరూ నేనూ కలిసి అడవుల్ని

కొత్తగాలి...

**సారముంటేనే**
**సంసారం రసవంతం!**
**సాయమందితేనే**
**వ్యవసాయం ఫలవంతం!!**

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ.గో. జిల్లా

దున్నేద్దాం! ఈ రాష్ట్రంలో ఉన్న అడవులన్నీ మనవేగా! అడవిలోని చెట్లూచేమలు, పక్షులూ జంతువులూ అన్నీ మనవే. మనదే రాజ్యం" అంటూ పెద్దగా నవ్వాడు.

సుష్టుగా తిని, నోట్లో కిళ్ళీ దట్టించి, రాత్రి పదకొండింటికి బైటికొచ్చాడు బాంగ్డియా.

అతన్ని సాగనంపడానికి కారు దాకా వచ్చాడు వంజారి.

అదే సమయంలో అడవి మధ్యలో ఆకలితో అలమటిస్తున్న పులి అసహనంతో గాండ్రించింది.

దాని ఎడమతొడ్డకైన గా యంవల్ల అది వేగంగా పరుగెత్తలేకపోతోంది. దానివల్ల జంతువుల్ని వేటాడి పట్టుకోవడంలో విఫలమవుతోంది. ఆకలితో ఏ దుప్పి వెంటనో పడటం, అది దొరక్కుండా తప్పించుకోవడంతో నిరాశపడటం.. గత కొన్నిరోజులుగా ఇదే తంతు. డొక్కలో గాయం పెద్దదయి, దాన్నుంచి రక్తమూ, చీమూ కారి, దాంతోపాటు ఓ రోజు కత్తి కూడా రాలిపోయింది. ఆ గాయం మాత్రం రోజురోజుకూ పెరుగుతోంది తప్ప మానేలా కన్పించడం లేదు.

ఒంటరిగా ఉన్న మనుషుల్ని చంపడమే చాలా సులువైన పని అని దానికర్థమైంది. తన ఆకలిని చల్లార్చుకునే అవకాశం కోసం ఆ పులి ఎదురుచూస్తోంది. దాని డొక్కలో ఉన్న గాయం సలపడంతో అది ఈసారి బాధతో గాండ్రించింది.. బలహీనమైన గాండ్రింపు.

బాంగ్డియా వంజారితో చేయికలుపుతూ "మనం పరస్పరం సహకరించుకుందాం" అన్నాడు.

"మన బంధం మరింత గట్టిపడాలని కోరుకుంటున్నాను" అన్నాడు వంజారి.

ఇద్దరూ పెద్దగా నవ్వారు. ఆ నవ్వు ఎలా ఉందంటే అడవిలో ఉన్న పులుల కన్నా క్రూరమైన రెండుకాళ్ళ జంతువులు అడవుల్ని నమిలి మింగేయడానికి సమాయత్తమవుతూ అరిచిన భయంకరమైన గాండ్రింపులా ఉంది.

ఆ శబ్దానికి అడవిలో ప్రశాంతంగా నిద్రపోతున్న పక్షులూ జంతువులూ పీడకల కన్నట్టు ఉలిక్కిపడి లేచాయి.

ఆహారం కోసం సంచరిస్తున్న జంతువులు భయంతో రెండడుగులు వెనక్కి వేశాయి. మునుల్లా మౌనంగానిలబడి ఉన్న చెట్లు భూమి కంపించినట్టు తల్లడిల్లిపోయాయి. రాబోయే ఉపద్రవాల్ని తల్చుకుని అడవి అడవంతా పెనుతుపానులో చిక్కుకున్న చిగురుటాకులా వణికిపోయింది. ©

పెద్ద కథ

# ప్రతీకారం

ఎండ వేడికి అడవంతా హాహాకారాలు చేస్తోంది. మే నెల కావడంతో ఉష్ణోగ్రత నలభైఏడు డిగ్రీలకి చేరుకుంది. ఆకాశంలో చంద్రనిప్పులని కురిపిస్తున్న భానుడి ప్రతాపానికి పశుపక్ష్యాదులు, చెట్టు చేమ.. ఒకటేమిటి అన్నీ తమ జీవశక్తిని కోల్పోసాగాయి. ఎండవేడికి నీరంతా ఆవిరవటంతో నీటి చుక్క కోసం అడవి కూనలు అల్లల్లాడసాగాయి. ప్రకృతి ఆక్రోశం ముందు జీవకోటి తలవంచక తప్పలేదు.

అడవులతో నిండిన ఆ పర్వత ప్రాంతంలో ఎండవేడి కారణంగా రోడ్లు వేసే పని నత్తనడకన నడుస్తోంది. రోడ్డు దిగి ముందరకెళితే ఒకటి అరా గ్రామాలు కనబడతాయి. రోడ్డునానుకుని వరుసగా ఉండే ఆ పూరి గుడిసెల మధ్య కొన్ని ఆస్బెస్టాస్‌తో చేసిన ఇళ్ళు ఉన్నాయి. పాములా మెలికలు తిరిగిన ఆ కొండదారి వెంబడి ఇంకాస్త దూరం వెళితే నాలుగైదు పక్కా ఇళ్ళు దర్శనమిస్తాయి. అంగన్‌వాడి, ప్రాథమిక పాఠశాల అందులోనే ఉన్నాయి. అప్పుడప్పుడు ప్రౌఢశిక్ష కార్యక్రమంలో భాగంగా అక్కడ సాయంత్రం పూట చదువు చెప్తుంటారు. వేసవి సెలవులు కావటం మూలాన బళ్ళోకొచ్చే పిల్లల సంఖ్య పూర్తిగా తగ్గిపోయింది. ఎండ విపరీతంగా వుండడం వల్ల కాబోలు మధ్యాహ్నం పథకం కింద భోజనానికొచ్చే పిల్లలు సైతం పత్తా లేకుండా పోయారు. కనీసం కొంతమందైనా భోజనానికి రాకపోతారా అనుకుంది రీనా. గ్యాస్ అయిపోయి ఐదు రోజులు కావస్తోంది. అయినా ఇంకా రాలేదు. ఇంత వేడిలో కట్టెల మీద వంట చేయడం అంటే అయ్యే పని కాదు. పైగా ఆస్బెస్టాస్ కప్పు కావటం మూలాన ఇల్లంతా సెగలు కక్కుతోంది. దానికి తోడు రెండు రోజులుగా కరెంట్ లేకపోవడంతో శరీరమంతా కుతకుత ఉడుకుతున్నట్లుగా వుంది. ఎండ వేడిని భరించలేని రీనా, కాలు కాలిన పిల్లిలా బయటకీ, లోపలికీ తిరుగుతూ, మధ్యమధ్యలో నీళ్ళ తొట్టె దగ్గరకెళ్ళి ముఖం మీద నీళ్లు చిలకరించుకుంటూ నానా అవస్థలు పడుతోంది.

**ఒడియా మూలం : పారమితా శతపథీ**

**అనువాదం : డా. ఆర్. రాజ్యలక్ష్మి**

అంతలో ఆమెకి బయట మోటార్ సైకిల్ ఆగిన శబ్దం వినపడింది. ఈ సమయంలో ఎవరొచ్చుంటారు? తమ్ముడు టుకు అడవిలో మీటింగ్ ఉందని మధ్యాహ్న భోజనానికి రానని మరీ మరీ చెప్పి వెళ్ళాడు. కార్యకర్తలు చాలామంది వస్తారు. కాబట్టి వాడు రాత్రికి ఆలస్యంగా వచ్చినా ఆశ్చర్యపోనవసరం లేదు. గుమ్మం తలుపు ఎప్పుడూ తెరిచే ఉంటుంది. ఇంత నిప్పులు కక్కుతున్న వేడిలో తలుపులు వేసి కూర్చోటం అంటే అగ్నిగుండంలో

కూర్చోవడంతో సమానం. దొడ్లోంచి బయటికి వచ్చిన రీనా, తెరిచిన తలుపుల మధ్య నుంచి బయటికి చూసింది.

బయట మోటార్ సైకిల్ మీద ఇద్దరు కుర్రాళ్ళు కూర్చుని తెరిచి వున్న తలుపుల నుంచి లోపల ఎవరైనా వున్నారా అని చూస్తున్నారు. తమ్ముడి స్నేహితులు వస్తూపోతూ ఉంటారు. చాలామంది 'ఇదేం గ్రామం? ఈ రోడ్డు ఎక్కడికె ళుతుంది?' అంటూ ప్రశ్నిస్తూ ఉంటారు.

మిట్టమధ్యాహ్నం వేళ ఇంత ఎండలో వచ్చిన ఈ ఆగంతకులు ఎవరో రీనాకి అర్థం కాలేదు. రబీజానీ ఇంకా రాలేదు. వచ్చినవాళ్ళు వెళ్లటంలేదు, అలాగని మోటార్ సైకిల్ దిగటం లేదు. ఇంట్లో తను ఒకర్తే ఒంటరిగా ఉంది. అవసరమొస్తే చుట్టుపక్కల నుంచి రావటానికి ఒక్క పురుగు కూడా లేదు. రీనాకి భయం వేసి, లోపలికెళ్ళి గొలుసు తీసుకొచ్చి తలుపు గొళ్ళెం పెడదామని అనుకుంటుండగా 'తాగటానికి కాసిని నీళ్ళు దొరుకుతాయా? దాహంతో నోరు ఎండిపోతోంది?' అన్న మాటలు వినపడ్డాయి. రీనా వాళ్ళిద్దరి వేపు తేరిపార చూసింది. వాళ్ళిద్దరూ 'నీళ్ళు ఇవ్వకపోతుందా' అని ఎంతో ఆశగా ఆమె వేపు చూస్తున్నారు. నెత్తిన టోపీ, టీషర్ట్, జీన్స్ ప్యాంట్ వేసుకున్న వాళ్ళని చూడగానే ఎక్కడికో వెళుతూ దాహం తీర్చుకోవటానికి ఆగారని అర్థం అయింది రీనాకి.

రీనాకి ఒక్క క్షణం భయం వేసింది. 'ఏం చేయాలి? వాళ్ళ మాటలు వినబడనట్టు తలుపు వేసేస్తే? కానీ పాపం వాళ్ల మొహాలు చూస్తే దప్పికగొన్నవాళ్ళలా వున్నారు. పాపం ఎక్కడి నుంచి వస్తున్నారో, ఏంటో? తను అనవసరంగా వాళ్ళని అనుమానిస్తోందేమో?'

"ఎండ వేడికి గొంతు, నాలుక పిడచకట్టుకుపోతున్నాయి. దగ్గరలో మీ ఇల్లు తప్ప యేమీ కనబడటం లేదు. ఆగిపోయాం" అంటూ ఆ ఇద్దరిలో ఒకడు రీనా సమాధానం ఇచ్చేలోగానే వచ్చి వరండాలో కూర్చున్నాడు. రెండో అతను మోటార్ సైకిల్ స్టాండ్ వేసి అక్కడే నిలుచున్నాడు.

రీనా ఒక్క క్షణం వాళ్ళ ఇద్దరి వేపు చూసి లోపలికెళ్ళి రెండు గ్లాసుల్లో చల్లటి నీళ్ళు తీసుకొచ్చి వాళ్ళకిచ్చింది. వాళ్ళిద్దరూ ఆమె చేతుల్లోంచి గ్లాసు లాక్కున్నట్లుగా తీసుకుని గడగడా తాగి ఖాళీ గ్లాసులు ఆమెకిస్తూ "మరొక్క గ్లాసు నీళ్ళు ఇవ్వగలరా?" అంటూ ప్రాధేయపడ్డారు. రీనా లోపలికెళ్ళి వాళ్ళకి మళ్లీ నీళ్ళు తీసుకొచ్చి ఇచ్చింది. ఆ తరువాత మోటార్ సైకిల్ వెనకాల కూర్చున్న కుర్రాడు ఆమె చేతికి ఖాళీ బాటిల్ ఇచ్చి "దయచేసి దీన్ని నింపి ఇవ్వగలరా?" అంటూ అడిగాడు.

అతను బాటిల్ తీసుకుంటూ "చాలా థ్యాంక్స్. మా ప్రాణాలు నిలబెట్టారు" అంటూ చిరునవ్వుతో ఆమె దగ్గర నుంచి వీడ్కోలు తీసుకున్నారు. వాళ్ళు వెళ్ళటం తరువాయిగా రీనా గబగబా తలుపు గొళ్ళెం పెట్టి గుమ్మాన్ని ఆనుకుని నిలుచుండిపోయింది. తన పొట్ట నింపుకోవటం కోసం రెండు బిందెల తాగే నీరు, కొద్దిపాటి చితుకులు, బయట నీటితొట్టెలో రోజువారీ వాడకానికి.. నీళ్ళు తెచ్చి పోస్తూ వుంటాడు రబీజానీ. పిల్లలు వస్తే నీటి వాడకం ఎక్కువవుతుంది. ఇవాళ ఎక్కడికెళ్ళాడో యేంటో ఇంత వరకు పత్తాలేడు. ఈ ఎండలో ఇలా తనొక్కతే ఒంటరిగా బిక్కుబిక్కు మంటూ కూర్చుంది.

టుకు, సాయంత్రానికల్లా వస్తానని అన్నాడు. అతగాడి కోసం ఎదురు చూస్తూ కూర్చునేసరికల్లా అర్థరాత్రి గడిచిపోయింది. మొబైల్ తీసుకుని వెళ్ళటం మర్చిపోయాడు. దాంతో ఎప్పుడొస్తాడో అర్థం కాకుండా వుంది. ఉదయమైనా కూడా

రాకపోవటంతో రీనాకి తమ్ముడి గురించి ఆరాటం మొదలైంది. రెండుమూడు నెలలుగా గమనిస్తోంది. తమ్ముడు ఎక్కడి కైనా వెళితే రెండుమూడు రోజులదాకా పత్తా వుండడంలేదు. కొండ కింద ఉన్న బజారులో ఎస్టీడీ బూతు తెరిచాడు. ఈ తిరుగుడులో పడి దాన్ని కూడా తెరవటం లేదు. తమ్ముడి భవిష్యత్తు ఆమెలో ఆరాటాన్ని రేపింది. రబీజానీకి ఇల్లు అప్పగించి సైకిల్ తీసుకుని సామాన్లు తేవటానికి బజారుకి బయలుదేరింది రీనా.

రోడ్డెక్కిన ఆమెకి వెనకనుంచి మోటార్ సైకిల్ వస్తున్న శబ్దం వినబడింది. తల తిప్పి వెనక్కి తిరిగి చూసిన రీనాకి, వాళ్ల ఇంటికొచ్చి నీళ్ళు తాగి వెళ్లిన ఆగంతకుడు దర్శనమిచ్చాడు. కాకపోతే అతని వెంట అతని మిత్రుడు లేడు.

"నిన్న రెండుగ్లాసుల నీళ్లిచ్చి మీరు నా ప్రాణాలను కాపాడారు. మీకు మరోమారు థ్యాంక్స్ చెప్పటానికి కాబోలు, మీరు కనబడేలా చేశాడు దేవుడు"

అతని మాటలు వింటూనే రీనా సైకిల్ దిగి నిలుచుని చిరునవ్వు నవ్వింది.

"ఇక్కడ ఎండాకాలం ఎప్పుడూ ఇలాగే నిప్పులు చెరుగుతూ ఉంటుందా? మనిషి బతకాలా వద్దా, ఈ ఎండలకి..? ఉఫ్" అని రీనా వేపు తిరిగి "మీరు ఇక్కడి వాస్తవ్యులేనా? " అని ప్రశ్నించాడు.

> ## కొత్తగాలి...
>
> **ఓటుకు నోట్లు**
> **కొందరికి కోట్లు**
> **నేతల ఫీట్లు పరిపాలనకు తూట్లు**
> **ప్రజాస్వామ్యానికి వెన్నుపోట్లు!!**
>
> *- అంబటి వెంకటశివారెడ్డి,*
> యర్రగుంట్ల, కడప జిల్లా

రీనా కాదన్నట్టుగా తల అడ్డంగా ఊపి "నేను అంగన్‌వాడిలో ఉంటాను. మా గ్రామం కైసింగా దగ్గర ఉంది" అంది.

"నేను మొదటిసారి ఇటువేపుగా వచ్చాను. ఇక్కడ అటవీ ప్రాంతంలో రోడ్లు వేసే పని నేను చూస్తూ ఉంటాను. అరణ్యాలతో నిండిన ఈ కొండప్రాంతం చాలా ఆహ్లాదకరంగా ఉంది. నేనిక్కడికి వచ్చి వారమే అయింది"

రీనా అతగాడి మాటలకి ఎలాంటి స్పందనా చూపలేదు.

అతనే తిరిగి మాటలు పొడిగిస్తూ "నా పేరు రతన్‌సింహ్, నేను చండీఖోల్ గ్రామంలో ఉంటాను. మా గ్రామం పేరు మీరు వినే ఉంటారు" అన్నాడు.

రీనా తల అడ్డంగా ఊపింది, తను వినలేదన్నట్టుగా.

అతను ఆమెని చూసి నవ్వుతూ "పని మీద వెళుతున్నట్టున్నారు" అన్నాడు.

"బజారుకి వెళుతున్నాను"

"నేను కూడా అక్కడికే వెళుతున్నాను" అన్నాడు ఉత్సాహంగా.

రీనా అతని మాటలు పట్టించుకోనట్టు సైకిల్ ఎక్కింది.

"నేనెప్పుడైనా అటువైపు వస్తే, మీరు తాగటానికి నీళ్లు ఇస్తారు కదూ" వెనక నుంచి అతని మాటలు ఆమెకి వినబడ్డాయి. రీనా తలతిప్పి సమాధానంగా చిరునవ్వు నవ్వింది.

"మరోసారి థ్యాంక్స్" అంటూ అతను మోటార్‌సైకిల్ స్టార్ట్ చేశాడు.

బజారు నుంచి తిరిగి వచ్చేసరికల్లా సాయంత్రం బాగా ఆలస్యమైంది. దూరం నుంచి, తమ్ముడు వరండాలో కూర్చుని ఉండటం గమనించి రీనా మనసు కాస్త నెమ్మదించింది.

"ఏరా! రెండు రోజులనుంచి ఎక్కడెక్కడ తిరుగుతున్నావు? ఇంట్లో అక్క ఒక్కత్తే ఉంటుందన్న ఆలోచన నీకసలు ఉండదా?

వెళ్లినవాడివి రావటానికి వీలు కావటం లేదని కనీసం కబురైనా పెట్టాలనిపించలేదా? " అంటూ తమ్ముడి మీద కోపంతో విరుచుకుపడింది రీనా.

"తల్లీ కాస్త ఆగుతావా! ఆకలితో కడుపు నకనకలాడుతోంది. బిర్యానీ చేసినట్టున్నావు. ముందు దాని పని పట్టాక నీతో మాట్లాడతాను"

రీనా బజారు నుంచి తెచ్చిన సామాన్లు గబగబా లోపల పెట్టేసి, బిర్యానీ, ఆలు భుజియా ప్లేటులో పెట్టి, తీసుకొచ్చి తమ్ముడి చేతికిచ్చి అతనికెదురుగా కూర్చుంది.

"అసలు ఏమనుకుంటున్నారు వీళ్ళు? చెప్పుతో నల్లిని నలిపినట్టు నలిపేద్దామని అనుకుంటున్నారా? మనందరినీ మట్టిలో పూడ్చిపెట్టేసి దాని మీద ఫ్యాక్టరీలు కట్టేద్దామని అనుకుంటున్నారా? అడవి బిడ్డల దగ్గరి నుంచి డబ్బు దండుకుని వాళ్ల వ్యక్తిత్వాన్ని కాలితో తొక్కి నేల రాద్దామనుకుంటే అది కేవలం వాళ్ల మూర్ఖత్వం మాత్రమే" ప్లేటులో బిర్యానీ పట్టుకుని ముక్కుపుటాలు ఎగరేస్తూ ఆవేశపడిపోతున్న తమ్ముడివేపు ఆశ్చర్యపోతూ చూసింది రీనా.

"పిచ్చి పట్టినట్టుగా ఏంటి ఆ అరుపులు? జరిగేదేమిటో సరిగ్గా చెప్తే కదా.. అర్థమయ్యేది. రెండు రోజుల నుంచి పిచ్చివాడిలా తిరిగి ఇంటికొచ్చావు. ముందు పెట్టింది తిను. ఆ తరువాత నీ ఆక్రోశాన్ని వింటాను" అంటూ రీనా అతని ఆవేశాన్ని చల్లపరచటానికి ప్రయత్నించింది.

"అక్కా, మనం పోట్లాడదాం! మనం బతికుండగా వాళ్ళని ఒక్క అడుగు కూడా ముందుకు వేయనీయొద్దు. మన ఒంట్లో ఆఖరి రక్తం బొట్టు ఉండేవరకు మనం పోరాడుతూనే ఉందాం. ఆ తరువాత ఆదివాసి పిల్లలు, స్త్రీలు ఈ పోరాటాన్ని జయప్రదం చేస్తూ ముందుకు నడిపించండి" టుకు చీకటిని చూస్తూ మాట్లాడసాగాడు.

రీనా అతగాడి మాటలకి సమాధానం చెప్పలేదు. కాసేపు ఇద్దరి మధ్య మౌనం రాజ్యమేలింది. టుకు, అన్యమనస్కంగా తింటూ ఆలోచనలో పడ్డాడు.

'అసలు వీళ్ళు ఎక్కడికెళుతున్నారు? మీటింగుల పేరుతో ఏం చేస్తున్నారు? మీటింగుకని వెళ్లి వచ్చినప్పుడల్లా టుకు ఇలాగే వాగుతూ ఉంటాడు. దేన్ని గురించి అడిగినా జవాబు చెప్పడు. గ్రామాల్లో, అడవి మారుమూల ప్రాంతాల్లో వీళ్ళంతా చేరి ఏం చేస్తున్నట్టు? తమ్ముడి ప్రవర్తన అర్థం కాకుండా ఉంది' అతని భవిష్యత్తుని తలచుకుని దిగులుపడింది రీనా.

మర్నాడు ఉదయాన్నే బయలుదేరిన తమ్ముడిని చూసి అతన్ని ఆపటం అనవసరం అనుకుని "కాస్త అటుకులు-బెల్లం అయినా తినివెళ్లరా" అంటున్నా వినిపించుకోకుండా వెళ్లిపోయాడు టుకు. ఈ రోజు కాస్త ఎండ తీవ్రంగా ఉండదేమో అనుకున్న రీనా మాటలని అబద్ధం చేస్తూ సూర్యుడు తన ప్రతాపాన్ని చూపసాగాడు. 'ఇక ఈ రోజు కూడా పిల్లలు రారు' అనుకుంటున్న రీనా చెవులకి మోటార్‌సైకిల్ ఆగిన శబ్దం వినిపించింది.

రీనా బయటికొచ్చి చూసింది. తను ఎదురుచూస్తున్న వ్యక్తి ఎదురుగా కనబడ్డాడు. అతను రతన్‌సింహ్. ఒంటరిగానే

## కొత్తగాలి...

**తక్కువ**
**కోర్కెలున్నవారే**
**ఎక్కువ**
**ధనవంతులు**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్, ఆదిలాబాద్ జిల్లా

వచ్చాడు.

"ఈ రోజు నిజంగా చాలా దాహంగా ఉంది. రెండు గ్లాసుల చల్లటి నీళ్లు దొరుకుతాయా? " అంటూ రతన్‌సింహ్ మోటార్‌సైకిల్ దిగి లోపలికొచ్చాడు.

రీనా పెదవులపై చిరునవ్వు తళుక్కున మెరిసింది. లోపలికెళ్లి రెండు చేతులతో రెండు గ్లాసుల నీళ్లు తీసుకొచ్చి అతని చేతి కందించింది.

"ఇక్కడ కరెంట్ ఉంది కదూ? "

"ఉంది.. కానీ కరెంట్ రాక నాలుగు రోజులయింది. ఉండటానికి టేబుల్ ఫ్యాన్ అయితే ఉంది. కానీ అది ప్రస్తుతం పనిచేయటం లేదు"

"కరెంట్ ఎందుకు రావటం లేదు? తుపాను, వర్షాలు గట్రా లేవు కదా? "

"ఏమో.. ఏమయిందో యెవరికి తెలుసు? ఈ ఎండ వేడికి కరంట్ తీగలు కాలి ఆగిపోయాయేమో? "

"ఇక్కడ ఈ విషయాలు పట్టించుకునే వాళ్ళెవరూ లేరనుకుంటాను. అంతేకాదు, అసలు మాట్లాడదామనుకున్నా కూడా మనుషులు కనిపించనే కనిపించరు. అవును, మీరొక్కరే వున్నారు. మీ తల్లితండ్రులు మీతో వుండరా? "

"లేదు. తమ్ముడు నాతో వుంటాడు. నేను స్కూలు కూడా నడిపిస్తాను. వేసవి సెలవులు కదా. అందుకే పిల్లలు లేరు" అంది రీనా.

"పిల్లలు చదువుకోవటానికి వస్తారా? అయితే టీచర్ వుండివుండాలే? " అంటూ అడిగాడు రతన్‌సింహ్.

"ఆ వస్తారు. వాళ్ళకి యిష్టం అయితే వస్తారు, లేకపోతే లేదు. మధ్యాహ్న భోజన పథకం వుంది. దానికి ఆశపడి వస్తారు. యిక టీచరంటారా? వానరాకడ, ప్రాణంపోకడ అన్నట్టుగా వుంటుంది ఆయన రావటం- పోవటం"

"మరి మీ తమ్ముడు యేం చేస్తున్నాడు? చదువుకుంటున్నాడా? "

"ఆ.. మెట్రిక్ పాసయ్యాడు. చదవాలని అనుకున్నా కాలేజీ లేకపోవటం మూలాన అంతటితో ఆపేశాడు"

ఆమె మాట్లాడటం పూర్తికాగానే రతన్‌సింహ్ లేచి "అయితే నే వెళ్తొస్తా. నీళ్ళిచ్చినందుకు థ్యాంక్స్" అంటూ మోటార్‌సైకిల్ దగ్గరకెళ్ళి "రేపు వస్తాను" అంటూ వెనక్కి తిరిగి రీనాని చూశాడు. ఎందుకో తెలియదు కానీ అతగాడి మాటలకి రీనా ముఖం సిగ్గుతో ఎర్రబడింది.

మర్నాడు మధ్యాహ్నం అయ్యేసరికల్లా రీనాలో యేదో తెలియని ఆరాటం మొదలయింది. తన ఆరాటాన్ని తగ్గించుకోవటం కోసం బయటకి, లోపలికి తిరగడం మొదలెట్టింది. మనసు మాటిమాటికీ రతన్‌సింహ్ వస్తాడని అంటున్నా ఎక్కడో ఏదో అనుమానం. అతను వస్తే అతనితో ఏం మాట్లాడోలో కూడా ఆలోచించి పెట్టుకుంది. మధ్యాహ్నం గడిచిపోయింది. సాయంత్రం కావస్తున్నా రతన్‌సింహ్ జాడ లేదు. రీనా అతగాడికోసం ఎదురుచూసి-చూసి అలిసిపోయి వరండాలో చాప వేసుకుని పడుకుంది. ఇంతలో హఠాత్తుగా మోటార్‌సైకిల్ వస్తున్నట్టుగా శబ్దం అవటంతో రీనా, హడావుడిగా లేచి కూర్చుంది.

"ఈ రోజు దాహంతో పాటు ఆకలి కూడా వేస్తోంది. టీ తాగితే ఎలా వుంటుందా అని అనుకుంటున్నాను" అన్నాడు రతన్‌సింహ్, రీనాని చూసి అల్లరిగా నవ్వుతూ.

రీనా కూడా చిరునవ్వు నవ్వింది.

"తమ్ముడు యింకా రాలేదా? సాయంత్రం అయితే తను వుంటాడని అనుకుని వచ్చాను"

"బహుశా దుకాణంలోనే వుండుంటాడు"

"సరే, ఈలోగా టీ తెచ్చిపెట్టు"

"పాలు లేవు" అంటూ రీనా సిగ్గుపడింది.



"టీ పొడి, పంచదార వున్నాయా? " రతన్‌సింహ్ మాటలకి రీనా వున్నాయన్నట్టుగా తల వూపింది.

"మరింకేం, తెచ్చేసేయ్" అంటూ రతన్ సింహ్ నవ్వాడు.

గ్యాస్ లేకపోయినా చితుకులు వెలిగించి బ్లాక్ టీ తయారుచేసి, కప్పులో పోసి, దానితోపాటు కొన్ని బిస్కెట్లని కూడా ప్లేటులో సర్ది అతని చేతికి అందించింది.

"చాలాసేపు పట్టిందే టీ తయారుచేయడానికి? "

"గ్యాస్ లేదు కదా" అంటూ రీనా, నీళ్ళు తీసుకురావటానికి లోపలికి వెళ్ళింది.

ఆమె తిరిగివచ్చాక "రా, వచ్చి కూచో"

అన్నాడు.

రీనా, అతని మాటలు విని కూడా అలాగే బొమ్మలా నిలుచుండిపోయింది.

"ఇక నుంచి మీరు దేనికీ యిబ్బంది పడే అవసరం వుండదు. గ్యాస్ దొరుకు తుంది. కరెంట్ యికపై పోనేపోదు. బజారు కోసమని కిందికి వెళ్ళే అవసరం ఉండదు. మంచి మంచి స్కూళ్ళు, కాలేజీలు వస్తాయి. అన్ని సదుపాయాలూ ఉన్న హాస్పిటల్. ఒకటేమిటి అన్నీ తలుచుకున్న మరుక్షణం వచ్చేస్తాయి. ఓ విధంగా చెప్పాలంటే ఈ ప్రదేశం రూపురేఖలే మారిపోతాయి" రతన్‌సింహ్, రీనా వైపు చూడకుండా తన ధోరణిలో తాను చెప్పుకుంటూ పోతున్నాడు.

రీనా మారు మాట్లాడకుండా అతను చెప్పేవన్నీ వింది.

"మేం ఇక్కడ ఏం చేస్తున్నామో నీకు తెలియదు కదు. చెప్తా విను. ఈ కొండ మీద వాహనాలు రావటానికి-పోవటానికి విశాలమైన రోడ్లు వేస్తున్నాం"

"మైన్స్ కోసం ఇక్కడి కొండల్ని పగలకొడుతున్నారని విన్నాను, నిజమేనా? " రీనా గొంతులో బాధ తొంగిచూసింది.

"అలా అని ఎవరు చెప్పారు? మేం ఏం చేసినా భవిష్యత్తుని దృష్టిలో పెట్టకుని మీరు బాగుపడాలనే చేస్తాం"

"అంటే ప్రస్తుతం మేం బాగుపడే పనులేవీ చేయలేదంటారు. మా భవిష్యత్తు మా చేతిలో లేదు, మీ చేతుల్లో ఉందంటారు. అంతేనా? "

"నువ్వు నా మాటలని తప్పుగా అర్థం చేసుకుంటున్నావు. మేం చేపట్టే పనుల మూలంగా మీ అందరికీ ఉద్యోగాలు వస్తాయి. ఉద్యోగం ఉంటే చేతిలో సమృద్ధిగా డబ్బు ఉంటుంది. మీరు కూడా నాగరిక ప్రపంచంతో పోటీపడి హాయిగా బతకవచ్చు అంటే.. షర్ట్ - ప్యాంట్ వేసుకొని అసలు సిసలైన మనుషుల్లా వుండొచ్చు మీరు కూడా సభ్యత, సంస్కారాలని నేర్చుకోగలుగుతారు" అంటూ రతన్‌సింహ్ ఆమెకి నచ్చచెప్పటానికి విశ్వప్రయత్నం చేయసాగాడు.

"నాగరికుల్లా అంటే మీ వుద్దేశ్యం ఏంటి? వాళ్ళు మాలాగానే వుంటారు కదా. మీరు జీవితంలో అనుభవించే సుఖ, దుఖాలన్నీ మేము కూడా అనుభవిస్తాం. కాకపోతే మీరు అనుభవిస్తున్న సుఖాలు మాకు కరువైనాయి. అవి మాకు కరువైనయని మేము యేనాడూ భావించలేదు. యింతవరకు మేం ఎన్నడూ మాకు ఏదో అన్యాయం జరిగిందని ఎవరినీ దేవులాడ లేదు" రీనా గొంతులో అదే ఆవేశం.

"ఎందుకంత ఆవేశపడతావు? సభ్యసమాజం మీకేమీ యివ్వలేదా? గ్రామాల్లో స్కూళ్ళు వచ్చి పిల్లలు చదువు నేర్చుకుంటున్నారంటే.. కారణం ఎవరు? తాగునీటి కోసం కిందకి వెళ్లకుండా పంపులు వచ్చాయంటే.. కారణం ఎవరు? గ్రామాల్లో కరెంటు వచ్చిందంటే.. యివన్నీ మీ భవిష్యత్తుకి పునాదులు వేసినట్టు కాదా? "

"మీరన్నట్టు జరిగాయి. కానీ నామమాత్రంగానే జరిగాయి. స్కూళ్ళు తెరిచాం అంటున్నారు.. అవి ఎలాంటి స్థితిలో వున్నాయో చెప్పే అవసరం నాకివ్వకండి. మందులు విరివిగా దొరుకుతున్నాయి. కింద బజారులో ఆసుపత్రి వుంది అన్నారు.. మరి డాక్టర్‌ని ఎక్కడినుంచి తెమ్మంటారు? ఇక్కడ విషయాన్నే తీసుకుంటే అంగన్‌వాడి, స్కూల్లోనే కరెంట్ వుంది.. రెండు రోజులు వుంటే పది రోజులు వుండదు!" ఆమె గొంతులో బాధ సుళ్ళు తిరిగింది.

రబీజాని రావటంతో వాళ్ళ మాటలకి బ్రేక్ పడింది. అతను రెండు బిందెల నీళ్ళు తీసుకొచ్చి అక్కడ పెట్టి ఆయాసపడుతూ కింద చతికిలపడ్డాడు. కూర్చుని

చతుర సంగతులు

# మరణ శిక్షలు

చాలా దేశాలు మరణశిక్షను అమలు చేస్తున్నాయి. వాటికి సంబంధించిన కొన్ని సంగతులు.

★ అమెరికాలో సగటున మరణశిక్ష పడిన ప్రతి పాతికమందిలో ఒకరు నిర్దోషి అని తర్వాత తేలుతోంది.

★ అమెరికాలో యావజ్జీవ కారాగారశిక్ష పడే వ్యాజ్యం కోసం పనిచేసే లాయర్ ఫీజ్ కన్నా మరణశిక్ష పడే కేసు వాదించే లాయర్ ఫీజ్ ఇరవై రెట్లు ఎక్కువ ఉంటుంది.



★ అమెరికాలో 32 రాష్ట్రాల్లో మరణశిక్ష అమల్లో ఉంది.

★ 1976 నుంచి డిసెంబర్ 2014 దాకా అమెరికాలో 1,394 మందికి మరణశిక్ష అమలు జరిగింది.

★ 1950లో యూకేలో మరణశిక్ష తొలగించడానికి కొంత వరకు కారణం- తన భార్య, కూతుళ్ళని చంపాడనే నెపంతో ఓ అమాయక భర్తకి మరణ శిక్ష పడడం.

★ సింగపూర్‌లో డ్రగ్స్ దగ్గర ఉన్నా, రవాణా చేసినా మరణశిక్ష తప్పదు.

★ చైనాలోని వ్యాపార సంస్థల నిర్వాహకులు అక్రమార్జన చేస్తే వారికి మరణశిక్ష వేస్తారు.

★ నార్త్ కొరియాలో బైబిల్ దగ్గర ఉన్నా, సౌత్ కొరియాలో సినిమాలు చూసినా, పోర్నోగ్రఫీ చిత్రాలు/ వీడియోలు సరఫరా చేసినా మరణశిక్ష విధిస్తారు.

★ సూడాన్‌లో నేటికీ అధికారికంగా మరణశిక్షని శిలువవేసి అమలు చేస్తున్నారు.

★ మిగతా దేశాలకన్నా చైనాలో మరణశిక్ష అమలు నాలుగు రెట్లు అధికం.

★ అమెరికాలో 1944లో 14ఏళ్ల నల్లజాతి బాలుడ్ని, సాక్ష్యాధారాలు లేకపోయినా రెండు గంటలు విచారించి మరణశిక్ష విధించారు.

★ 1985లో సౌదీ అరేబియాలో 2000 మందికి మరణశిక్ష విధించారు. అక్కడ మెడ కోసి మరణశిక్షని బహిరంగంగా అమలు చేస్తారు.

★ జార్జియా రాష్ట్రంలోని ఓ ఖైదీ మరణశిక్షకి ముందు రాత్రి జైల్లోంచి తప్పించుకుని ఓ బార్లో పోట్లాటకి దిగాడు. ఆ గొడవలో చచ్చిపోయాడు.

---

ఆయాసం తీర్చుకుంటున్న అతగాడికి ఎదురుగా రతన్‌సింహ్ కనిపించేసరికి అతను ఎవరన్నట్టు ప్రశ్నార్థకంగా రీనా వేపు చూశాడు. రీనా ఏమీ మాట్లాడకపోవడంతో బయటికి వెళ్ళిపోయాడు.

"కాస్త అలా బయటికి వెళ్ళి తిరిగొద్దాం వస్తారా?" అంటూ రతన్‌సింహ్ రీనాని నెమ్మదిగా అడిగాడు.

రీనా క్షణకాలం ఆగి, లోపలికెళ్ళి కిటికీలు మూసేసి తలుపు గొళ్ళెం పెట్టి చెప్పులు వేసుకొని అతని వెనకాలే బయటికొచ్చింది. అంగన్‌వాడి పక్కనేవున్న కాలిబాట వెంట వాళ్ళిద్దరూ నడవసాగారు. చుట్టుపక్కల ఎక్కడా యిళ్ళు లేవు. కొండ గ్రామాల్లో సామాన్యంగా ఇళ్ళు పక్కపక్కనే వుండవు. దూరంగా విసిరేసినట్టుగా వుంటాయి. గ్రామానికి గ్రామానికి మధ్య పదిపన్నెండు కిలోమీటర్లయినా దూరం వుంటుంది.

"ఏమన్నా అను ఇక్కడి ప్రజలకి సరైన వసతులేవీ లేవు. ఇంకా వాళ్ళకోసం చేయాల్సింది ఎంతో వుంది" రతన్‌సింహ్, రీనా వేపు చూస్తూ నెమ్మదిగా అన్నాడు.

"సుఖ-భోగాలని అనుభవించటం కోసం ఇక్కడి వాళ్ళు వాళ్ల వ్యక్తిత్వాన్ని అమ్ముకోవటం అవసరం అంటారా? తరతరాలుగా

వస్తున్న తమ వంశాచారాలని, తమ అడవితల్లిని తాము నివసించే ఈ ప్రాంతాన్ని వాళ్ళు మరిచిపోవటం అవసరం అంటారా? ఒక్కమాట చెప్పండి.. అభివృద్ధి పేరుతో మీరు మీ ఆచార-వ్యవహారాలని, వంశప్రతిష్టని, మర్చిపోలేనప్పుడు మరి మేమెందుకు మా దేవుళ్ళని మర్చిపోవాలి? మీరు మీ గుళ్ళని-గోపురాలని రక్షించుకుని, అభివృద్ధి పేరుతో మా కొండ దేవత విగ్రహాలని పగలకొట్టండి, మేం ఇదేమిటని ప్రశ్నించకుండా మాపై ఆంక్షలు విధించండి"

తన మనసులోని కోపాన్ని, కసిని రీనా అతని ముందు వెళ్ళికక్కింది. అంతటితో ఆగకుండా తన మాటలని పొడిగిస్తూ "ఒక్కమాట అడుగుతాను, జవాబు చెప్తారా? మీ దృష్టిలో మీరు అనుభవిస్తున్న జీవితం చాలా ప్రశాంతంగానూ మా జీవితాలకన్నా చాలా గొప్పగానూ వుందని భావిస్తున్నారా? ఓ నగ్న సత్యం చెప్పేదా, మేం మా కర్తవ్యాన్ని మరిచిపోయి ఏనాడూ ప్రవర్తించలేదు. ఎదుటివారికి సహాయం చేయటమే తెలుసుకానీ, వాళ్లని పడగొట్టి వాళ్లమీద నుంచి నడుచుకుంటూ పోవడం మాకు తెలియదు. అవసరానికి మించి డబ్బు సంపాదించాలనే దురాశ మాలో ఏ ఒక్కరికీ లేదంటే బహుశా మీరు నమ్మరు. తిండి కూడా కడుపుకి ఎంత అవసరమో అంతే తింటాం. కానీ ఎదుటివారి నోళ్ళు కొట్టి దాచుకోం. మేం చేస్తున్న ఈ పనులన్నీ హేయమైనవి. అనాగరికతకి చిహ్నాలు అని మీరనుకుంటే మిమ్మల్ని మీరు ఆత్మవంచన చేసుకుంటున్నట్టే కదా!"

"నువ్వు అనవసరంగా నా మీద విరుచుకుపడుతున్నావే కానీ నా మాటలని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం లేదు. దేశంలోని పెద్ద-పెద్ద కంపెనీల వాళ్లు మీరు బాగుపడాలని చేస్తున్న పనులు మీకు కోపాన్ని తెప్పించటం చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఈ రోజు కాకపోతే రేపైనా మీరు వాళ్ళ మంచితనాన్ని గుర్తిస్తారు. ఇకపోతే నీ మాటల్లో వాస్తవం లేదని నేను అనను. ఒక్కటి గుర్తుపెట్టుకో, మీకేదో అన్యాయం చేసి బావుకుందామన్న వుద్దేశం మాలో ఎవరికీ లేదు"

"మా పరిసరాలని శుభ్రం చేసి, మా అందరితో ఖరీదైన రంగు-రంగుల బట్టలు కట్టించి, జూలో వుంచే కోతుల్లాగా మమ్మల్ని వుంచితే గానీ మీరు చెప్పే డబ్బున్నవారి మనసులు శాంతించవు. అంతేగా? " రీనా గొంతులో వ్యంగ్యం తొంగి చూసింది.

"నువ్వు నాగరిక ప్రపంచం గురించి ఇంతలా ఆలోచిస్తావా? చాలా ఆశ్చర్యంగాను, ఆనందంగాను కూడా వుంది" రతన్‌సింహ్ తన మాటలని ప్రశాంతంగా ఆమె ముందు వుంచాడు.

"ఈ కొండ ప్రజలతో రెండు సంవత్సరాలుగా సహజీవనాన్ని సాగిస్తున్నాను. వీళ్ల పరిసరాలే కాదు, వీళ్ళ మనసులు కూడా ప్రశాంతంగా వుంటాయన్నది నమ్మలేని నిజం"

కాసేపు యిద్దరి మధ్య మౌనం రాజ్యమేలింది. రతన్‌సింహ్ ఒక్కవుదుటున లేచి "వెళదామా" అన్నాడు. ఆ సూర్యాస్తమయం వేళ అంతవేడిలోనూ ఎక్కడినుంచో చల్లని పిల్లగాలి వచ్చి వారిద్దరినీ తాకింది.

నడుస్తు నడుస్తూ రీనా ఒక్కసారిగా ఆగిపోయింది.

"ఈ తీయటి సువాసనని మీరు గుర్తించారా? " అంటూ పొదల్లోకి వెళ్ళి తెల్లటి నైట్‌క్వీన్ పూలగుత్తిని కోసుకొచ్చి రతన్‌సింహ్‌ని తీసుకోమన్నట్టు చేయి చాచింది.

"నైట్‌క్వీన్..!" అంటూ రతన్‌సింహ్ పూలగుత్తితో పాటు రీనా చేతిని కూడా అందుకున్నాడు.

క్షణకాలం రీనా ఒళ్ళు జలదరించినట్ట య్యింది. "ఇంత అందమైన - సువాసన భరితమైన పూలు రాత్రివేళలోనే ఎందుకు విచ్చుకుంటాయో? " రీనా అతనితో గుసగు సలాడుతున్నట్టుగా అంది.

అతను రీనా మాటలకి జవాబు చెప్ప కుండా, "రేపు ఇదే సమయానికి నేను వస్తాను. ఇక్కడికి రెండు - మూడు కిలో మీటర్ల దూరంలో, ఎత్తుగా ఉన్న గుట్ట మీద రెండు గదుల ఇల్లు కట్టిస్తున్నాను. బజారుకి దగ్గరగాను ఉంటుంది, నీ దగ్గ రికి రావటానికి వీలుగా ఉంటుంది. నీకు చూపిస్తాను. బాగుందో లేదో చెప్పాలి మరి" నడుస్తున్న ఇద్దరిలో ఏ ఒక్కరికీ

కొత్తగాలి...

**ఆరోగ్యానికి**
**నడక**
**అభ్యున్నతికి**
**నడత**

– తాజీ ప్రసాద్,
చెన్నై

ఎవరి చేయి ఎవరు పట్టుకుని నడుస్తు న్నారో అర్థంకాక ఫక్కున నవ్వుకున్నారు.

మర్నాడు ఉదయాన్నే హఠాత్తుగా ఇంటి ముందు రతన్‌సింహ్‌ని చూడగానే రీనా కంగారు పడింది. ఇంత పొద్దున్నే ఇంటికి రావాల్సిన అవసరం అతగాడికి ఎందుకొ చ్చిందో రీనాకి అర్థం కాలేదు. తమ్ముడు లేడు కాబట్టి సరిపోయింది, లేకపోతే పెద్ద గొడవ చేసి ఉండేవాడు. పైగా నిన్న చీక టిపడే వరకు ఇద్దరూ కలిసే ఉన్నారు.. ఇంతలో ఇంటికి రావాల్సిన అవసరం ఎందుకొచ్చినట్టు?

రతన్‌సింహ్ లేస్తూనే వచ్చినట్టున్నాడు. రేగిన తల, ఎర్రబడ్డ కళ్ళు... రీనా మన సులో ఏదో అనుమానం రేగింది.

"టుకు ఏడి? ఎక్కడున్నాడు? ఇంట్లో ఉన్నాడా? " మోటార్‌సైకిల్ దిగకుండానే కర్కశంగా పలికిన అతని గొంతు ఆమెలో భయాందోళనలని రేపింది.

"బహుశా దుకాణం దగ్గరే ఉండిపో యుండచ్చు"

"ఎప్పుడు వెళ్ళాడు? " అతగాడు ప్రశ్నించే తీరు విచిత్రంగా అనిపించింది రీనాకి.

"కొద్దిసేపు ముందే వెళ్ళాడు" తన గొంతు తనకే భయాన్ని తెప్పిస్తోందని రీనాకి చాలా స్పష్టంగా అర్థం అవుతోంది.

రీనా ధైర్యం తెచ్చుకుని "ఎందుకలా అగుడుతున్నారు? ఏమైంది? " అంది.

"నిన్న రాత్రి ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు ప్రదీప్‌ని కత్తితో పొడిచి చంపి పారిపోయారు. ఈ రోజు ఉదయం అతని శవం బజారు నడిబొడ్డులో కనిపించింది. పోలీసులు విచారణ మొదలుపెట్టారు. చంపినవాళ్ళు ఎవరైనా సరే - తప్పించు కుని పారిపోలేరు" రతన్‌సింహ్ అందరినీ హెచ్చరిస్తూ వెళ్ళిపోయాడు.

రీనా మొహం నెత్తురు చుక్క కూడా లేనట్టు పాలిపోయింది. కాళ్ళ కింద భూమి కదిలిపోతున్నట్టుగా అనిపించింది. మొదటిసారి నీళ్ళకోసం తమ ఇంటికి రత న్‌సింహ్‌తో పాటు, ప్రదీప్ కూడా వచ్చాడు. ఆ తరువాత రతన్ వాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు అతన్ని కలిసింది. అయినా ప్రదీప్‌ని చంపాల్సిన అవసరం ఎవరికుంది?

రీనా చాలాసేపు గుమ్మాన్ని ఆనుకుని చేష్టలుడిగిన దానిలా నిలుచుండిపో యింది. మాటి-మాటికీ ఒకే ప్రశ్న ఆమె మదిలో మారు మోగసాగింది. 'ఎవరు.. ఎవరు.. అతన్ని చంపి ఉంటారు? ' టుకు నిన్నటి నుంచి ఇంటికి రాలేదు. ఎక్కడికె ళ్ళినట్టు? రతన్‌సింహ్‌తో తను టుకు దుకాణానికి వెళ్ళాడని అబద్ధం అయితే

అ
క్ష
రం

పూల పరిమళం
గాలి వాటుకే వెళ్తుంది
కానీ మనిషి మంచితనం
ప్రతి దిక్కుకు ప్రసరిస్తుంది

– చాణక్యుడు



చెప్పింది.

కానీ.. నిజానికి.. లేదు.. లేదు తమ్ముడు ఎదుటివారి ప్రాణాలు తీసేటంత దుర్మార్గుడు కాదు. అంతేకాదు హంతకులతో చేయి కలిపేటంత క్రూర మనస్తత్వం కూడా అతనికి లేదు. తమ్ముడి మీద అనుమానంతో తనని అంగన్‌వాడి నుంచి తొలగిస్తారేమోనని రీనాకి భయం పట్టుకుంది. కానీ అలా జరగలేదు.

"నువ్వు ఆ కాంట్రాక్టర్‌తో చనువుగా ఎందుకుంటున్నావు? " అని అడిగిన తమ్ముడి ముఖం రీనాకి ఒక్కసారిగా గుర్తుకొచ్చింది.

"అదేం లేదు ఒకటి అరా సారి మాట్లాడాను అంతే" అంది తను తమ్ముడితో.

"గుర్తు పెట్టుకో.. వీళ్ళు చాలా దుర్మార్గులు. వీళ్ళేదో మనకి మంచి చేద్దామని వచ్చారని నువ్వు అనుకుంటే పప్పులో కాలేసినట్టే. కొండలని నాశనం చేయటమే కాకుండా ఆదివాసులని అణగదొక్కటమే వీరి లక్ష్యం. వీళ్ళతో ఎలాంటి స్నేహాన్నీ పెంచుకోవద్దు" తమ్ముడు తనకి వార్నింగ్ ఇస్తున్నట్టుగా అన్నాడు.

ఆ రోజు తమ్ముడికి ఎలాంటి జవాబూ తను ఇవ్వలేకపోయింది. తనతో అస్తమానం అల్లరి - చిల్లరిగా గొడవపడే తమ్ముడేనా వీడు? అని రీనాకి అనుమానం వచ్చింది.

రతన్‌సింహ్‌ని తను ఇష్టపడుతున్న సంగతి అతని ముందు ఉంచలేకపోయింది. నిజానికి తామిద్దరూ పెళ్ళి చేసుకుందామని ఏనాడో నిర్ణయించుకున్నారు. తమ్ముడు అనుకున్నంత దుర్మార్గుడు కాదు. తన రతన్.. ఆదివాసుల పట్ల జాలి, దయతోపాటు వాళ్ళకేదో చేయాలనే తాపత్రయం అతనికెంతో ఉందని తనకి అర్థం అయింది. ఒకరోజు తమ్ముడిని కూర్చోబెట్టి ఈ విషయాలన్నీ చెప్పాలని అనుకుంది. కానీ.. ఇంతలో హఠాత్తుగా ఈ సంఘటన ఆమెలో కలకలాన్ని రేపింది.

తమ్ముడు సాయంత్రం అవుతున్నా తిరిగి రాలేదు. ఆమె ఎంతో ఉత్కంఠగా తమ్ముడి కోసం ఎదురు చూడసాగింది. మరో నాలుగు రోజులు గడిచినా తమ్ముడి అత్తా-పత్తా దొరకలేదు. ఈ మధ్యలో రతన్‌సింహ్ కూడా ఆమెని కలవటానికి రాలేదు. ఐదోరోజు అర్ధరాత్రి ఎవరో తలుపుదబదబా బాదుతుంటే ఉలిక్కిపడి లేచి, తెరిచి చూస్తే ఎదురుగా తమ్ముడితో పాటు మరో నలుగురు వ్యక్తులు దర్శనమిచ్చారు.

"అక్కా తినటానికి ఏమైనా ఉందా? " అతని గొంతులో తొందరపాటుని రీనా గుర్తించింది.

ఇంట్లో ఏమీలేవు. కాసినన్ని అటుకులుంటే వాటిని నీళ్ళలో కలిపి పంచదార వేసి వాళ్ళకిచ్చి భయంతో కింద చతికిలపడి కూర్చుంది.

"అక్కా! పోలీసులు మాకోసం వెదుకుతున్నారు. కానీ ప్రదీప్‌ని మేం చంపలేదు. నా మాట నమ్ము. ఎవరో అతన్ని చంపి ఆ నేరం మా మీద వేస్తున్నారు" టుకు ఆయాసపడుతూ రీనాకి చెప్పాడు. రీనా దృష్టి అతని మాటలమీద కన్నా కింద ప

డుతున్న కత్తి మీద, పిస్తోలు మీద పడింది. వాటిని చూడగానే పాముని చూసినంత భయం ఆమెలో కలిగింది.

"అక్కా! తప్పుగా అర్థం చేసుకోకు. ఇవన్నీ మమ్మల్ని రక్షించుకోవటాకే! నీ దగ్గర డబ్బులేమన్నా ఉన్నాయా?" అంటూ టుకు కంగారుగా అడిగాడు.

రీనా పరిగెత్తుకుంటూ ట్రంకు పెట్టె తీసి అందులోని డబ్బంతా లెక్క పెట్టింది. 550 రూపాయలున్నాయి. అవన్నీ టుకు చేతిలో పెట్టింది. టుకు, వాటిని లాక్కున్నట్టుగా తీసుకుని అంగన్‌వాడి వెనగ్గా ఉన్న చెట్ల తోపులోకి అదృశ్యమయ్యాడు.

రీనా నిలుచున్నచోటే తెల్లవార్లూ కూర్చుండి పోయింది. ఉదయాన్నే ఎలా లేచి పనిచేసిందో ఆమెకే తెలియదు. అంగన్‌వాడి పిల్లలొస్తే వాళ్లకి పాట నేర్పింది. వాళ్ళ చదువు గురించి, వాళ్ళ భోజనం గురించి ఆలోచించింది. తలంతా తమ్ముడి ఆలోచనలతో నిండిపోవటంతో ఏమీ చేయలేని అశక్తత ఆవహించి వాళ్ళకి బిస్కెట్లు ఇచ్చి పంపేసింది. సాయంత్రం అయ్యేసరికల్లా రబీజాని వచ్చి "నీళ్లు తేవాలా?" అంటూ అడిగాడు. రీనా అతని మాటలు వినిపించుకోకుండా "రతన్‌సింహ్‌ని ఎక్కడైనా చూశావా?" అంటూ ప్రశ్నించింది. అతను తెలియదనటంతో అతన్ని పంపేసి, ఇంటికి గొళ్ళెం పెట్టి సైకిల్ ఎక్కి బయలుదేరింది.

రోడ్డు మీద వెళుతున్నంత సేపు ఆమె రతన్‌సింహ్ కనిపిస్తాడేమోనని వెనక్కి తిరిగి చూస్తూనే ఉంది. చీకట్లో ఆ ఎత్తు రోడ్డు మీద వెళ్లడం ఆమెకి చాలా కష్టంగా ఉంది. మూడు కిలోమీటర్లు వెళ్లాక ఆమెకి ఆయాసం రావటం మొదలెట్టింది. దాన్ని కూడా లెక్క చేయకుండా రీనా ఎలాగో అతని ఇంటికి చేరుకుంది. కానీ తాళం కప్ప వెక్కిరిస్తూ కనబడేసరికి ఆమె నీరు కారిపోయింది. గత్యంతరం లేక ఇంటికి తిరిగి వచ్చేసింది. రాత్రంతా తెలియని ఆరాటం ఆమెని నిద్రపోనీయలేదు. ఉదయం అవుతూనే ఏదోవిధంగా రతన్‌సింహ్‌ని వెతికిపట్టుకోవాలని నిశ్చయించుకుంది. ఇంటిదగ్గర దొరక్కపోయినా బజారులోనైనా అతన్ని కలుసుకుని, తమ్ముడి మీద అతనికున్న అపార్థాన్ని తుడిచివేయాలని గట్టిగా అనుకుంది. సాయంత్రం అయ్యేవరకు అతనితో ఎలా మాట్లాడాలో నెమరు వేసుకుంటూ కూర్చుంది.

సాయంత్రం కోసం ఎదురుచూస్తున్న ఆమెకి సూర్యాస్తమయం ఆనందాన్ని కలిగించింది. ఇంటికి తాళం వేసి సైకిలు తీసుకుని బయటపడింది. ఎత్తుగా ఉన్న రోడ్డు మీద సైకిల్ తొక్కటం కష్టం అయినా తప్పలేదు రీనాకి. రతన్‌సింహ్ ఇంటికి వెళ్ళేముందు సైకిల్‌ని ఎవరూ చూడకుండా చెట్ల మాటున దాచింది. ఎప్పటిలాగానే దొడ్డిదోవన అతని ఇంటికి చేరుకుంది. దొడ్డివేపు ఉన్న తలుపు తెరిచి ఉంది.

బయట ఓ పెద్ద కారు ఆగి ఉంది. సామాన్యంగా రతన్‌సింహ్ రమ్మనమని చెప్పినప్పుడే వెళ్ళడం ఆమెకి అలవాటు. కారణం ఇక్కడికి అతను చాలా అరుదుగా వస్తాడు. అతనితోపాటు అతని మిత్రులు రావటం కద్దు.

రీనా కాసేపు బయటే నిలుచుండిపోయింది. లోపలికి వెళ్ళవచ్చో లేదో ఆమెకి తెలియడం లేదు. కారణం లోపల అతగాడి స్నేహితులు ఉన్నారు. అడుగులో అడుగులు వేసుకుంటూ నెమ్మదిగా రతన్‌సింహ్ ముందు గది కిటికీ దగ్గరికి చేరుకుంది. లోపల నుంచి నవ్వులు వినిపిస్తున్నాయి. చెవులు రిక్కిరించి వాళ్ల మాటలు వినటం మొదలెట్టింది, రీనా.

"వీళ్ళు చాలా అమాయకులు. చంపినా కూడా నోరు తెరిచి మాట్లాడే ధైర్యం లేదు" అంటున్నాడు రతన్‌సింహ్.

# వింత సేవలు




విచిత్రమైన సేవలని అందించే అనేక సంస్థలు విదేశాల్లో పని చేస్తున్నాయి.

★ జపాన్‌లోని అనేక సంస్థలు కష్టమర్స్ తరఫున వెళ్ళి క్షమాపణలు వేడే సేవని 96 డాలర్లకి అందిస్తున్నాయి. ఏడుస్తూ చెప్పడానికి అదనపు రుసుము వసూలు చేస్తారు.



★ లాస్‌వెగాస్‌లో తాగి హేంగోవర్‌లో బాధపడేవారు హేంగోవర్ హెవెన్ అనే బస్‌లోకి ఎక్కి ఆ బాధలోంచి బయటపడొచ్చు. వాంతులని నివారించే మందులు, గ్లూకోస్ పెట్టడానికి, వాపు రాకుండా మందులు ఇవ్వడానికి, ఓ రాత్రంతా చీకట్లో నిద్రకి.. 240 డాలర్లు తీసుకుంటారు.

★ పారిస్‌లో పార్టీలకి వెళ్ళే వాళ్ళకి జోడీ లేక పోతే వారి వయస్సు, ఎత్తు, రంగుని బట్టి పార్టీకి తీసుకెళ్ళడానికి సరైన జోడీని పంపుతారు. ఇందుకు కొంత రుసుము వసూలు చేస్తారు.

★ కొత్త ఊళ్ళో హోటల్ గదిలో బస చేసే వారు ఒంటరిగా ఫీలవకుండా, తోడుకోసం యు.కె.లో ది హేపీగెస్ట్ హోటల్ లాడ్జ్ అనే సంస్థ గోల్డ్ ఫిష్ ఉన్న బౌల్‌ని రోజుకి 5 పౌండ్ల చొప్పున అద్దెకిస్తుంది. ఆ చేపని చూస్తుంటే చక్కటి కాలక్షేపం.

★ ఇజ్రాయిల్‌లో ఓ స్పా యజమాని కీళ్ల నొప్పులని తగ్గించడానికి పాములతో శరీరాన్ని మసాజ్ చేయించుకునే సేవని కొంత రుసుముకి అందిస్తున్నాడు.

★ ఆస్ట్రేలియాలోని ఓ సంస్థ పిల్లలకి అమ్మమ్మ/నాయనమ్మలని అద్దెకిచ్చే సేవని అందిస్తోంది. పుట్టినరోజులు, స్కూల్ ఫంక్షన్ లాంటి వాటికి వారు ఆ బామ్మలని సరఫరా చేస్తారు.

"కానీ ఆ కుర్రాళ్ళు చాలా చాకచక్యంగా తప్పించుకున్నారు. ప్రదీప్‌ని వాళ్లే కదా చంపింది"

"ప్రదీప్‌ని చంపుదామని మనం అనుకునే లోపలే వాళ్లు మనకి ఆ ఇబ్బంది లేకుండా చేశారు"

"అతిగా ఆలోచించకు. త్వరలోనే వాళ్ల ఆచూకీ తెలిసిపోతుంది. పై వాళ్ల లీడర్ అక్కని ఎప్పుడో బుట్టలో వేసుకున్నాను. ఆమె ద్వారానే నాకు క్లూ దొరికింది"

రతన్‌సింహ్ గొంతు వినగానే రీనా తనని తాను నమ్మలేకపోయింది. తన గురించి ఎంత నీచంగా మాట్లాడుతున్నాడు?

"ఏదో అనుకున్నాం కానీ! నువ్వు చాలా.. అని మిత్రుడిని చూసి కన్నుగీటాడు. అవును.. ఫ్రెష్ సరుకే కదా..? "

"కాస్త ఓపికపడితే సరుకుని చూడటమే కాదు, రుచి కూడా చూడవచ్చు" అంటున్న రతన్‌సింహ్ మాటలకి అంతా విరగబడి నవ్వసాగారు.

"ఇక్కడి ఆడపిల్లలు అందమైన పువ్వుల్లా తాజాగా ఉండటం కాదు, తొందరగా బుట్టలో పడటంతోపాటు మనం ఆడించిన ట్టల్లా ఆడతారు"

వాళ్ల మాటలు వినే శక్తి రీనాలో ఎప్పుడో నశించిపోయింది.

"నా సరుకు ఉత్త అమాయకురాలు. పెళ్లి చేసుకుంటాననే భ్రమలో ఉంది. అబద్ధపు పెళ్ళిళ్ళు మనం ఎన్ని చేసుకోలేదు? పెళ్లి చేసుకున్నాం అనిపించి నెలరోజులు వాడుకునేది, దుకాణం ఎత్తేసేది" రతన్‌సింహ్ మాటలు రీనాలో ప్రతీకార జ్వాల

అక్షరం

నీ జీవితమే నీకు గురువు
నీ జీవనగమనంలో అది
నిరంతర పాఠాలు
నేర్పుతూనే ఉంటుంది

– బ్రూస్‌లీ



లని రేపాయి. చప్పుడు కాకుండా మెల్లగా పిల్లిలా అడుగులు వెనక్కి వేస్తూ డొంక దారిన తనని ఎవరో తరుముకొస్తున్నంత వేగంగా ఇంటికి పరిగెత్తుకుంటూ వెళ్లింది.

ఇల్లు దగ్గర పడగానే అక్కడి దృశ్యం ఆమె కాళ్లకి ఒక్కసారిగా బ్రేకు వేసింది. ఇంటి తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి. టుకు, మిత్రుడొకరు కాపలా కాస్తున్నట్టుగా పచార్లు చేస్తున్నారు.

రీనాని చూడగానే అతను ఆగిపోయాడు. రీనా అతనితో ఏమీ మాట్లాడకుండా పరిగెత్తుకుంటూ లోపలికి వెళ్లిపోయింది. లోపల వరండాలో ఓ మూల టుకు, అతగాడి మిత్రులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. రీనా వాళ్ల వేపు సైతం చూడకుండా తన గదిలోకి వెళ్లి తలుపేసుకుంది.

ఓల్టేజ్ తక్కువగా ఉండటంతో బల్బు మసగ్గా వెలుగుతోంది. రీనా గదిలోకి వెళ్లి అద్దం ముందర నుంచుని తన ప్రతిబింబాన్ని చూసుకుని ఉలిక్కిపడింది.

"అక్కా! నీకు తెలుసా ప్రదీప్‌ని చంపిన వ్యక్తిని పోలీసులు పట్టుకున్నారు. అతని విరోధులెవరో అతన్ని చంపారట.."

ఉత్సాహంగా చెబుతున్న టుకు, అక్కగారిని చూసి ఆగిపోయాడు. ఆ మసక వెలుతురులో సైతం అతను రీనాని చక్కగా చూడగలుగుతున్నాడు.

రీనా ముఖమంతా ఎవరో గోళ్ళతో రక్కినట్టుగా ఉంది, కంఠం మీద రక్తపు చారికలు కనిపిస్తున్నాయి. ఆమె వేసుకున్న దుస్తులు చిరిగి వేలాడుతున్నాయి. క్షణకాలం టుకు, పరాయివాడిలా ఆమెని చూస్తూ ఉండిపోయాడు.

"అక్కా ఏమైంది? నీకీ అవస్థని కలిగించింది ఎవరు? చెప్పక్కా.. చెప్పు..?" టుకు దుఃఖంతో పూడుకుపోయిన గొంతుతో ఆమెని కుదిపేస్తూ అడిగాడు.

రీనా తమ్ముడివేపు చలనం లేని దానిలా చూస్తూ ఉండిపోయింది. ఆమె కళ్ళల్లోంచి కన్నీరు వరదలాగా పెల్లుబుకుతోంది.

"అక్కా! నాప్రశ్నకి జవాబు చెప్పవేం?" అంటూ మేఘంలా గర్జించాడు. ఆ అరుపుకి వరండాలో కూర్చున్నతని మిత్రులు ఒక్కసారిగా రీనా ఉన్న గదిలోకి వచ్చారు.

"కాంట్రాక్టర్.. రతన్‌సింహ్.. అతని మిత్రులు.." నెమ్మదిగా ఒక్కొక్క మాటే కూడబలుక్కుంటూ చెప్పింది రీనా.

"ఎక్కడున్నారు వాళ్లు?"

"గుట్ట మీద ఉన్న తన ఇంట్లో.." టుకు, తన దృష్టిని అక్కగారి మీద నుంచి మిత్రులవేపు మళ్ళించాడు.

ఆ తరువాత అతను, రీనాని ఇంకేమీ అడగకుండా తుపాను వేగంతో గదిలోనుంచి బయటికి వచ్చి, వరండాలో తాముంచిన మారణాయుధాలను తీసుకున్నాడు. క్రూరజంతువుల్లా భయంకరంగా ఉన్న వాళ్లని ఆపటం ఎవరి తరమూ కాదని రీనాకి తెలుసు. మిత్రులు తనని అనుసరించగా చీకట్లో కలిసిపోయాడు టుకు.

రెండు చేతులతో తలుపులు మూస్తున్న రీనా, పెదవుల మీద అప్రయత్నంగా కసితో కూడిన నవ్వు తళుక్కున మెరిసి మాయమైపోయింది. ©

# విషం

- ఎం.వి.ఎస్.ఎస్. ప్రసాద్

"ఏం నాన్నా! ఇంకా అలాగే కూచున్నావు? విద్యుత్ బర్త్‌డే సెలబ్రేషన్‌కి ఎనిమిది గంటల కల్లా బయలుదేరాలని చెప్పానుగా" అన్నాడు మా అబ్బాయి రామం విసుగ్గా మొహం పెట్టి.

"ఆс ఆс! అదే తయారవుతున్నాను. కాస్త నడుం నెప్పిగా ఉంటేను.." అంటూ నసిగాను, నా బాధను బయటికి చెప్పుకోలేని పరిస్థితి.

"తొందరగా తయారవ్వు. నువ్వు ఆ ఫంక్షన్‌కి రాకపోతే, వచ్చిన వాళ్లకునేను ఏం సమాధానం చెప్పాలి? అయినా వెళ్లేది కారులోనే కదా.." అంటూ నాకు మరొక మాటచెప్పే అవకాశం ఇవ్వకుండా గదిలోంచి హడావిడిగా బయటకు వెళ్లిపోయాడు నా కొడుకు.

నాకు నవ్వొచ్చింది. తన కొడుకు, నా మనమడి మూడో పుట్టినరోజుకి నేను రావాలనే కోరిక కన్నా నేను రాకపోతే ఎందుకు రాలేదోనన్న సంజాయిషీ ఇచ్చుకోవాలన్న భావనే అతని మాటల్లో నాకు ధ్వనించింది.

"ఏమండీ! త్వరగా బయలుదేరండీ. పాపం వాడు బాధపడతాడు" అంది నా భార్య పార్వతి. అయితే ఆవిడ భౌతికంగా అన్న మాటలు కావు అవి. దండ వేసిన ఫొటోలోంచి ఆవిడ వ్యక్తం చేసిన భావన అది!!

"సరే పార్వతీ! మామూలుగా నువ్వు తప్ప ఎవరూ నాతో మాట్లాడరు. కనీసం ఈ రోజన్నా నలుగురినీ చూస్తాను. ఎవరన్నా పలకరిస్తే మాట్లాడతాను" అని పార్వతికి చెప్పి ఒక చేత్తో నడుం పట్టుకుంటూ నెమ్మదిగా లేచాను. పార్వతి పోయినప్పటి నుంచీ నేను ఎక్కడికీ వెళ్లడం లేదు. అదీగాక నా అనారోగ్యం నన్ను ఎక్కడికీ కదలనివ్వడం లేదు. కేవలం అరవై సంవత్సరాలకే ఎన్నో ఆరోగ్య సమస్యలు వచ్చిపడ్డాయి. నా భార్య పార్వతి అయితే ఏభయ్యో ఏటనే హఠాత్తుగా దేవుడితో మాట్లాడాలనిపించి ఆవిడ ఆయన దగ్గరకు వెళ్లిపోయింది.

"రండి మామగారూ!" అన్న నా కోడలి మాటలకి ఉలిక్కిపడి "ఆс వచ్చేస్తున్నా" అంటూ హేంగర్‌కి ఉన్న కండువా అందుకున్నాను.

మా మనుమడు విద్యుత్ పుట్టినరోజు

## చతుర కథలు





## భలేభలే!

ఏప్రిల్ ఆరు, 1483న జన్మించిన రాఫెల్ సరిగ్గా ముప్పై ఏడేళ్లకు పుట్టిన తేదీనే మరణించాడు. డావిన్సీ-మైకలాంజిలోలను గురుతుల్యులుగా భావించాడు. దాంతో వారి సరసన నిలువదగ్గ 'సిస్టైన్ మడోన్నా', 'ది స్కూల్ ఆఫ్ అథెన్స్' వంటి ప్రపంచ ప్రసిద్ధ చిత్రాలను గీశాడు. తను చూసిన సుందర స్త్రీలనే తన చిత్రానికి మోడల్‌గా ఎంచుకునేవాడు.

అత్యంత ఆర్భాటంగా జరిగింది. వందల సంఖ్యలో అతిథులు వచ్చారు. ఇంద్రభవనం లాంటి హోటల్ చూసేసరికి నా కళ్లు చెదిరిపోయాయి.

మా రామం చిన్నప్పుడు అందరం తిరుపతి వెళ్లాం. "ఏమండీ పెద్ద హోటల్‌కి వెళితే బోలెడు ఖర్చు. చిన్న హోటల్‌లోనే భోజనాలులాంటివి కానిచ్చేద్దాం" అన్న పార్వతి మాటలు గుర్తుకు వచ్చి కళ్లు చెమర్చాయి. మేమిద్దరం పైసా పైసా లెక్క చూసుకుని ఎంతో పొదుపుగా నెట్టుకొస్తేగానీ మా జీవితం గడవలేదు. నేను కండువాతో కళ్లు వత్తుకోవడం ఆ జిలుగు వెలుగులలో ఎవ్వరికీ కనిపించలేదు.

కేక్ కటింగ్ కార్యక్రమం ప్రారంభం అయ్యింది. 'హ్యాపీ బర్త్‌డే టూ యూ' అనే పాట వినిపిస్తుండగా, విద్యుత్ కేక్ మీద అమర్చిన కేండిల్స్ ఆర్పేసి, కేక్ కట్ చేశాడు. భోజనాలు వగైరా ముగిసేసరికి ఆలస్యం అయ్యింది. నా నడుమునొప్పి ఎక్కువ అయ్యింది. ఎలాగో ఇంటికి చేరాను.

ఆరోజు సాయంత్రం "ఒరేయ్ రామం! నేను, నా మనమడూ అలా గుడికి వెళ్లి వస్తాం. వాడి పేరున అర్చన చేసి, ఆశీర్వాదం తీసుకుని వస్తాం" అన్నాను నేను.

"గుడికా..? ఇప్పుడు.. సరే! త్వరగా వచ్చేయండి. మళ్లీ మహిళా సంఘం ఫంక్షను పెట్టింది మీ కోడలు" అన్నాడు రామం.

"అలాగే.. అలాగే" అంటూ ఒక చేత్తో మనమడి చెయ్యి, మరో చేత్తో నడుము పట్టుకుని పక్క వీధిలో ఉన్న గుడికి బయలుదేరాను.

గుడిలో అర్చనాది కార్యక్రమాలు సంతృప్తికరంగా జరిగాయి. ఆఖరున పంతులుగారు హారతి తీసుకువచ్చారు. నేను కళ్లకి హత్తుకున్నాను. విద్యుత్ హారతిని ఉఫ్‌మని ఊదేసి చప్పట్లు కొట్టడం ప్రారంభించాడు.

అక్కడున్న వాళ్లమంతా నివ్వెర పోయాం. ©

# ఆ ఒక్కటే!!

**- కె.వి. లక్ష్మణరావు**

వావాళ్లిద్దరికీ పెళ్లై సంవత్సరం కూడా కాలేదు. చిన్న ఇగో అడ్డొచ్చి ఇద్దరూ ఒకరినొకరు వాదులాడుకుంటున్నారు.

భార్య భర్తతో..

"మన పెళ్ళిచూపుల్లో మీరు నాతో పర్సనల్‌గా మాట్లాడారు. ఆ మాటల్లో.. నాకిష్టమైనవి చెబుతూ మీకిష్టమేనా? అని అడిగాను.. కానీ నాకిష్టమైన వాటిల్లో కనీసం ఒక్కటంటే ఒక్కటి కూడా మీకిష్టమని అనలేదు అయినా సరే.. నేను మిమ్మల్నే చేసుకున్నాను" అంది బాధగా.

అందుకు భర్త..

"పెళ్ళిచూపుల్లో నీవేం అడిగావో.. నేనేం చెప్పానో? నాకేం గుర్తులేదు. అయినా నిన్న తిన్న కూరేంటంటేనే చెప్పలేను. ఇక అప్పటి సంగతి.. ఎలా గుర్తుంటుంది? " అన్నాడు ముభావంగా.

"అంతేలెండి.. మీకేమీ గుర్తుండవే"

"పోనీ.. గుర్తుచేయొచ్చుగా.." విసురుగా అన్నాడు భర్త.

"ఖర్మ! అన్నీ గుర్తుచేసి చెప్పాలా..? అప్పుడు.. మన పెళ్ళిచూపుల్లో.. ఆ రోజు సినిమా హీరోల్లో నాకు పవన్‌కళ్యాణ్ అంటే ఇష్టం.. మీకెవరంటే ఇష్టం అని అడిగాను"

"నేనేమన్నాను..? " అడిగాడు భర్త.

"మీకు చిరంజీవంటే ఇష్టం అన్నారు.

ఇద్దరూ అన్నదమ్ములే కదా.. అని సర్దుకు

న్నాను. హీరోయిన్స్‌లో నాకు 'కాజల్' అంటే ఇష్టం.. మీకెవరని



అడిగాను"

అందుకు మీరు 'ఇలియానా' ఇష్టం అన్నారు.. ఇద్దరూ ఒకేసారి ఇండస్ట్రీకి వచ్చారు కదా అని సరిపెట్టుకున్నా..

అయితే స్వీట్స్‌లో నాకు 'లడ్డూ' ఇష్టమంటే మీకు 'కాజా' ఇష్టం అన్నారు. పోనీలే అనుకున్నా..

నాకు తెల్లావంటే ఇష్టం అని నేనంటే, మీరు మచ్చలావంటే ఇష్టం అన్నారు. సరేలే.. అనుకున్నా..

నాకు ప్రభుదేవా డాన్స్ అంటే ఇష్టం అంటే.. మీరు లారెన్స్ డాన్సంటే ఇష్టం అన్నారు. నాకు ఈటీవీ ఇష్టమని నేనంటే.. మీకు ఈటీవీ-2 ఇష్టమని చెప్పారు. నాకు విశ్వకథావేదిక 'విపుల' అంటే ఇష్టమంటే.. మీకు 'చతుర' చదవడమంటే ఇష్టం అన్నారు. రంగుల్లో నాకు నీలం ఇష్టం అంటే మీకు ఎరుపంటే ఇష్టం అన్నారు..

అలా ఒకటేమిటి.. ఎన్ని అడిగినా.. ఒక్కటంటే ఒక్క విషయంలో కూడా నా టేస్ట్‌తో మీరు ఏకీభవించలేదు..

అయినా సరే.. అయినా సరే.. నేను మళ్లీ అడుగుతున్నాను. నేను మిమ్మల్నే పెళ్లిచేసుకున్నాను..

ఎందుకో తెలుసా..? "

"ఎందుకో.. మరి..? " సందేహాత్మకంగా ముఖం పెడుతూ అన్నాడు భర్త!

"ఆ నాడు నేనడిగిన చివరి ప్రశ్నకు మీరిచ్చిన సమాధానం నచ్చినందుకే.."

"ఏమిటో అది..? " వెటకారంగా అడిగాడు భర్త.

"చివరిగా ఓ ప్రశ్న అని నేనంటే మీకిష్టమేనా? అడిగాను సీరియస్‌గా.

అందుకు మీరు.. నాకు నువ్వంటే చచ్చేంత ఇష్టమనీ చెప్పారు నైస్‌గా..

ఆ ఒక్కటే.. ఆ ఒక్క సమాధానమేనండీ.. నన్ను మీ ఇల్లాలిగా చేసింది!"

అంది భార్య.. కోపం తగ్గించుకుంటూ.. కొద్ది మురిపెంగా.

"అలా చెప్పానా.. చూశావా? అన్ని ప్రశ్నలకూ నిజాలే చెప్పి, ఆ ఒక్క ప్రశ్నకే.. అబద్ధం చెప్పి చచ్చాను. ఆ ఒక్కటే.. అబద్ధం చెప్పినందుకు ఫలితంగా జీవితాంతం అనుభవిస్తున్నా" అంటూ నాలుక్కర్చుకున్నాడు భర్త ©




వి.డి. ప్రసాదరావు

# మినువాక

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

**ప్రౌఢమైన భాష.. గాఢమైన భావన.. అద్భుతమనిపించే అనుభూతి.. అదీ వి.డి. ప్రసాదరావు రచనాశైలి. 1949లో ఆంధ్రపత్రికలో ధారావాహికంగా ప్రచురించిన వీరి 'నాకబలి' నవల ఎంత ప్రముఖమైందో ఈ 'మినువాక' నవల కూడా అంతటిదే. 'మినువాక' ప్రచురణ కాలం 1951. కథా విషయం పరిచయం వున్నదే అనిపించినా, దాన్ని రచయిత స్వీకరించిన తీరు, నడిపించిన విధానం పూర్తిగా విలక్షణమైంది. దానికి తోడు భాష కూడా జటిలంగానే వుంది.**

'మినువాక'- శశికళ కథ. శశికళ ఇరవై ఏళ్ల గృహిణి. హరిహరమూర్తి ఆమె భర్త. వాళ్ళకి ఓ చిన్నబాబు. కలిమి లేకపోయినా, భార్యాభర్తల మధ్య మంచి కలివిడి వుంది. మంచి వయస్సులో శృంగార నాయకీ నాయకుల్లా గడుపుతున్న వాళ్ళ కుటుంబ నేపథ్యంలో సంప్రదాయం కూడా గాఢంగానే వుంది. దైవభక్తి, మడి, ఆచారం, పతిభక్తి, సావిత్రీ ఉపాసన.. ఇదీ శశికళకి జీవనవిధానం. సంసారమే ఆమెకి లోకం. ఆ భార్యాభర్తలకి ఇరువైపులా పెద్దగా బంధువర్గం లేదు. హరిహరమూర్తికి ఓ సవతి అన్నగారున్నాడు. శశికళకీ అంతే, ఓ అన్నగారున్నాడు. వీళ్ళ సంసారం ఎక్కువ కాలం సవ్యంగా సాగలేదు. హరిహరమూర్తికి న్యూమోనియా వచ్చింది. అతను జబ్బులో వుండగానే పిల్లాడికీ అనారోగ్యం చేసి గతించాడు. కొద్ది రోజులకు హరిహరమూర్తిని వ్యాధి మింగేసింది. శశికళ పరిస్థితి నిరాధారమైంది. ఆదాయం లేదు. తప్పనిసరి అన్నట్టు అన్నగారి పంచకే చేరింది. హరిహరమూర్తి సంవత్సరీకం నాటికి భర్త తాలూకు కాస్త పొలం చెయ్యి దాటిపోయింది. ఇదంతా కూడా ఈ కథకి నేపథ్యం మాత్రమే. ఇక్కడి నుంచే అసలు కథ.

శశికళ వైధవ్యస్థితి విపుల పరిశీలన, అనుస్పందనే 'మినువాక' నవల. 1950 దశకం నాటికి భర్త పోయిన యువతుల జీవితం ఓ విషాద గాథ. ఏ రకమైన స్వాతంత్ర్యం కానీ, హక్కూ, ఆశా కానీ లేకుండా ఎవరి పంచనో చాకిరీ చేసే యంత్రాల్లా బతికినవాళ్ళు వేల సంఖ్యలో ఉండేవారు. ఎందుకు బతుకుతున్నారో తెలియనిస్థితి ఒకవేపు.. బంధువులు ఏ హక్కుతో తమ మీద అధికారం చెలాయిస్తున్నారో కనీస యోచన కూడా లేని బానిస బతుకు మరోవేపు. ఆ కాలంలో వీరి స్థితి ఏ రచయితకైనా దయనీయమైన కథావస్తువే. ఈ వస్తువు వెనక దయనీయతతోపాటు, జీవితం సాగుతున్న తీరు, ఆమె అంతరంగ ఘర్షణని ప్రసాదరావు నిశితంగా చిత్రించారు.

భర్త పోయిన శశికళని అన్నగారు, బావగారు కూడా తమతో తీసికెళ్ళటానికి వాదులాడుకున్నారు. చివరికి అన్నగారే తీసికెళ్ళి, అద్దె ఇంట్లో వుంచే ఏర్పాటు చేస్తానన్నాడు. భర్తలేని ఆమెకు ఇల్లు ఇవ్వటానికి ఎవరూ సిద్ధపడలేదు. కొన్నాళ్ళు ఓ సత్రంలో వుంచి, చివరికి తనింటికే తీసికెళ్ళాడు. నాలుగేళ్ళు ఆ ఇంట్లోనే వుంది శశికళ.

అన్నగారి దగ్గరకొచ్చిన కొత్తలో శశికళ అంతరంగ ప్రపంచం, బాహ్య ప్రపంచంకన్నా బలంగా వుండేది. ఆమె బాల్యం, పెరిగిన తీరు, సంప్రాదాయ విధానాలు ఆమె మానసిక స్థితిని చిత్రంగా మార్చాయి. భర్త పోగానే తనూ కాలువలో దూకి ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. చనిపోయే ముందు, భర్త గుర్తుగా అతని దహనస్థలం చూడటానికి ఓ రాత్రిపూట శ్మశానానికి వెళ్ళింది. అక్కడ ఎంతసేపుందో ఆమెకే తెలి

యదు. చేతుల మీదగా పాకుతూ వెళ్ళిన పెద్ద త్రాచుపామును చూసి ఒక్కక్షణం ఆమెకి విపరీతమైన భయం కలిగింది. పరిసరాలూ భయపెట్టాయి. బతుకు భయం, చావు భయం తెలిసొచ్చాయి. చావలేక ఇంటికి తిరిగి వచ్చింది. తనలో బతుకు మీద ఆశ మిగిలుందనిపించింది. గతించిన భర్త, బిడ్డల స్మృతిలోనే బతకాలనుకుంది. అలాగే బతుకుతోంది. తను అన్ని పూజలు, సావిత్రీ ఉపాసన చేసినా, భక్తితో వున్నా భర్త దక్కలేదన్న నైరాశ్యంలో ఆమెకు దైవం లేడనిపించింది. అయినా ఆమెలో ఒక్క విశ్వాసం అలాగే వుండిపోయింది. భర్త, బిడ్డల ఆత్మలు చంద్రవంకలో వున్నాయి. తను ఏనాటికైనా వారిని చేరుకుంటుంది. అంతవరకూ వాళ్ల స్మరణే తన జీవనవిధానం. ఇలా తన లోకంలో తానుంటూ బాహ్యజీవితం విషయంలో ఓ జడత్వాన్ని అలవరుచుకుంది శశికళ. రోజులు గడుస్తున్నకొద్దీ గతంలోలా ఆమెకి ఏకాగ్రత కుదరటంలేదు. భర్త జ్ఞాపకాలతోపాటు అతనితో పాలుపంచుకున్న శృంగార క్షణాలు గుర్తొచ్చి తన శరీర అస్తిత్వాన్ని తెలియజేస్తున్నాయి. జీవితంలోని జడత్వం కూడా విసుగ్గా మారుతోంది. భర్త రూపం ఇదివరకంత స్ఫుటంగా కళ్ళముందు రూపు కట్టటంలేదు. తన మనసు మలినమైపోతోందన్న దిగులు ఆరంభమైంది. ఏ తప్పు చెయ్యకపోయినా, ఏదో అపరాధ భావం కుంగదీయటం మొదలుపెట్టింది.

బలమైన సంప్రదాయం మనుషుల్ని ఎంతగా కట్టడి చేస్తుందో ప్రసాదరావు ఈ నవలలో చూపించారు. శశికళ శరీరాన్ని, జీవన విధానాన్నే కాక, ఆమె మనోరీతిని, ఆలోచనా తీరును కూడా సంప్రదాయం అణచి పెట్టింది. సహజాతాల్ని కూడా దోషాలుగా భావించే అయోమయంలోకి ఆమెని నెట్టింది.

శశికళ మనసుకి తెలియకుండానే, ఆమె శరీరం కోరుకుంటున్న కాంక్షల్ని, శృంగార స్మృతులలోని మార్పుల్నీ రచయిత ఎంతో నర్మగర్భంగా చిత్రించారు. ఆనాటి వితంతువుల జీవితాల్లోని అతి విచిత్రమైన బాధ ఇది. దీనిని గుర్తించటానికి నాటి సమాజంలో ఎవరూ సిద్ధంగా లేకపోయినా, కనీసం ఆ స్పృహనైనా అంగీకరించలేదు. అలా అని వారిని బాధించకుండానూ వదల్లేదు.

శశికళ మేనకోడలు సుభద్ర, భర్తతో కలిసి పుట్టింటికి వచ్చింది. నడమంత్రపుసిరి, పట్నవాసం.. కోతికి కొబ్బరికాయ దొరికినట్టయింది. ఆ భార్యాభర్తల విచ్చలవిడి ప్రవర్తన ఇంట్లో




అందరికీ ఇబ్బందిగానే మారింది. శశికళకి మరీ ఇరకాటంగా పరిణమించింది. సుభద్ర భర్త చూపు శశికళ మీద పడింది. ఓ రాత్రి చొరవ చెయ్యబోయాడు. శశి తీవ్రంగా ప్రతిఘటించింది. ఆ హడావిడిని సుభద్ర చూసింది. తప్పు ఆమె భర్తదే అయినా, ఆ కాముక చర్య శశికళదేనని తీర్మానించారు. ఆ అవమానం తట్టుకోలేక అర్ధరాత్రి ఆ ఇల్లు దాటి రోడ్డున పడింది శశికళ.

శశికళ అదృష్టం బావుండి, ఆమె ఎక్కిన రైలులో వసుమతి, నారాయణరావు తారసపడ్డారు. అన్నిరకాలుగా అలసిసొలసిన శశికళని తమతో తీసుకువెళ్లారు. వాళ్ళిద్దరూ వితంతు శరణాలయాన్ని నిర్వహిస్తున్నారు. శశికళను చూడగానే వాళ్ళిద్దరికీ ఆమె పరిస్థితి అర్థమైంది.

వితంతు శరణాలయంతో శశికళ జీవితంలో మరో అధ్యాయం ప్రారంభమైంది. ముందు ఒంటరిగా తనకి తానే వుంటూ వచ్చినా, క్రమేపీ తోటివారితో కలవడం అలవరుచుకుంది. మొదట ఒప్పుకోకపోయినా, నెమ్మది మీద వసుమతి, నారాయణరావుల మాటకు సమ్మతించి చదువుకోవటం ఆరంభించింది. మెట్రిక్ పాసయింది. కాలేజీలో చేరింది.

శశికళ కాలేజీ చదువులో వుండగా, వసుమతి, నారాయణరావులని యాజమాన్యం ఆ శరణా

# మరుగున పడ్డ మాణిక్యం

ఈ తరం పాఠకులు చాలామందికి వి.డి. ప్రసాదరావు తెలియకపోవటంలో ఆశ్చర్యం లేదు. కానీ ఆ తరంలో కూడా తక్కువ మందికే తెలుసు. దానికి కారణం ప్రసాదరావు మరుగున వుంటూ సాహిత్యంలో మాణిక్యాలని వెలయించారు.

వి.డి. ప్రసాదరావు ఆనాటి ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రప్రభ సంపాదకీయ శాఖల్లో పని చేశారు. ఎన్నో ఉత్తమమైన, విలక్షణమైన నవలలు వెలుగులోకి తెచ్చారు. రాతప్రతి చదివి, రచనలో మంచి చెడ్డలు గుర్తించటానికి ప్రత్యేకమైన ప్రతిభావ్యుత్పత్తులు కావాలి. కొత్త రచయితల నేర్పు గుర్తించటానికి ప్రత్యేక దృష్టి ఉండాలి. ఈ విలువలు నిండుగా వున్న వ్యక్తి ప్రసాదరావు. దీనికి ఉదాహరణగా 'శారద' రచించిన తొలి నవల 'మంచీ-చెడూ'నే చెప్పుకోవచ్చు 'శారద' కలం పేరు. అసలు పేరు నటరాజన్. జన్మతహ తమిళుడు. తెలుగు నేర్చుకుని అద్భుతమైన రచనలు చేశారు. ఆ 'శారద' తొలి నవలని ఆంధ్రపత్రిక వారపత్రికకి పంపించారు. అప్పటి ఆంధ్రపత్రిక సంపాదకవర్గంలోని ప్రముఖులకి ఆ నవల నచ్చలేదు. ఆ నవల వైశిష్ట్యాన్ని గుర్తించి, ప్రచురణకి సంపాదకవర్గాన్ని ఒప్పించింది ప్రసాదరావుగారే. ఆ రకంగా ఆ నవల ప్రచురణకే కాదు, ప్రఖ్యాత రచయిత 'శారద' తెలుగువారికి దక్కడానికీ కారకులయ్యారు ప్రసాదరావు. ఆయన నేర్పు గురించి, సాహిత్య ప్రతిభ గురించీ మిత్రులు కథలుగా చెప్పుకునేవారు. తన కర్తవ్యం ఏమిటో అంతవరకే. అందుకే చాలామంది దృష్టిలోకి ఈయన రాలేదు. ప్రచారానికి, గుర్తింపుకి ప్రయత్నించని నిఖార్సయిన రచయిత.

లయం నుంచి మరోచోటకి పంపించింది. శశికళకి మళ్ళీ ఒంటరితనం. అయినా ఇదివరకటిలా అంతటి ఆంతరంగిక ప్రపంచంలోనే వుండటం లేదు. బాహ్యవిషయాలు, స్నేహితుల సంగతులు పట్టించుకుంటోంది. శరణాలయంలోని గొడవలతో బైటకి వచ్చి మరో స్నేహితురాలితో కలిసి అద్దె గదిలో వుండటం ఆరంభించింది. భాస్కరరావుతో పరిచయం క్రమంగా ఆయన కోరిక మేరకు పునర్వివాహానికి దారితీసింది. ఈ పరిణామాలన్నింటినీ ఓ క్రమంలో, అలాగే శశికళ మానసిక పరిణామాల్నీ విడవకుండా చిత్రీకరించారు రచయిత.

వివాహం తర్వాత కూడా శశికళ జీవితం సాఫీగా సాగలేదు. భాస్కరరావు ఎంత ధనవంతుడో, అంత విచిత్రపోకడలు గలవాడు. ఆమెను నగరానికి తీసుకువచ్చి పెద్ద భవంతిలో వుంచాడు. ఆ ఇల్లు ఓ రాజదర్బారు. ఆశ్రితులు, వచ్చీపోయేవాళ్లు.. ఊళ్ళో అన్నిరకాల ఉన్నతశ్రేణి వాళ్లకీ అదో నిలయం. భాస్కరరావంటే అపేక్ష లేకపోవటం వల్ల, భర్త హరిహరమూర్తి మనసులో మరింత పదిలమయ్యాడు శశికళకి. ద్వైధీభావం, అటూ ఇటూ తెగని మానసిక సంక్షోభం ఆమెది. మరోవైపు ఆమె మీద పసితనపు అమాయకమైన మోహాన్ని కుమ్మరిస్తున్న భాస్కరరావు మేనల్లుడు కృష్ణమూర్తి.. దానికి మద్దతు తెలిపేలా భర్త విచిత్రపోకడ.. ఈ సంఘర్షణ తట్టుకోలేక శశికళ ఓనాడు అపస్మారక స్థితికి చేరింది. అలా కొన్నిరోజులు కోమాలోనే తీవ్ర అస్వస్థతలో వుండింది. అప్పటి ఆమె మానసిక సంఘర్షణ, అపస్మారక ప్రేలాపనని ప్రసాదరావు అనాది స్త్రీ పురుష చరిత్రలా, ఓ మానసిక విచికిత్సలా చిత్రించారు. చివరికి శశికళ కోలుకుంది. ఆమె పక్కనే వున్న భర్త, మేనల్లుడూ వారివారి ధోరణిలో అలాగే వున్నారు. కానీ శశికళే మారింది. ఏదీ తనకి అంటని ఓ స్థితికి చేరినట్టు తటస్థంగా వుండిపోయింది. ఇదీ నవలకి ముగింపు.

'మినువాక' అంటే ఆకాశగంగ అని అర్థం. 'ఏక వాహినిగా సర్వ జీవ కళంకాలనూ తనలో కడిగేసుకుంటూ, తను మాత్రం కళంకిత కాకుండా ప్రవహిస్తున్నట్టు'... అని ప్రసాదరావు శశికళ స్థితిని నవల చివరలో పేర్కొన్నారు. 'మినువాక' నవల ఇదేనని చెప్పటానికి లేదు. ఇందులో భౌతిక స్థితిగతులు, మానసిక విచికిత్సలు, శారీరక కోరికలు, మానసిక వైపరీత్యాలు, సంప్రదాయ మౌఢ్యం, ఆధునిక ఆదర్శం, కట్టుబాట్ల కట్టడి, స్వాతంత్ర్యం, పవిత్రత కోసం తాపత్రయం.. ఇలా అన్నీ వున్నాయి. వెరసి ఓ యవ్వనవతి విధవ జీవితం ఎంత అల్లకల్లోలమో చూపించింది. 'మినువాక' జటిలమైన విషయాన్ని జటిలంగానే చిత్రించిన ఓ కొత్తరకం శిల్ప నైపుణ్యం వున్న నవల. ©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ప్రవచన వాచస్పతి,
అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్
సమాధానాలు

ప్ర. 'పుక్కిట పురాణాలు' అనే నానుడి ఎలా వచ్చింది? అర్థమేమిటి?

– కరణం శివానందరావు, కర్నూలు

జ. 'శ్లేష' అంటే వ్యంగ్యంగా చెప్పడం. ఆలంకారిక ప్రక్రియ. ఒక విషయం సూటిగా ఎదుటి వ్యక్తికి అందించడానికి రెండర్థాలు/ వేరే అర్థం వచ్చేలా మాట్లాడటం అన్నమాట! 'చాలులే!' - 'చాల్లే!' ఈ మాటలు పలికే గొంతుని బట్టి అర్థం మారుతుంది. ఇలాంటివి చాలా పద ప్రయోగాలున్నాయి. ఎవరైనా చాలాగ్రంథాలు చదివి, గుర్తుపెట్టుకొని, ఎక్కడ, ఎప్పుడు, ఎవరు అడిగినా తడుముకోకుండా చెబుతూంటే 'అన్నీ పుక్కిట పట్టినవాడు' అనడం నానుడి. కానీ కొందరు దాంభికులు, పాండిత్యం లేకున్నా అన్నీ తమకే తెలుసును అనేవారు (వీరినే పండితమ్మన్యులు అంటారు) నోటికి ఏది వస్తే అది చెప్పేస్తుంటారు. ప్రమాణం, ఆధారం ఏదీ? అని అడిగితే, ఏది మనసుకు తడితే అది చెప్పడం, ఆధారం కానిదేదో చెప్పేయడం- ఇలాంటి వారిని ఎగతాళి చేస్తూ 'పుక్కిట పురాణం' అనే పేరు వచ్చింది. ఇది సంకర సమాసం. అర్థపర్థంలేని, అసంగతమైన వివరణకి అలా మాట్లాడేవారిని ఎద్దేవా చేయడానికి వాడే పదం ఇది.

ప్ర. జంధ్యాన్ని కొందరు ఆరు పోగులతో, మరి కొందరు తొమ్మిది పోగులతో వేసుకుంటారు. ఏది శ్రేష్ఠం?

– బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, నిర్మల్

జ. సుమారు ఆరువందల సంవత్సరాల క్రిందటి వరకు అంటే విజయనగర సామ్రాజ్య స్థాపన, విద్యారణ్యులవారి కాలం వరకు బ్రహ్మచారి మూడు పోగులు, గృహస్థు ఆరు పోగులు ధరించడమే ఆచారంగా ఉండేది. 'మమ శ్రౌత స్మార్త నిత్యకర్మానుష్ఠాన...' అని మొదటిది ధరించి, 'మమ ఉద్వాహానంతర (గార్హస్థ్య) కర్మానుష్ఠాన..' అని రెండవది ధరించేవారు.

ఆ రోజులలో తప్పనిసరిగా పంచె, ఖండువా ధరించేవారు. క్రమంగా పాలకులు మారారు. వేషం మారింది. ఖండువా స్థానాన్ని అంగీ/ చొక్కా ఆక్రమించింది. ఇలా ఆహార్యంలో మార్పు రావడంతో ఉత్తరీయం లేదే అనే దిగులు వేధించేది. ఉభయతారకంగా పెద్దలు 'ఉత్తరీయార్థం తృతీయ యజ్ఞోపవీత ధారణం..' అనే మార్గాన్ని సూచించారు. దాంతో తృతీయ యజ్ఞోపవీత ధారణ - తొమ్మిది పోగుల జందెం వాడుకలోకి వచ్చింది. యజ్ఞోపవీత ధారణలో ఏది శ్రేష్ఠం అన్న ప్రశ్న ఉండదు. వంశంలో తరతరాలుగా వచ్చే ఆచారమే అనుసరణీయం.

ప్ర. భార్యాభర్తలది ఏడు జన్మల అనుబంధం. ఏడు జన్మలూ మానవజన్మలేనా? లేక ఇతర జన్మలా? ఇతరాలైతే భార్యాభర్తలయ్యే అవకాశముండదు కదా?

– పెద్దాడ సత్యనారాయణ,
యాప్రాల్, సికింద్రాబాద్

జ. భార్యాభర్తల సంబంధమే కాదు.. తల్లి, తండ్రి, సంతానం, యజమాని.. ఇలాంటి బంధాలు ఏడేడు జన్మల బంధాలని మన సంప్రదాయం తెలుపుతోంది. వంశంలో ఒక్క సత్పురుషుడు పుడితే అటు పది, ఇటు పదితరాలు, తనతో కలుపుకొని 21 తరాలు పునీతం అవుతాయని శాస్త్రం. భార్యాభర్తల సంబంధమూ అంతే. అన్ని వరుస జన్మలూ మానవ జన్మలే కావాలని ఎవరూ చెప్పలేరు. ఇతర జన్మలూ కావచ్చు ఇది విష్ణు, పద్మ పురాణాలలో కొన్ని గాథలలో కనిపిస్తుంది. ఈ జన్మలో 'పరస్పర వశతా ప్రమోద

# చతుర ప్ర.జ. 7

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

మగ్నమానసులై కూడి మనుట' సాధ్యమైన భార్యాభర్తలు తప్పకుండా ఏడు జన్మలూ భార్యాభర్తలై అందరికీ దేవతలే అవుతారు.

*ప్ర. గరుడపురాణ ప్రాముఖ్యతను తెలపండి. దానిని గృహంలో ఉంచుకోవచ్చునా?*

*- నోరి శివప్రకాశం, నెల్లూరు*

**జ.** అష్టాదశ పురాణాలలో గరుడ పురాణం ఒకటి. శ్రీమహావిష్ణువు వైభవం, గరుత్మంతుని ద్వారా పరంపరగా వివరించిన గ్రంథం ఇది. పద్మ, స్కాంద పురాణాల వలెనే ఇది కూడా విజ్ఞాన సర్వస్వం. సృష్టిక్రమం, వంశాలు, రాజుల.. రుషుల చరిత్రలు, భక్తుల గాథలు, క్షేత్రాలు, తీర్థాలు, జ్యోతిష, వాస్తు, సాముద్రిక, దేవాలయ ప్రతిష్ఠాపన, గ్రహగతి, నవరత్న ధారణ విధివిధానాలు, ఆయుర్వేద, ఆచార, ప్రాయశ్చిత్తాదులున్నాయి. ఇంకా ఎన్నో మంత్రాలు, వ్రతాలు, స్తోత్రాలు, పూజావిధానాలు ఉన్నాయి. మనకి తెలియని విష్ణుసహస్రనామ స్తోత్రం ఉంది. సుదర్శన, గాయిత్రీ, అష్టాక్షరీ, దుర్గా గణపతి, శివ, కాలభైరవ మంత్ర తంత్రాలు ఉన్నాయి. జీవుడి మరణానంతర గతి వివరణ, నరకాలలో రకాలు, శిక్షలు వగైరా వర్ణనలున్నాయి. వీటిని దృష్టిలో ఉంచుకొని ఎవరో, ఎక్కడో ఇలా ముద్ర వేశారు. ఇంట్లో ఉంచుకోవచ్చు. పారాయణగా కాక, విషయజ్ఞానం కోసం చదువుకోవచ్చు.

*ప్ర. మనది హిందూ సంప్రదాయం కదా! మరి శకాల గురించి 'క్రీస్తుశకం' అనడం ఎంత మాత్రం సబబు? ఓ పక్క అన్యమత ప్రచారాలను అడ్డుకుంటూ, ఇతర దేశమతాల శకాలను వాడుకోవడం ఎందుకు?*

*- బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం*

**జ.** సృష్టిక్రమం చూస్తే ఎక్కడో, ఎప్పుడో ఒక సంఘటన జరుగుతుంది. చూస్తే అది చాలా సాధారణ విషయంలా అనిపిస్తుంది. తరువాతి కాలంలో అది చూపించే ప్రభావానికి ఆశ్చర్యపడతాం. చాలా ఆచారాలు అలాగే వచ్చాయి. ఆయా ఆచారాల వలన ప్రపంచమంతా ప్రభావితమయి ఒక గ్రామంలా మారిపోతుంది. కొన్ని సందర్భాలలో పరంపరగా వచ్చే ఆచార వ్యవహారాలు రూపుమారిపోతాయి.. మాసిపోతాయి కూడా. క్రీ.శ. - క్రీ.పూ. అన్న పరిభాష అలాగే వచ్చింది. బ్రిటీష్ సామ్రాజ్యపాలన, వలసపాలన చరిత్రకారులనీ ప్రభావితం చేసింది. క్రీస్తు జనన తేదీ ఒక సరిహద్దురాయి అయింది. భారతీయులకి అందునా తెలుగువారికి శకాబ్దాలు, శతాబ్దాలు విక్రమార్క, శాలివాహన, రామానుజ, శంకర, మధ్వ ఇత్యాదిగా ఉన్నాయి. ఇతర మతాలు, సంప్రదాయాల వారు వారివారి శకాలు పాటిస్తూనే ఉన్నారు. మరి తెలుగువారిలోనే కనిపించదు.

*ప్ర. దైవం ముందు అందరూ సమానం అంటూనే అధికార, ధనిక, రాజకీయవర్గావారు తమ హోదాల మేర సులువుగా దర్శన భాగ్యం పొందుతున్నారు. మరి సామాన్య భక్తులు ఎన్నో కష్టాలు పడుతున్నారు. ఏ అంతరాలు లేని సర్వజన భక్త దర్శనం సాధ్యాసాధ్యాల గురించి వివరించగలరు?*

*- యు. చిట్టిబాబు, న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా*

**జ.** దేవాలయాలు ఎవరు కట్టించినా ప్రజల నుంచి వసూలు చేసిన విరాళాలు, దండయాత్రలలో లభించిన కానుకలు, కప్పాల ధనరాశులే వెచ్చించారు. కొందరు తమ ఆస్తులను దానం చేసి నిర్మించినవారూ ఉన్నారు. వీరందరిని 'వ్యవస్థాపకులు' అంటారు. వీరి అనుమతితో ఏర్పడిన పరిషత్తును 'ధర్మకర్తల మండలి' అంటారు.

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

*ప్ర. జీవిత చరమాంకంలో ఉన్న తల్లిదండ్రులను వారి పిల్లలు విస్మరించడం ఎంతవరకు సబబు? ఆర్థికస్థితి కలిగి కూడా వృద్ధాశ్రమాలలో చేర్పించడం ఎంతవరకు న్యాయం?*

**– టి. హేమలత,** మచిలీపట్నం, కృష్ణా జిల్లా

**జ.** శంకరాచార్యుల వారు ఈ అంశాన్ని చాలా అందంగా చెప్పారు. సంపాదించి పోసిన రోజులలో అందరూ గౌరవిస్తారు. అది అయిన తరువాత (ఇంటి కుక్కకి పాలుపోసి ప్రేమగా చూచేవారు) ముసలివారిని చచ్చావా? బతికావా? అని కూడా ఎవరూ పలకరించరు.

చైనా సరిహద్దులలో ఒక ప్రాంతంలో ఏభై సంవత్సరాలు దాటిన వృద్ధులని లోయలోకి విసిరేసేవారని ప్రాచీనకాలపు గాథ ఉంది. ఇది 1980 దశకంలో సినిమాగా కూడా వచ్చింది. ఆ స్థితి మన దేశంలో లేనందుకు సంతోషించాలి. ధనసంపాదన, భోగాలమీది ఆసక్తి, తేలికగా దొరికే సంపాదన లాంటివి కుటుంబ సంధాలను విచ్ఛిన్నం చేశాయి. స్వయం వ్యక్తిత్వాలు, సంపాదనలు వచ్చిన తరువాత జరిగే వివాహాలు, పిల్లలు పుట్టగానే నాయనమ్మలు, అమ్మమ్మలు తాతలు ఆయాలుగా మారడం, మూడేళ్ల తరువాత క్రష్‌లు, కేజీలు, టెక్నో స్కూళ్లు, రెసిడెన్షియళ్లు, కళాశాలలు, విదేశీ చదువులు - సంపాదనలు ఇదీ వరుస. పిల్లలకి ఏనాడైనా కుటుంబ బంధాలు అందిస్తున్నామా? పోటీప్రపంచం పేరుతో యాంత్రికంగా పెంచుతున్నామే!

మనుషులు, మమతలు, వావివరుసలు, సంబరాలు, పెళ్లిళ్లు, పేరంటాలు కంటే ఫోన్లు, బైకులు, ఫాషన్లు వగైరా అంతా నాగరికతగా భావించి అందిస్తున్నాం. ఇక వారు ముందు తరంవారిని ఎలా గౌరవిస్తారు? వృద్ధాశ్రమాలు విరివిగా పెరగటానికి అందరమూ కారణమే!

వారికి, వారిప్రత్యేక బంధువులకి, అధికారులకి, వితరణ శీలురికి, సమాజంలో ప్రత్యేక గుర్తింపు, స్థానం కలవారికి, విద్యావంతులు - వీరికి దేవాలయ మర్యాదలు ఇవ్వడం అనూచానంగా వచ్చే ఆచారం. అది తప్పనిసరి కూడా. మన ఇంటిలోనే వ్యక్తులు అందరూ మనవారే అయినా ఇచ్చే గౌరవ మర్యాదలలో తేడా ఉంటుంది కదా! కానీ వీరు ఎవరు దర్శనానికి వచ్చినా సాధారణ భక్తులకు అసౌకర్యం కలగని రీతిలో ఒకప్పుడు ఏర్పాట్లు ఉండేవి. వారి దర్శనానికి ప్రత్యేక వేళలుండేవి. ముందుగా తెలిపే విధానముండేది. సాధారణ భక్తులకు అసౌకర్యం కలగకుండా సొరంగాల వంటి ప్రత్యేక ప్రవేశ ద్వారాలుండేవి. ఆగమశాస్త్రాలు కూడా వీటి గురించి వివరించాయి. 'దేవాదాయ ధర్మాదాయ' విభాగాలు 'దేవదాయ-ధర్మదాయ' విభాగాలుగా మారిననాడు మీరు అన్నది సాధ్యమవుతుంది. 'దేవ+దాయ' పదమే 'దేవ+ ఆదాయ'గా మార్చారు.

*ప్ర. 'ఇందమ్మా!' అని ఒక కొడుకు తన తల్లి చేతిలో పండో, ప్రసాదమో తెచ్చి పెడితే 'అలా పక్కన పెట్టమ్మా' అనాలా? ఆప్యాయంగా అందుకుని ఆనందించాలా? కొడుకు చేతిలోంచి ఏమీ తీసుకోరాదని ఎక్కడో చదివాను. సందేహం తీర్చగలరు?*

**– కె. కామేశ్వరీదేవి,** పాలకొల్లు

**జ.** మీరు చదివిన గ్రంథంలోనే వివరణ కూడా ఇచ్చి ఉంటారు. ప్రేమ, అభిమానం, భక్తి, ఆదరం ఉన్నపుడు వస్తువు స్వీకరించడంలో ఎవరిచెయ్యి పైన, ఎవరిచెయ్యి కింద అన్న ప్రసక్తి ఉండదు. తంత్రశాస్త్రాలలో దానాలు చేసేప్పుడు, తీసుకునేప్పుడు నియమాలుంటాయి అంతే!

*ప్ర. ఆలయాల్లో శఠగోపం ఇచ్చే సమయంలో అర్చక స్వాములు భక్తుల శిరస్సు తాకుతారు కదా? వారు మైలపడరా? ఈ మైలపడటం శారీరకమైందా? మానసికమైందా?*

**– ముడుంబై సీత,** భద్రాచలం, ఖమ్మం జిల్లా

**జ.** మడికట్టుకోవడం, తాకితే మైలపడటం - ఇదంతా ఒక సక్రమమైన పద్ధతిలో వ్యవహరించడానికి మూలసూత్రం. ఇంక శఠగోపం సంగతి.. నిజానికిది శిరసుని తాకకుండానే ఉంచాలి! పై తరం అర్చకులు అలాగే చేసేవారు. కానీ తరాలు మారాయి. భక్తులకి తృప్తి కలుగుతుందనో, రద్దీ కారణంగానో, ఇతర కారణాల వల్లనో - శిరస్సు తాకేలా ఉంచడం చాలాచోట్ల కనిపిస్తోంది. ఇక విఐపీల విషయంలో ప్రత్యేక గౌరవం యిస్తున్నాం- అనిపించుకోవడానికి ఇలా చేస్తున్నారు. ఇది చాలాతప్పు. అలాంటి వాటి విషయంలో పెద్దలు మార్గదర్శకాలు యివ్వాలి. Ⓒ

# భామనే.. సత్యభామనే..!

భార్యగా, ఇద్దరు పిల్లలకు తల్లిగా బాధ్యతలను సమర్థంగా నిర్వహిస్తూనే కెరీర్‌లో తన కంటూ ఓ లక్ష్యాన్ని ఏర్పరుచుకుందామె. ఓ పక్క టీవీ ఆర్టిస్టుగా రాణిస్తూనే అందాలపోటీలకు అమ్మాయిలను అలంకరించడం మొదలుపెట్టింది. అలా ఒక్కో మెట్టూ ఎక్కుతూ మిసెస్ ఏషియా ఇంటర్నేషనల్ - 2015 కిరీటాన్ని చేజిక్కుంచుకుంది వైజాగ్‌కు చెందిన వాలెంటీనా మిశ్రా. నేటి గృహిణులు ఆమెను ఆదర్శంగా తీసుకోగలిగితే ఎన్నో విజయాలను సాధిస్తారన డంలో సందేహం లేదు.

# గృహిణులకు ఆదర్శం ఆమె!




పెళ్ళై, పిల్లలు పుట్టాక కొందరు మహిళలకు కుటుంబమే ప్రపంచంగా మారిపోతుంది. తమకంటూ ఏవైనా కోరికలు, ఆలోచనలు ఉన్నా సమయం లేదన్న సాకుతో అవి మరుగున పడిపోతాయి. వ్యక్తిగత అవసరాలను వదిలి కుటుంబ సభ్యుల అవసరాలను కనిపెట్టుకుంటూ అందులోనే సంతోషం వెతుక్కుంటారు గృహిణులు. తమ ఆహారం, ఆరోగ్యం పట్ల నిర్లక్ష్యం వహిస్తారు. అయితే కుటుంబ సభ్యులతో పాటు తమకు కూడా కొంత సమయం కేటాయించుకుని వ్యాయామం చేస్తూ సరైన ఆహారం తీసుకుంటే ఆరోగ్యంగా ఉండడమే కాకుండా ఉత్సాహంగా ఉంటారు. అందమైన శరీర సౌష్టవం సొంతమవుతుంది. అందం, ఆత్మవిశ్వాసం సమపాళ్లలో ఉంటే ఇక లేనిదేముంది? అన్నింటా విజయాలే! అన్ని చోట్లా ఆదరాభిమానాలే పొందుతారు. కుటుంబ బాధ్యతలను మరింత సమర్థంగా నిర్వహించడమే కాకుండా

వ్యక్తిగత ఎదుగుదలలో ముందుంటారు. ఎంచుకున్న రంగాలలో విజయం సాధిస్తారు. అంతే కాదు, తమ కుటుంబ వాతావరణం మరింత ఆనందంగా, ఆహ్లాదంగా మారుతుంది. దీనికి తాజా ఉదాహరణ మిసెస్ ఏషియా టైటిల్ గెలుచుకున్న ముప్పై ఐదేళ్ల వాలెంటేనా.

మధ్యప్రదేశ్‌కు చెందిన వాలెంటేనా కుటుంబం ఉద్యోగకారణంగా వైజాగ్‌లో స్థిరపడింది. డిగ్రీ పూర్తికాగానే 21 ఏళ్లకే ఆమెకు వివాహమైంది. ఇద్దరు పిల్లలు కూడా. పిల్లలు కాస్త ఎదిగాక తన కెరీర్‌పై దృష్టి పెట్టిందామె. ఇల్లు, పిల్లల బాధ్యతను నిర్వహిస్తూనే తనకూ కొంత సమయాన్ని కేటాయించుకుంది. అందాల పోటీల్లో పాల్గొనే అమ్మాయిలకు చేసే అలంకరణలో శిక్షణ తీసుకుంది. అలా అలంకరిస్తూనే తన అందానికీ మెరుగులు దిద్దుకుని మిసెస్ ఏషియా ఇంటర్నేషనల్ పోటీల్లో పాల్గొంది. కిరీటాన్ని సొంతం చేసుకుంది.

జూన్‌లో మలేసియాలోని కౌలాలంపూర్‌లో జరిగిన ఈ పోటీలో తొమ్మిది దేశాలకు చెందిన నలభై మంది గృహిణులు తలపడగా అచ్చ తెలుగు మహిళగా ముస్తాబైన వాలెంటేనా విజయం సాధించింది.

వాలెంటేనా తన కల నెరవేరడానికి ఎంతగానో కృషి చేసింది. అందాల పోటీలలో భారతదేశాన్ని అంతర్జాతీయ స్థాయికి తీసుకెళ్లాలన్నది ఆమె ఆశయం. ఈమె 1996 - 1997 సంవత్సరాల్లో జరిగిన మిస్ వైజాగ్, ఆంధ్ర పోటీల్లో రన్నరప్‌గా నిలిచింది.

సేకరణ : **సంధ్యారాణి**

## పొంచి ఉన్న క్యాన్సర్!



గంటల తరబడి కూర్చునే మహిళలకు క్యాన్సర్ ప్రమాదం పొంచి ఉందని తాజా అధ్యయనంలో తేలింది! క్యాన్సర్ ఎపిడమోలాజీ, బయోమేకర్స్ అండ్ ప్రివెన్షన్ పత్రికలో ప్రచురితమైన ఈ అధ్యయనంలో కదలకుండా ఎక్కువసేపు కూర్చునేవారిలో బ్రెస్ట్, ఒవేరియన్ క్యాన్సర్ వచ్చే అవకాశముందని వెల్లడైంది. దాదాపు లక్షా నలభై ఆరువేల మంది స్త్రీ పురుషుల్ని అధ్యయనం కోసం పరిశీలించారట.

# టెక్ గురూ!

### షాప్‌సేవీ

ఏ వస్తువు ధర ఎపుడు పెరుగుతుందో, ఎపుడు తగ్గుతుందో తెలియని పరిస్థితి నేడు. అంతేకాదు ఒక్కోచోట ఒక్కో ధర! ఏయే వస్తువుల ధర ఎప్పుడు, ఎక్కడ




తక్కువగా ఉన్నాయో తెలిస్తే డబ్బుని ఆదా చేసుకోవచ్చు కదా. అలా డబ్బును ఆదా చేసుకునేందుకే ఓ యాప్‌ను రూపొందించారు.. అదే షాప్‌సేవీ! ఈ యాప్ వివిధ వెబ్‌సైట్లలోని ఆన్‌లైన్ షాపుల్లోని వస్తువుల ధరలు పోల్చి చెప్తుంది. ఎక్కడ ఏయే వస్తువుల ధరలు తగ్గాయో క్షణాల్లో మెసేజ్ వస్తుంది. ఇక ఏదైనా వస్తువు కొనాలనుకున్నపుడు ఎక్కడ తక్కువ ధరకు దొరుకుతుందో అని షాపుల చుట్టూ గంటలతరబడి తిరగాల్సిన పనిలేదు. డబ్బు, సమయం రెండూ ఆదా అవుతాయి! ఈ యాప్‌ను గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

### ఫొటో బబుల్ లైవ్ వాల్‌పేపర్

ఈ యాప్ ద్వారా మన ఫొటోలను నీటి బుడగల్లో చూసుకోవచ్చు. యాప్‌లోని ఆప్షన్స్‌ని ఉపయోగించి ఫొటోను నీటి బుడగల రూపంలో పెట్టుకోవచ్చు.



యాప్‌లోకెళ్లి ముందుగా బ్యాక్‌గ్రౌండ్‌ను ఎంపిక చేసుకోవాలి. తర్వాత నీటి బుడగలో చూసుకోవాలనుకున్న ఫొటోను ఎంపిక చేసుకోవాలి. అంతే గాలిలో తేలుతున్నట్లుండే నీటి బుడగలో మీ ఫొటోను చూసుకోవచ్చు. దీన్ని గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

# ఫిట్‌నెస్ మంత్రం.. చక్కని వ్యాయామం!

అందం, ఆరోగ్యం.. ఇవి రెండూ ఉండాలంటే చక్కని వ్యాయామం అవసరం. అందుకు మోయలేని బరువులు ఎత్తాల్సిన పనిలేదు. ఇంట్లోనే తేలికైన కొన్ని వ్యాయామాలు చేయడం వల్ల శరీరంలోని అనవసర క్యాలరీలు తగ్గుతాయి. ఆ వ్యాయామాలేంటో.. తేలికగా ఎలా చేసుకోవచ్చో చూద్దాం..



✦ తాడాట.. ఇది తేలికైన, చక్కని ప్రభావం చూపే వ్యాయామం. సరదాగా పిల్లలతో కలిసి ఆడుకున్నట్లూ ఉంటుంది.. ఒంట్లోని వ్యర్థ క్యాలరీలూ తగ్గిపోతాయి. స్కిప్పింగ్ రోప్ ఒకటి హ్యాండ్ బ్యాగులో వేసుకుంటే ఉద్యోగ రీత్యా ఇతర ప్రదేశాలకెళ్లినపుడు కూడా ఈ వ్యాయామం చేసుకోవచ్చు

✦ స్క్వాట్స్.. ఇది కండరాల సమూహం మీద ప్రభావం చూపి పూర్తి శరీరానికి ఉపకరిస్తుంది. ఎక్కువ క్యాలరీలను కరిగించి శరీరాన్ని దృఢపరుస్తుంది. క్రమం తప్పకుండా స్క్వాట్స్ చేయడం వల్ల శారీరక ఆరోగ్యం మెరుగుపడడమే కాకుండా చక్కని ఆకృతి వస్తుంది. రోజంతా ఆఫీసులో లేదా ఇంట్లో గంటలకొద్దీ కూర్చోవడం వల్ల జబ్బుల బారిన పడే ప్రమాదముంది. సమయం లేదనుకుంటే బియ్యం కుక్కర్‌లో వేసో, కూర తాలింపు వేసో స్క్వాట్స్ చేసుకోవచ్చు



✦ పుషప్స్.. పుషప్స్ చేయడం కాస్త కష్టమే అయినప్పటికీ మంచి ఫలితం కనిపిస్తుంది. గుండె ఆరోగ్యానికి చాలా మేలు చేస్తుంది.



వెన్ను నిటారుగా ఉంచి పుషప్స్ చేయడం వల్ల బ్యాక్ పెయిన్ తగ్గిపోవడమే కాదు, దానిమీద ఎక్కువ వత్తిడి పడదు. శరీరంలోని వివిధ కండరాలు ప్రభావితమయ్యేలా వివిధ రకాల పుషప్స్ చేసి ఫిట్‌నెస్‌ను పొందొచ్చు

✦ ల్యూంగ్స్.. కాళ్లలోని కండరాలను దృఢపరిచేందుకు ల్యూంగ్స్ చక్కని వ్యాయామం. ప్రతిరోజూ ల్యూంగ్స్ చేయడం వల్ల దృఢత్వాన్ని సంతరించుకోవడమే కాకుండా కొత్త కండర సమూహాన్ని ఏర్పరుస్తుంది: ఇక ఆలస్యమెందుకు వెంటనే ల్యూంగ్స్ చేయడం మొదలుపెట్టి చక్కని ఆకృతిని పొందండి.



✦ స్విమ్మింగ్.. ఆరోగ్య పరంగా చాలా ప్రయోజనాలున్నాయి. రక్తపోటును తగ్గిస్తుంది. గుండె కొట్టుకునే వేగాన్ని, ఏరోబిక్ సామర్థ్యాన్ని మెరుగుపరుస్తుంది.

✦ రన్నింగ్.. ఇతర వ్యాయామాలతో పోలిస్తే అనవసర క్యాలరీలను ఎక్కువగా కరిగిస్తుంది. ఒత్తిడిని మాయం చేసి గుండె ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తుంది. కాళ్లను దృఢపరిచి సన్నబరుస్తుంది. రన్నింగ్ చేయలేనివారు జాగింగ్ చేయొచ్చు

✦ సైక్లింగ్.. చేతులు, కాళ్లు, వెన్నెముకలను దృఢపరుస్తుంది. గుండె సామర్థ్యాన్ని పెంచి బరువు తగ్గడంలో సహకరిస్తుంది. తక్కువ ఖర్చుతో చక్కని ఫిట్‌నెస్‌నిస్తుంది.



# పురాణ విజ్ఞానం

ఈ దేవతా మూర్తుల ఆయుధాల పేర్లేమిటో మీకు తెలుసా?

| | |
|---|---|
| 1. రాముడి విల్లు? | జ. |
| 2. శివుని ఆయుధం? | జ. |
| 3. కృష్ణుడి శంఖం? | జ. |
| 4. బలరాముని ఆయుధం? | జ. |
| 5. ఇంద్రుడి కత్తి? | జ. |
| 6. పరశురాముడి ఆయుధం? | జ. |
| 7. విష్ణువు గద? | జ. |
| 8. యముని ఆయుధం? | జ. |
| 9. అర్జునుడి విల్లు? | జ. |
| 10. వరుణుడి ఆయుధం? | జ. |

జవాబులు ఈ సంచికలోనే..

## జోక్స్

### పెళ్లయిందా?



తలకు పెద్ద గాయంతో వచ్చిన రాజుకు కుట్లు వేసి కట్టు కడుతూ..

నర్సు: మీ పేరు?

పేషంటు: రాజు..

నర్సు: మీ పుట్టిన తేదీ?

పేషంటు: జులై ఒకటి.

నర్సు: మీకు పెళ్లయిందా?

పేషంటు: లేదు.. లేదు. ఇది కారు ప్రమాదం!

### మీరే చెప్పారుగా!

ఎగ్జామినర్: నవీన్..! చేతిమీద ఫార్ములా రాసుకొచ్చావేంటి? అలా చేయడం తప్పు కదా!

నవీన్: మీరే కదా సార్ చెప్పారు, ఫార్ములాలను ఫింగర్ టిప్స్ మీద ఉంచుకోవాలని!



### వాడు చెప్పాడా నాకు?

భర్త: నా ఫ్రెండ్ రాజేష్‌కి కాబోయే భార్యను చూశాం. ఆమె చాలా గయ్యాళి. వాడికష్టాలు సరి పోదు.



భార్య: మరి మీ స్నేహితుడికి చెప్పక పోయారా ఆ విషయం?

భర్త: నేను చెప్పను. పెళ్లికి ముందు నిన్ను చూసి కూడా వాడు నాకా విషయం చెప్పలేదు!

# బ్రెడ్ ఉప్మా




**తయారుచేసే పద్ధతి :**

ముందుగా పాన్‌లో నెయ్యి లేదా నూనె వేసి కాగనివ్వాలి. దానిలో ఆవాలు, జీలకర్ర, పెసరపప్పు, జీడిపప్పు, కరివేపాకు వేసి వేగనివ్వాలి. తరువాత అందులో తరిగిన ఉల్లిపాయ ముక్కలు, కొత్తిమీర వేయాలి. కొద్దిగా వేగాక అందులో పసుపు, సన్నగా తరిగిన పచ్చిమిర్చి, అల్లం వేసి కలపాలి. రెండు నిమిషాల తరువాత దానిలో బ్రెడ్‌ముక్కలు కూడా వేసి కలపాలి. చివరగా నిమ్మరసం కలపాలి. అంతే బ్రెడ్ ఉప్మా రెడీ!

## కావలసిన పదార్థాలు

- బ్రెడ్ ముక్కలు - 2 కప్పులు
- ఉల్లిపాయ - 1
- పచ్చిమిర్చి - 4
- అల్లం - చిన్నముక్క
- పసుపు - 1/2 టీస్పూన్
- నిమ్మరసం - 1 టేబుల్‌స్పూన్
- కొత్తిమీర - గుప్పెడు
- ఉప్పు తగినంత
- నెయ్యి లేదా నూనె - 1 టేబుల్‌స్పూన్
- ఆవాలు - 1 టీ స్పూన్
- జీలకర్ర - 1 టీస్పూన్
- పెసరపప్పు - 1 టీస్పూన్
- జీడిపప్పు - 10
- కరివేపాకు - ఒక రెమ్మ

## బ్లాక్ హెడ్స్ బాధిస్తున్నాయా?



ఉదయం మొహం కడుక్కోగానే బ్లాక్‌హెడ్స్ ఉన్న చోట ఆస్ట్రిజెంట్ లోషన్‌లో దూదిని ముంచి తుడవాలి. తరువాత నీటిలో కలిపిన బేకింగ్ సోడా రాయాలి. ఐదునిమిషాల తరువాత చల్లని నీటితో కడగాలి. ఇలా వారానికి రెండుమూడు సార్లు చేస్తే బ్లాక్‌హెడ్స్ పోతాయి.

**పురాణ విజ్ఞానం జవాబులు :** 1. కోదండం, 2. త్రిశూలం, 3. పాంచజన్యం, 4. నాగలి/రోకలి, 5. వజ్రాయుధం, 6. పరశువు, 7. కౌమోదకీ, 8. పాశం, 9. గాండీవం,10. దండం

## చిట్కాలక్ష్మి



★ క్యాబేజీ వండేటప్పుడు బిర్యానీ ఆకు వేస్తే పచ్చివాసన పోవడమే కాదు, కూర రుచిగానూ ఉంటుంది.

★ నిమ్మకాయలను ఫ్రిజ్‌లో ఓ గిన్నెలో వేసి ఉంచాలి. గాలి చొరబడని డబ్బాల్లోగానీ కవర్లలోగానీ పెట్టకూడదు.

★ మొక్కజొన్న కండెలను రేకులు తియ్యకుండా ఫ్రిజ్‌లో పెడితే మరికొద్దిరోజులు తాజాగా ఉంటాయి.

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**వుదయరాజు రవీందర్**

ఫ్లాట్. నెం. 16-1-52,
ఎస్. ఆర్. ఆర్. తోట,
కరీమాబాద్‌రోడ్, వరంగల్
పిన్ : 506 002

## చతురంగం - 52 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 దే | వ | 2 యా | 3 ని | | 4 నా | 5 లా | | 6 బా | 7 బా |
| వ | | 8 మి | క్కు | 9 టం | | 10 వా | 11 పు | | ణా |
| 12 కి | 13 లో | ని | | 14 త | 15 మ | | 16 ట | 17 పా | సు |
| | భి | | 18 న | 19 నం | 20 ది | | | 21 మ | రు |
| 22 భ | | 23 ప | వ | 24 సం | | 25 పి | 26 డు | రు | డు |
| 27 జె | 28 బు | | 29 మి | త | ము | | 30 రా | డు | |
| | 31 బా | 32 న | | ప | | 33 ద | శ | | 34 భూ |
| 35 క | వి | త్ర | యం | | 36 డో | ళ | | 37 బ | కం |
| 38 వి | ర | జ | | 39 తి | రు | ప | 40 తి | | ప |
| త | | 41 ని | శీ | థి | | 42 తి | మి | ర | ము |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. యు. జాన్సీలక్ష్మి, న్యూ పాల్వంచ, 2. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 3. ఎం. లక్ష్మణరావు, హైదరాబాద్, 4. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 5. కె.వి. దుర్గా మోహన్‌రావు, వనస్థలిపురం, 6. నందూరు లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్, 7. తిప్పావఝల తులశమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 8. నియాజ్ అలి, హైదర్‌గూడ, 9. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 10. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 11. మహావాది అశోక్‌కుమార్, చిక్కడపల్లి, 12. ధరణి పద్మాసన, నల్లకుంట, 13. డా. సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 14. దేవ(రాజు వెంకట. నరసింహారావు, చైతన్యపురి, 15. దేవ(రాజు లలితాదేవి, హైదరాబాద్, 16. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 17. ఎ. రంగనాథం, బెంగళూరు, 18. వై. లలిత, మాసాబ్‌ట్యాంక్, 19. ఆర్. భారతి, ఎమ్మిగనూరు, 20. కన్నెపల్లి నారాయణ మూర్తి, జీడిమెట్ల, 21. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 22. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 23. పి. శుభ, బంజారాహిల్స్, 24. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 25. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 26. పి. భావన, బర్కత్‌పురా, 27. అల్లూరి ఉమ, సింగరాయకొండ, 28. ఎస్. రామకృష్ణ, మైదుకూరు, 29. బచ్చు రోహిత్‌సత్య, కొత్తగూడెం, 30. కరణం శివానందరావు, కర్నూలు, 31. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 32. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 33. డా. శివభూషణం, కర్నూలు, 34. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 35. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 36. ఎస్. మణిమేగలై, తిరుపతి, 37. ఎం. వసంత, బోరబండ, 38. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 39. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 40. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 41. ఎం. అలిమేలు, మల్కాజ్‌గిరి, 42. పేర్వేల రాంబాబు, మణికొండ, 43. జి. కుసుమకుమారీ దేవి, పెడన, కృష్ణా జిల్లా, 44. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 45. బిరుదు సురేశ్‌బాబు, పేరాల, 46. సి. హెచ్. శివశంకరశాస్త్రి, లింగంపల్లి, 47. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 48. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 49. యిర్రి భక్తవత్సలరావు, చిలకలూరిపేట, 50. నోరి శివప్రకాశం, నెల్లూరు, 51. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 52. తటవర్తి రామలక్ష్మి, తాళ్లగడ్డ, 53. యు.యు.యు., ఎమ్మిగనూరు, 54. తూములూరు సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 55. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 56. బి. మనోహర్‌రెడ్డి, అక్కాయపల్లి, కడప,జిల్లా, 57. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 58. అత్తిలి. కస్తూరిభాయి, తిరుపతి, 59. సి. నిర్మల, తిరుపతి, 60. గోగాడ శ్రీలక్ష్మి, హోస్పేట, బళ్లారి జిల్లా, కర్ణాటక, 61. జె. జయశ్రీ, హైదరాబాద్, 62. జి.ఎల్.ఎన్. మూర్తి, నకిరేకల్, 63. వల్లూరి హైమావతి, బాగ్‌అంబర్‌పేట, 64. టి. లక్ష్మికుమారి, మచిలీపట్నం, 65. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, 66. జి.వి. రాఘవేంద్రరావు, బెంగళూరు, 67. ఎ. అరుంధతి, పుణె, 68. కె. లక్ష్మీకమల, విజయవాడ, 69. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 70. అడపా విఘ్నేశ్వరరావు, పర్లాకిమిడి, ఒడిశా, 71. గండ్లూరి బలరామశర్మ, నాచారం, 72. తొయ్యేటి వెంకటసూర్యం, విశాఖపట్నం, 73. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 74. అనంతుల స్వరూపరాణి, గుంటూరు, 75. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 76. వానపల్లి వెంకటసత్యగంగరాజు, విశాఖపట్నం, 77. డి. రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 78. అవధూత అన్నపూర్ణ హైదరాబాద్, 79. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్., 80. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, 81. యు. విజయశేఖరరెడ్డి, హైదరాబాద్, 82. ఆంధ్ర రామలక్ష్మి, తణుకు, 83. వక్కలంక విజయలక్ష్మి, విజయనగరం, 84. కర్నాటి అరుణ, ఖమ్మం, 85. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, 86. పప్పు శ్రీదేవి, అమలాపురం, 87. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 88. నున్న వెంకట సత్య నారాయణమూర్తి, యర్రవరం, 89. సౌదామిని నాగరాజన్, విశాఖపట్నం, 90. కె. వెంకుబాబు, గుంటూరు, 91. బి. రామమోహనరావు, హైదరాబాద్, 92. ఎస్. రవికిరణ్, విజయవాడ, 93. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 94. పి.వి. రమణరావు, విశాఖపట్నం, 95. బందెల ప్రణవ్, ఉయ్యూరు, 96. ఆకెళ్ల శశికళ, విశాఖపట్నం, 97. పి. సుజాత, గుంటూరు, 98. నెల్లుట్ల ప్రేమలత, హైదరాబాద్, 99. ఎస్.ఎల్. కామేశ్వరి, విజయవాడ, 100. మెరికపూడి సీతాపతిరావు, గుంటూరు, 101. కె. విమలాదేవి, జనగామ, 102. ఎం. ఉదయశ్రీ, హైదరాబాద్, 103. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 104. పి.వి. రవికుమార్, తిరుపతి, 105. ధప్పూరి సుధాదేవి, హైదరాబాద్, 106. మండవ శివరావు, ఖానాపురం, 107. ఎ. దేవేందర్, సుర్బిర్యాల్, 108. కందుల వెంకటబ్రహ్మమ్మ, బాపట్ల, 109. వాసా మోహన్‌రావు, విశాఖపట్నం, 110. కె. ప్రభావతీదేవి, వేదాయపాలెం, నెల్లూరు జిల్లా, 111. మంచిరాల వెంకటరమణ, నిర్మల్, 112. బాలా వెంకట నరసింహారావు, పేరాల, 113. చందు తులసి, శ్రీకాకుళం, 114. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 115. సి.ఎస్. లక్ష్మి, *(..128లో)*

# చతురంగం - 53 ఆధారాలు

## అడ్డం

1. అప్పట్లో కాంగ్రెస్ నేత, ఇప్పుడు తెరాస సెక్రటరీ జనరల్ (5)
4. 'బాహుబలి' భళ్లాలదేవ (2)
7. తెలుగులో 'జనరేషన్' (2)
9. కీర్తి (3)
10. 'ఠాకూర్' దర్శకుడు (6)
13. ముక్కుపుడక (2)
14. మందు బిళ్ల (2)
15. మొదలు, జూ. ఎన్టీఆర్ సినిమా (2)
16. శక్తి, సత్తా (3)
18. పండు కాదు (2)
19. ఏనుగు (2)
20. దప్పిక గొన్నవాడు (3)
23. భర్త (2)
25. ఆంగ్లంలో చిన్న (2)
27. సైగ, సంజ్ఞ (4)
29. యమలోకానికి మరోపేరు (3)
31. ఉర్దూలో నమస్కారం అటునుంచి (2)
32. భాషాపరమైన ఓ చక్కని అలంకారం (3)
33. వేగంగా అనడాన్ని ఇలా కూడా అంటాం (4)
36. అడ్డం పదిహేను మరోలా (2)
37. సంగీతం నేర్వాలంటే ఇవి రావాలంటారు (5)
38. ప్రణవ నాదం (1)

## నిలువు

1. జెండా (3)
2. బాణం (2)
3. రాఘవుని భార్య (3)
5. రామ్‌చరణ్ సినిమా (3)
6. పాదయాత్రల తర్వాత నాయకులు చేసేది (4)
8. బ్యాడ్మింటన్ తెలుగుతేజం (2)
10. గింజ, బీజం (2)
11. ప్రముఖుడు ఆంగ్లంలో (3)
12. ప్రయత్నం లాంటిదే (2)
13. సముద్రంలో కలిసేది (2)
14. ఇంద్రజాలికులు చేసేది (2)
15. వంశీ సినిమా (4)
16. ఓర్పు (3)
17. తిరగబడిన పాత్ర (2)
18. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, నిఖిల్ హీరోగా ఇటీవల వచ్చిన సినిమా (4)
21. నవ్వు (2)
22. కోరిక (3)
24. పిండి విసిరే రాతి ఉపకరణం (4)
26. 'నరసింహ' సినిమాలో రమ్యకృష్ణ పేరు (4)
28. చీకటి (3)
30. కొంగ.. శీర్షాసనం వేసింది (2)
34. రొప్పు, ఆయాసం (2)
35. ఖర్చుకు వ్యతిరేకం (2)

(127వ పేజీ తరువాయి...)

కర్నూలు, 116. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 117. నేమాన సుభాష్ చంద్రబోస్ విశాఖపట్నం, 118. పి.వి.ఎల్.ఎన్. సూర్య సంతోష్, కొత్తపేట, 119. ఎ. వైదేహీసాయి, హైదరాబాద్, 120. జి. రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 121. ఆదిలక్ష్మి, ఎస్.ఆర్.కె. పురం, 122. లింగబత్తుల భవ్యశ్రీ, హైదరాబాద్, 123. వి. ఇందిరా సుబ్రమణ్యం, సోమాజిగూడ, 124. సూరి నాగరాజు, బెంగళూరు, 125. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 126. పి. వంశీ కిశోర్, భూపాలపల్లి, 127. టి.ఎన్. లత, మంచిర్యాల, 128. సి. భారతి, మన్సూరాబాద్, 129. వై.వి. విజయకుమార్, విజయనగరం, 130. ఎం.వి.ఎన్. ధనలక్ష్మి, నరసాపురం, 131. కనకల అప్పారావు, విజయవాడ, 132. బొంతు రమాదేవి, కాజ, 133. కె. కల్యాణి, ప్రొద్దుటూరు, 134. జి. రాజేంద్ర, కామారెడ్డి, 135. కె. మోహన్, బెంగళూరు, 136. ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు, 137. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్. రావు నగర్, 138. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, 139. సి. మనోహరమ్మ, ఆర్. ఎస్. కొండాపురం, 140. గుర్రాల పద్మావతి, కూర్మన్నపాలెం, 141. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 142. వి.వి. సీత, ఎస్.ఆర్. నగర్, 143. మాచన్న, కళ్యాణదుర్గం, 144. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, నిజాంపేట రోడ్, 145. కొత్తపల్లి కళావతి, టెక్కలి, 146. మాడభూషి శేషమ్మ, బాగ్‌అంబర్‌పేట, 147. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 148. ముదుంబ సీత, భద్రాచలం, 149. పి. సీతారత్నం, నర్సాపురం.

# చతురంగం - 53

రూ.150/- బహుమతి

గడువు తేదీ : ఆగస్టు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | ■ | 4 | 5 | ■ | 6 |
| 7 | | ■ | | ■ | 8 | ■ | 9 | | సు |
| | ■ | 10 | ఏ | 11 | | 12 | | ■ | |
| ■ | 13 | | ■ | | ■ | | ■ | 14 | |
| 15 | | ■ | 16 | పి | 17 | ■ | 18 | | ■ |
| | ■ | 19 | | ■ | 20 | 21 | | ■ | 22 |
| 23 | 24 | ■ | 25 | 26 | ■ | 27 | | 28 | |
| 29 | | 30 | ■ | 31 | | ■ | 32 | | కం |
| ■ | 33 | | 34 | | ■ | 35 | ■ | | ■ |
| 36 | | ■ | 37 | | | | | ■ | 38 |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------------

------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : చతురంగం **చతుర,** ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040.- 23318181, Ext : 6658, 6532

# క్రైమ్, సస్పెన్స్ ప్రత్యేక సంచిక

**పార్టీలో** సెంటర్ ఆఫ్ ఎట్రాక్షన్‌గా నిలిచిన పొడుగుజడ అమ్మాయి జూలీ ఆ తర్వాత చలిరాత్రివేళ అతడిచ్చిన కోటు తీసుకుని భయం లేకుండా ఇంటికెళ్లిపోయింది. మర్నాడు ఏదోతెలీని ఆసక్తితో ఆమె ఇంటికి వెళ్లాడతడు. గేటు తీసుకుని లోపలికి ప్రవేశించిన అతడికి ఎదురైన నిజమేమిటి? చదవండి **రస్కిన్‌బాండ్** భారతీయాంగ్ల కథ **జూలీ**

**'క్యాచ్** హిమ్ డెడ్ ఆర్ ఎలైవ్' అంటూ బాసు ఓ ఫొటో ఇచ్చాడు. అతడ్ని వెతుక్కుంటూ వెళ్లి నామెని కమాండో అని గుర్తించడమే కాదు.. ఆమెపై కాల్పులు జరిపి పారిపోయాడా మోస్ట్‌వాంటెడ్. ఆ తర్వాత ఏమైంది? చదవండి **రామానుజ్ ఘోష్** హిందీ కథ **మహిళా కమాండో**

**ఆమె** ఎంతో ఇష్టపడిన రెడ్‌ఇండియన్ డిజైన్ గల ఆ ఖరీదైన కార్పెట్ ఎట్టకేలకు ఓ చెత్తకుండీలో దొరికింది. పొరుగింటాయన, లిఫ్ట్‌బాయ్ సాయంతో ఇంట్లోకి చేర్చిన ఆ కార్పెట్‌ని నేలపై పరచగానే అందులోంచి బయటపడిందో శవం! ఆ తర్వాత ఏం జరిగింది? చదవండి **స్టాన్లీ కోహెన్** అమెరికా కథ **కార్పెట్**

**'కొత్తజోడు** కరుస్తుందని, మనం పాతజోడు కొనుక్కోం కదండీ!' ఆమె మాట అతడికి తగలాల్సిన చోటే తగిలింది. ఓ క్లిష్టమైన సమస్యకు ఆ మాటలోనే పరిష్కారం లభించింది. ఇంతకీ ఆ మాట ఆమెందుకంది? అతడి సమస్యేమిటి? చదవండి **జయకాంతన్** తమిళకథ **కొత్తజోడు**

**35ఏళ్లనాటి విపుల కథలో..**

విస్మయం, ఉత్కంఠభరితం క్రైమ్, సస్పెన్స్ కథల సమాహారం.. ఆగస్టు **విపుల!**

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# కోట్లకు పడగెత్తిన

# పాలబ్బాయ్!

గోదావరి.. జయజయధ్వానాలు చేస్తూనే జీవనవేదం ప్రబోధిస్తుంది..
పవిత్రమైన ఆ నదీమతల్లి ఒడిలో జీవం పోసుకుందా గ్రామం!
ఆ పచ్చని నులివెచ్చని వాతావరణంలో ఊపిరి
పోసుకున్నాడా కుర్రాడు..
పసితనం నుంచీ కటిక పేదరికాన్ని చవిచూసిన
అతను అనూహ్యంగా కోట్లకు పడగెత్తాడు..
వీధి వీధి తిరిగి పాలమ్ముకున్న అతను కోట్లు ఎలా సంపాదించాడు?
స్వార్థం మచ్చుకైనా తెలియని నదీమతల్లి ఒడిలో
ఆడుతూ పాడుతూ పెరిగిన మనిషి పయనం ఎటువైపు సాగింది?
అది చివరికి ఏ దుష్కర పరిస్థితులకు దారి తీసింది?
ఆద్యంతం మానసంబంధాల్ని ఆర్థికబంధాల
తక్కెట్లో తూకంవేస్తూ సాగిన
సింహప్రసాద్ నవల **నదీ నరుడు**
చతుర సెప్టెంబరు కానుక!

*బోనస్‌గా..*

- నవలావలోకనంలో..
  ఒక తల్లిగా స్త్రీ పొందే మానసిక
  సంఘర్షణకు అక్షర చిత్రం
  సుప్రసిద్ధ కథకులు
  కొడవటిగంటి కుటుంబరావు గారి
  విలక్షణ నవల అనుభవం
- చమత్'కారం'లో
  అల్పకవుల గురించి కవి చౌడప్ప చెప్పిన
  చమత్కార పద్యం
- చతుర ప్ర.జ.లో
  'దండనం దశగుణం భవేత్' - అంటే?

ఇంకా మరెన్నో శీర్షికలు...

